# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి: 49 సంచిక: 8 386 నవంబర్ పేజీలు: 52 వెల: రూ॥ 20/-



క్కడికి పోతారు వాళ్లు
ళ్లీ ఏదో ఒక చెట్టువేరు పట్టుకొని
త్యపు చేతులతో తిరిగొస్తారు
మ్మల చెవిలో
లిన కులు రహస్యం గురించి గుసగుసలాడతారు
మ్మలుపూసే పువ్వుల పొత్తిళ్లలో
సిపాపలా పారాడి
చివరకు పిట్టల గొంతుపాటై
ళ్లీ పోరాట చిరునామై తిరిగి చిగురిస్తారు

1

# రాజ్యాంగం - పౌరహక్కులు

విమర్శనాత్మక దృక్పథం

ప్రొ॥ శేషయ్య





**ప్రొ॥ శేషయ్య** గారు ప్రజాస్వామ్య భావనను అమూర్తంగా చూడరు. మన సమాజంలో ప్రజాస్వామికీకరణకు ఉన్న అవరోధాల వైపు నుంచి ప్రజాస్వామ్యాన్ని చూస్తారు.అందుకే దాన్ని సాధించడంలో రాజ్యాంగానికి ఉన్న పరిమితులను అద్భుతంగా చెబుతారు. దీన్ని అధిగమించడానికి కోర్టు ద్వారా, చట్టాల ద్వారా, హక్కుల ప్రచారం ద్వారా నిరంతరం కృషి చేయాల్సిందే. అందులో పౌరహక్కుల ఉద్యమానికి కీలక స్థానం ఉంటుంది. అయితే రాజకీయ ఆచరణలో భాగంగా ఎదిగే ప్రజా చైతన్యంతో సంబంధం లేకుండా రాజ్యాంగంలోని వైరుధ్యాలను అధిగమించడం సాధ్యం కాదనే స్పష్టత ఆయనకు ఉంది. ప్రజల చైతన్యమే అనేక వైపుల నుంచి ప్రజాస్వామికీకరణకు దారి చూపుతుందని చెప్పడమే శేషయ్యగారి రచనల సారాంశం.

2




సంపుటి : 49 ◆ సంచిక : 8 ◆ నవంబర్ 2021 ◆ వెల : రు. 20/-

పాణి

# భయపెడుతున్నారా? భయపడుతున్నారా?

రచనా వ్యాసంగంలో తలమునకలైన వాళ్లకు కూడా సాహిత్య ప్రభావం గురించి సందేహాలు ఉంటాయి. తెలుగులో అచ్చయిన పుస్తకాలు వెయ్యి కాపీలు కూడా అమ్ముడుబోవడం లేదనే లెక్కలు వేసి సాహిత్య ప్రభావాన్ని అంచనా వేసే వాళ్లు ఉన్నారు. పుస్తకాలు పాఠకులను చేరే మార్గం లేకపోవడం వల్ల సాహిత్యం ప్రభావశీలంగా లేదనే వాళ్లూ ఉన్నారు.

ఈ ప్రమాణాలు సొంతం తప్పు కాకపోవచ్చు. కాకపోతే సాహిత్య ప్రభావానికి ఇవే తూనిక రాళ్లు కాదని అప్పుడప్పుడూ తెలుస్తూ ఉంటుంది. ఈ సంగతి రాజ్యం వైపు నుంచి కూడా తెలుస్తుంటుంది. అప్పుడైనా సాహిత్య ప్రభావాన్ని సవ్యంగా అర్థం చేసుకోగలమా? లేదా? అనేదే అసలు సమస్య.

మావోయిస్టు అమరజీవి కా. ఆర్‌కే స్మృతి రచనల సంకలనం 'సాయుధ శాంతి స్వప్నం' ప్రచురణను, ఆవిష్కరణ సభను తెలంగాణ ప్రభుత్వం అడ్డుకోవడంలో అనేక సంకేతాలు ఉన్నాయి. చాలా అర్థాలు ఉన్నాయి. మన దృష్టిలో ఉండీ మనం పెద్దగా పట్టించుకోని వాటిని అవి చర్చకు తీసుకొచ్చాయి. ప్రభుత్వం దీన్ని 'శాంతి భద్రతల' సమస్యగా భావించిందని అనుకోడానికి లేదు. ఒక వేళ నిజంగానే 'సాయుధ శాంతి స్వప్నం' పాలకుల శాంతి భద్రతలకు సమస్యగా మారి ఉంటే తప్పక దాన్ని అవతలి వైపు నుంచి చూడాల్సిందే. శాంతి ఎన్నడూ శాంతి మాత్రంగానే ఉండదు. భద్రతలో ఎన్నడూ భద్రత మాత్రమే ఉండదు. బాగా చెప్పాలంటే అందులో శాంతి భద్రతల సమస్య ఉండనే ఉండదు. వేరే చాలా ఉంటాయి. అవే అసలు సమస్య.

ఆర్‌కే మరణించాడని తెలిసినప్పటి నుంచి అనేక మంది దు:ఖానికి లోనయ్యారు. ఆయనతో తమకు ఉన్న అనుబంధాన్ని తరచి చూసుకున్నారు. ఆయన వ్యక్తిత్వాన్ని తెలుగు సమాజాల మానవీయ, చైతన్యక్రమాల్లో భాగంగా అర్థం చేసుకున్నారు. వాళ్లెవరికీ ఆర్‌కే తెలియదు. దగ్గరిగా చూసి ఉండరు. కానీ మానవాళికి శాశ్వత శాంతి ఎప్పటికైనా సాధ్యమే అని ఆయన చేసిన సామాజిక రాజకీయ ప్రయోగాలపట్ల, ఆయన ఎంచుకున్న ఆచరణపట్ల భావోద్వేగాలతో కూడా ప్రతిస్పందించారు.

ఈ ప్రతిస్పందనలు అక్షరాల్లోనే దాగి పోవని ప్రభుత్వానికి తెలుసు. పుస్తకంలోని అట్టల మధ్య అణిగి ఉండవని తెలుసు. చారిత్రక ప్రగతిదాయక స్వభావం ఉన్న భావాలు ఎక్కడ ఉన్నా మానవుల అంతరంగాలను తట్టి లేపుతాయని తెలుసు. కవిత్వం, పాట, జ్ఞాపకం.. అనే ఏ రూపంలో ఉన్నా అవి చైతన్యీకరణను తీవ్రంగా ప్రభావితం చేస్తాయని తెలుసు. అంతిమంగా ఆ పుస్తకంలోని ప్రతి ఉద్వేగం, ప్రతి జ్ఞాపకం, ప్రతి విశ్లేషణ భౌతికశక్తిగా మారతాయని రాజ్యానికి తెలుసు. సాయుధ శాంతి స్వప్నం అచ్చయి బైటికి వస్తే ఇక ఆర్‌కే మృతి చెందిన విప్లవకారుడిగాగాక ఎల్లెడలా మానవ స్పందనగా రూపాంతరం చెందుతాడని ప్రభుత్వం ఆందోళనకు గురైంది.

ఆ పుస్తకం బహుశా వేయి కాపీలో, ఇంకా తక్కువో పాఠకులకు చేరవచ్చు. అంతే. అంకెల్లో చాలా స్వల్పం. కానీ అందులోని సాహిత్య ప్రభావాన్ని రాజ్యం అట్లా చూడదల్చుకోలేదు. తెలంగాణ ప్రభుత్వానికి సాహిత్య స్వభావం, ప్రభావం గురించి సరిగానే తెలుసనుకోవాలి. ఆ మాటకొస్తే రాజ్యానికి ప్రజల చేతుల్లో ఉండే భావాలు, ఆయుధాలు, నినాదాలు, అక్షరాలు, పోరాట రూపాలు.. అన్నిటి పదునూ తెలుసు. అందుకే భావాలను పంచే, ప్రేరేపించే కళా సాహిత్యాలపట్ల అప్రమత్తంగా ఉంటుంది. వాటిని నిరంతరం అంచనా వేస్తూనే ఉంటుంది. అందుకే 'సాయుధ శాంతి స్వప్నం'లో విప్లవ సాహిత్యం ఉందని గుర్తించింది. కొన్ని దశాబ్దాలుగా ఆలోచనల మీద, విప్లవ భావాల మీద, సాహిత్యకారుల మీద దాడులు, నిర్బంధాలు, నిషేధాలు అమలు చేస్తున్న ప్రభుత్వం ఈసారి ఏకంగా ఆ పుస్తకమే బైటికి రాకూడదని అనుకుంది. హైదరాబాదులో నవ్య ప్రింటింగ్ ప్రెస్ మీద దాడి చేసింది. విలువైన వస్తువులను స్వాధీనం చేసుకుంది. ప్రింటర్ రామకృష్ణారెడ్డి మీద, ఆయన సహచరి..పీవోడబ్ల్యూ నాయకురాలు సంధ్య మీద తెలంగాణ ప్రజా భద్రతా చట్టం కింద కేసు పెట్టింది. సాయుధ శాంతి స్వప్నం పుస్తకావిష్కరణకు అవకాశం లేకుండా సుందరయ్య విజ్ఞాన కేంద్రం మీద ఒత్తిడి తెచ్చి సభ జరగకుండా చేసింది. దీన్ని అనేక మంది ప్రజాస్వామికవాదులు, సాహిత్యకారులు ఖండించారు.

ప్రభుత్వ చర్యలో ఇక ఎవ్వరూ కవిత్వం రాయడానికి,

(మిగితాది 7వ పేజీలో...)



గుంటూరుకు చెందిన ఎన్.నరసింహారావు గారు, అన్నమ్మ గారు విప్లవోద్యమ సానుభూతి పరులు. చాలా కాలం నుండి విరసంతో కలిసి ప్రయాణించారు. అన్నమ్మగారు అనారోగ్యంతో అక్టోబర్ 11న మరణించారు. ఆమె స్మృతిలో నరసింహారావు గారు అరుణతారకు పదివేల రూపాయలు విరాళంగా ఇచ్చారు. వారికి మా కృతజ్ఞతలు. అన్నమ్మ గారికి జోహార్లు.

ఎడిటర్
అరసవిల్లి కృష్ణ

వర్కింగ్ ఎడిటర్
పి. వరలక్ష్మి

రచనలు పంపించాల్సిన చిరునామా :
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు-516360.

* email : arunatara1977@gmail. com

Like Page:
//viplava rachayitala sangahm arunatara

facebook:
//viplava rachayitala sangahm virasam

Virasam website :
www. vasanthamegham.com

చందాలు, విరాళాలు పంపవలసిన చిరునామా
అరసవిల్లి కృష్ణ, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001.
చెక్‌లు / డ్రాఫ్టులు / ఆన్‌లైన్‌లో పంపడానికి
A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714, Branch : Vagu Center, Vijaywada.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

# ఈ సంచికలో



## వసంతమేఘం అంతర్జాల పత్రికలో..

### అక్టోబర్ 15, 2021 సంచిక



### నవంబర్ 1, 2021 సంచిక

# లాల్-నీల్ మైత్రీ వేదిక ఒక పార్టీ కాదు

మిత్రమా పాణీ గారు నమస్తే!

లాల్-నీల్ మైత్రి కోసం కృషి చేయవలసిన అవసరం నేడు ఎంతో వుందని తెలిపారు, అందుకోసం మేము ప్రచురించిన పుస్తకాన్ని కూడా అభినందించారు, ధన్యవాదాలు మిత్రమా!

మీకు లాల్-నీల్ మైత్రి వేదిక ద్వారా కొన్ని విషయాలు దృష్టికి తెస్తున్నాము.

ఇది వేదిక, లాల్-నీల్ మైత్రీ వుమ్మడి భావజాల ప్రచార వేదిక. ఇందులో వుండే వారు ఒక స్థూలమైన, విశాలమైన అవగాహనతో వుంటారు, అనేక అంశాలలో విభిన్న అభిప్రాయాలు వున్నప్పటికీ వుమ్మడి లక్ష్యాలు కలిగి వుంటారు. వేదిక అంటేనే అలాటి స్వభావం వుంటుందని మీకు తెలియని విషయం కాదు.

నేటి ఫాసిస్టు పాలకులు ప్రజల హక్కులన్నిటినీ నిర్భయంగా, సంకోచం లేకుండా రద్దు చేస్తున్నారు. మనువాద రాజ్యాంగం స్థానంలో మనుషులందరికీ సమాన విలువను ప్రతిపాదించుతూ ఒక ప్రజాస్వామిక వ్యవస్థకు అవసరమైన రాజ్యాంగం అంబేద్కర్ రాశారు. వేలాది సంవత్సరాలుగా విద్యకు, సంపదకు దూరం చేయబడిన సమూహాలు - స్త్రీలకు, దళితులకు వాటిని పొందే హక్కులు కలిగించారు.

రాజ్యాంగంలో పొందుపరచని అనేక ప్రగతిశీల చట్టాలను - మహిళా సాధికారత, ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు అమలు చేయించుకోవడం వంటి చట్టాలు వలస చట్టాలు అయిన ఐపిసి, సిఆర్‌పిసి మరియు దేశద్రోహ చట్టాలు, తదితర చట్టాలను రద్దు చేయించుకోవడం మొదలయిన కర్తవ్యాలు విశాల ప్రజలను సమీకరించి బలమైన వుద్యమాలు నిర్మించి సాధించవలసి వుంది. బాబా సాహెబ్ అంబేద్కర్ ప్రగతిశీల శక్తుల కోసం ఆ కర్తవ్యాలను వదలి వెళ్ళాడు.

వలస చట్టాలను రద్దు చేయించుకోవడం, రాజ్యాంగం ద్వారా ప్రజలకు ఏర్పరచబడిన హక్కులను కాపాడుకోవడం కోసం విశాల ప్రజలను సమీకరించడానికి మైత్రీ శక్తులను కూడగట్టవలసి వుంది. వలస చట్టాల పునాది పైననే ఊపా వంటి చట్టాలు రూపుదిద్దుకున్నాయని మనందకూ తెలిసిన విషయమే, ఆ చట్టాలు రాజ్యాంగ రచన సందర్భంలో రద్దు కాని ఫలితంగా ఆ చట్టాల ఆధారంగా రాజ్యాంగ పీఠిక యొక్క లక్ష్యాలను పాలకులు నెరవేర్చకుండా చేయగలిగారు. అందుకని ఆ చట్టాలను రద్దు చేయించుకోవలసిన బాధ్యత మన మీద వున్నది. అంతే కాదు! సుదీర్ఘ ప్రజా ఉద్యమాల ఫలితంగా, సామాజిక విప్లవకారుల కృషి ఫలితంగా రూపొందిన అనేక ప్రగతిశీల అంశాలను చట్టాలలో చేర్చుకున్నాము.

ఆ ప్రగతిశీల అంశాలను పరిరక్షించుకొని వాటిని మరింత మెరుగు పరచుకోవలసిన బాధ్యత మన మీద వుంది. అత్యంత అమానవీయ, క్రూర వివక్షతలకు, దోపిడీకి గురవుతున్న దళితులు, ఆదివాసీలు, సంచార జాతులు ఇతర వుత్పత్తి మరియు సేవక శూద్ర బహుజన కులాలు మన దేశంలో వున్నాయి, ఇంకా పాలకులతో పరాయివారిగా చూడబడుతూ వివక్షతకు, తీవ్ర హింసకు గురవుతున్న మైనారిటీలు వున్నారు.

వీరందరూ లాల్-నీల్ శక్తులకు కావలసిన వారే, ఆ లాల్-నీల్ శక్తులలోనే వారు వివిధ చీలికలతో అనైక్యంగా వున్నారు, వారందరినీ సమైక్య పరచవలసిన చారిత్రక అవసరం నేడు వుంది.

"సరయిన పంథా లేక సిద్ధాంతం" అని ఎవరికి వారు భావించుకుంటున్న లాల్ శక్తులు సంఘటిత పడకపోగా సిద్ధాంతం - పంథాల పేరుతో నిరంతరం చీలికలు, పేలికలు అవుతున్న పరిస్థితి మన కళ్ళెదుట వుంది, ప్రజలకు నాయకత్వం అందించ లేని పరిస్థితికి అది దారితీసింది. ఇవి కోపంతో కాకుండా ఆవేదనతో చెబుతున్న మాటలు మాత్రమే

మిత్రమా! ఒక్క వాక్యంలో చెప్పాలంటే మనువాద భావజాల వ్యతిరేక శక్తుల వుమ్మడి భావజాల వేదిక మా లాల్-నీల్ మైత్రీ వేదిక. మీరు విమర్శకు కేంద్రంగా చేసుకున్న విషయం పార్లమెంటరీ పంథా పట్ల, సాయుధ పోరాట పంథా పట్ల మేము వైఖరి చెప్పలేదు అనే విషయం. ఆ విషయాన్ని ఆధారం చేసుకుని ప్రధానంగా మీ విమర్శ సాగింది. నిజమే చెప్పలేదు.

మీరు ప్రస్తుతం అడిగినట్లుగానే పోయిన సంవత్సరం కొందరు వామపక్ష మిత్రులు మమ్ములను సోషల్ మీడియాలో ఇలాగే ప్రశ్నించారు. మీరు అడిగిన ప్రశ్నలతో పాటు వారు ఇంకా కొన్ని కూడా అడిగారు.

మన దేశం అర్ధవలసనా! పెట్టుబడిదారీ వ్యవస్థనా! దళారీ పెట్టుబడిదారీ వర్గం గురించి ఏమి చెబుతారు! సామ్రాజ్యవాదం గురించి చెప్పనే లేదు, ఈ రాజ్యాంగ యంత్రం వర్గస్వభావం ఏమిటి? తదితర ప్రశ్నలు అడిగారు. అలాగే లాల్, నీల్ సిద్ధాంతాలు పొసగవు గదా! వాటితో ఒక పార్టీని ఎలా ఏర్పరుస్తారు వంటివి అడిగారు. ఐక్యత - ఐక్య కార్యాచరణ, ఐక్య సంఘటనలను గందరగోళ పరుస్తున్నారు అని ఒక కమ్యూనిస్టు పార్టీని వేరొక కమ్యూనిస్టు పార్టీ వారు ప్రశ్నించిన తరహాలో మమ్ములను ప్రశ్నించారు, ఇది ఒక విశాల వేదిక అనే అవగాహనను మరచి ప్రశ్నించారు. వీటిలో కొన్ని మీరు అడగలేదు, సంతోషం.

మేము కమ్యూనిస్టు పారిభాషిక పదజాలాలను వాడలేదు గానీ ఆ అంశాలన్నిటి పైన పరోక్ష పద్ధతిలో మా వైఖరి- ప్రజా అనుకూల వైఖరిని చెప్పాము.

ప్రజలు మన దేశంలోను, ప్రపంచంలోను సాగించే ప్రజా వుద్యమాలను, సమసమాజం కోసం ప్రజలు సాగించే వుద్యమాలను బలపరిచేదిగా మన గ్రూపు వుంటుంది అని మా పుస్తకంలోని 'లాల్-నీల్ మైత్రి కోసం అవగాహనా పత్రం' లో చెప్పడం ద్వారా మా వైఖరి మేము స్పష్టపరిచాము. ఇది ఆ పుస్తకంలోని 21వ పేజీలోని 4వ పాయింటులో వుంది.

అలాగే పోయిన సంవత్సరం మా పైన విమర్శ చేసిన వారి కోసం "లాల్- నీల్ ఐక్యత/ మైత్రి అంటే రెండు సిద్ధాంతాల ఏక పార్టీ అవగాహన కానే కాదు" అను వ్యాసం ద్వారా సమాధానం చెప్పి వున్నాము. మా పుస్తకంలోని ఎక్కువ వ్యాసాలను ప్రస్తావన చేసిన మీరు ఆ వ్యాసాన్ని, అందులోని విషయాలను ప్రస్తావన చేయకపోవడం, మీరు చెప్పాలి అనుకున్న విషయాలకు ఆ వ్యాసం ఆటంకం అవుతుందని భావించి వదిలి వేశారా అనిపించింది. ఆ వ్యాసం చదవకపోతే మీరు

చదవండి. అది మీ కొన్ని ప్రశ్నలకు అయినా సమాధానం చెబుతుంది. ఆ వ్యాసం పుస్తకంలో 155 వ పేజీలో వుంది చూడగలరు.

లాల్ పట్ల విమర్శించిన తీరులో ఒకంత తక్కువగా మేము నీల్‌ని విమర్శించాము అని మీ వ్యాసంలో రాశారు. కమ్యూనిష్టులు n@>$T<Bo (Vanguard) పాత్ర నిర్వహించాలని మహనీయుడు మార్క్సిస్టు మహోపాధ్యాయుడు లెనిన్ చెప్పిన సంగతి అందరికీ తెలిసిన బహిరంగ విషయమే! అగ్రగామి దళం అంటే అర్థం మిత్రశక్తులను కలుపుకోవలసిన బాధ్యత, వారిని మన మైత్రీ శిబిరం వైపుకు తీసుకురావలసిన బాధ్యత అగ్రగామి దళం మీదనే వుంటుంది అని అర్థం.

అలా అయినప్పుడు లాల్ శక్తుల మీద బాధ్యత ఎక్కువ వుందని భావించిన ఫలితంగా ఆ విమర్శ కొంత ఎక్కువ అవసరం కాదా! లాల్ శక్తుల బాధ్యత ఎక్కువ వుందని చెప్పడం సహజ న్యాయమే గదా!

పాణి గారూ!

నేర్చుకోవడంకు సంబంధించి వామపక్ష శక్తులు మాత్రమే నేర్చుకోవాల్నా అంటే, లాల్, నీల్ ఇద్దరు నేర్చుకోవాల్సింది చాలా ఉంది. అయితే, సమస్త దోపిడీ, పీడన, అణచివేతలను రద్దు చేసి, ఏ రూపంలో కూడా ఒక మనిషి ఇంకో మనిషిని దోపిడీ చేసే, అణచివేసే పద్ధతులు లేని సమసమాజ స్థాపన ఏర్పాటు లక్ష్యంగా చేసుకున్న లాల్ శక్తులు ఇతరులను కలుపుకోవడంలో ఇంకొంత ఎక్కువ నేర్చుకోవాల్సిన బాధ్యత ఉంటుంది గదా!

మీరు చేసిన విమర్శలు ఒక పార్టీ పైన చేసిన విమర్శలు తరహాలో వున్నాయని చెప్పక తప్పదు. మీరు వ్యాసాలలో మీకు కావలసిన వరకు తీసుకుని ఆ వ్యాస రచయితల Spirit ని , ఉద్దేశాలను గమనించ లేకపోయారు,

ఈ లాల్- నీల్ మైత్రీ వేదికను ఒక కమ్యూనిస్టు పార్టీలాగా భావించి రచయితలు సాధారణ స్థాయిలో వాడిన పదాలకు మార్క్సిస్టు పరిభాషలోని అర్థాలను మీరు చెప్పారు (ఉదాహరణకు అన్య వర్గ ధోరణులు వంటి మాటలు).

ఇది వేదిక, ఈ వేదికలో మార్క్సిస్టేతర రచయితలు కూడా సహజంగా వుంటారు, వున్నారు, వారి రచనలలోని Spirit ముఖ్యంగా తీసుకోవాలి.

మరి ఒక సారి వేదిక ప్రస్తావన:

లాల్- నీల్ మైత్రీ వేదిక అనేది అనేక మిత్ర శక్తుల కూడలి స్థలం. ఇలాటి అనేక వేదికలు బలపడితే భవిష్యత్తులో బలమైన సంఘటనలకు పునాది కావచ్చును. మీ విమర్శ వేదికల పరిధిని దాటి పార్టీల పైన విమర్శల స్థాయిలో వున్నాయి, ఆ విమర్శలు మా వేదికకు వర్తించవని చెప్పడం మాత్రమే సరయినది అని మేము భావిస్తున్నాము.

మీ మైత్రీ పూర్వక విమర్శను ఆహ్వానిస్తూ, మైత్రీ పూర్వక విమర్శలు మరచిపోతున్న నేటి పరిస్తితులలో మీ విమర్శ మంచి సంప్రదాయంతో రాశారు, అంతేకాదు లాల్- నీల్ మైత్రి నేడు చాలా అవసరమని చెప్పారు, అందుకు మరి ఒక సారి మీకు అభినందనలు తెలుపుతున్నాము.

లాల్ సలామ్!

నీల్ సలామ్!

**సామాజిక మైత్రి వందనాలతో**
**లాల్-నీల్ మైత్రీ వేదిక**

# ఆ వ్యాఖ్యలు నన్ను బాధపెట్టాయి

సెప్టెంబర్ 2021 అరుణతారలో నేను రాసిన "నన్ను తీర్చిదిద్దిన కరణన్న" వ్యాసానికి

"శిరోమణి వ్యాసంపై నా అభ్యంతరాలు" పేరుతో అక్టోబర్ 2021లో నల్లూరి క్రాంతి గారి వ్యాసం చదివాను.

కరుణతో నా అనుబంధాన్ని జ్ఞాపకం చేసుకుంటూ నేను చూసినది, విన్నది, నా సమక్షంలో జరిగినది నా ఎరుకలో రాసాను. దానికి ఏమైనా అభ్యంతరాలుంటే చెప్పమని కరుణాకర్ సహచరి ఝాన్సీ అక్కను అడగడం, ఆమె సూచనలతో కొన్ని తొలగించడం జరిగింది. మొత్తం నా వ్యాసాన్ని కరుణ మిత్రులు గ్రూపులో చర్చించాము. అందులో కరుణ సహచరి ఝాన్సక్క, కరుణన్న చిరకాల మిత్రులు వీరయ్యన్న కూడా ఉన్నాడు.

నేను రాయలేకపోయినవి, నాకు తెలియనివి నేను మరచిపోయినవి ఏవైనా వుంటే గుర్తుచేస్తూ ఎవరైనా రాయవచ్చు.

నా పాత్ర ఎక్కువ చేసుకొని రాయడం వల్ల నాకు కలిగే ప్రయోజనం ఉండదు. అలాగే కొందర్ని తక్కువ చేయడం వల్ల నాకు కలిగే ఉపయోగాలుండవు.

నేను చాలా అసత్యాలు రాశాననీ, గతంలో కూడా అమరుల జ్ఞాపకాలలో కూడా ఇలాగే అసత్యాలు రాశానని అనడం భావ్యం కాదు. ఈ వ్యాఖ్యలు నన్ను బాధపెట్టాయి.

ఇక వాళ్ళ విజ్ఞతకే వదిలేస్తున్నాను.

**శిరోమణి**

---

విశ్లేషణలు చేయడానికి, వాటిని అచ్చేయడానికి వీల్లేదనే హెచ్చరిక ఉన్నది. ప్రజలను భయపెట్టే ఉద్దేశం ఇందులో ఉన్నది. కానీ ఇదంతా భయపెట్టడమేనా? ఈ చట్ట వ్యతిరేక, రాజ్యాంగ వ్యతిరేక చర్యల్లో ఇదొక్కటే ఉన్నదా? చట్టం పట్ల కనీస ఖాతరు లేని ప్రభుత్వం చట్ట వ్యతిరేకంగా, నీతి బాహ్యంగా, బరితెగింపుగా ఈ చర్యలకు పాల్పడటం వెనుక భయం కనిపించడం లేదా? ఆర్కే జ్ఞాపకాల తలపోత, ఆయన గురించి అంచనా, ఆయన ప్రాసంగికత గురించి చెప్పే సాహిత్యమంటే కేసీఆర్ ప్రభుత్వానికి భయమని ఈ ఘటన ద్వారా తెలిసిపోలేదా? నిత్యం ప్రజలను భయంలోకి తోసేసి తన అధికారాన్ని భద్రంగా కాపాడుకుందామనుకున్న పాలకుల భయాన్ని పసిగట్టలేకపోతే అంతిమంగా సాహిత్య ప్రభావాన్ని మనం సవ్యంగా అర్థం చేసుకున్నట్లేనా? ఒంటరి దు:ఖం, ఏకాకితనంలోని పలవరింత, సొంత అన్వేషణ గురించి ఎంత రాసుకున్నా, ఎన్ని పుస్తకాలు అచ్చేసుకున్నా పర్వాలేదు. దు:ఖాన్నే ఒక సామూహిక చర్యగా మార్చే కవిత్వమంటే పాలకులకు ఎంత భయమో చూడండి.

ఇంతకూ కేసీఆర్ ఆస్థానంలో గతంలో ఉండిన, ఇప్పుడు పదవులు అనుభవిస్తున్న కవులు, కళాకారులు, మేధావులు సాహిత్యంపట్ల తమ ప్రభుత్వ వైఖరిని ఎట్లా విశ్లేషిస్తారు? ఎలా సమర్థించుకుంటారు? ఇప్పటికీ వాళ్లు నోరు తెరిచి మాట్లాడలేదు. వాళ్లనే ఎందుకనుకోవాలి? పీడిత అస్తిత్వాల విముక్తి గురించి, అభ్యుదయం గురించి మాట్లాడేవాళ్లలో అనేక మంది ఒక్క మాటైనా అనలేదు. వాళ్లకు సాహిత్యంపై కేసీఆర్ ప్రభుత్వ వైఖరితో ఏకీభావం ఉందనుకోవాలా? అట్లా అనుకుంటే తప్పవుతుందా?

# తల్లులూ- పిల్లలూ

సాధన



పన్నెండు రోజులుగా పొద్దు ముఖం అగుపడడమే లేదు. చల్లటి వాతావరణానికి తోడు మధ్య మధ్య ఈదురు గాలులు వీస్తున్నాయి. ఒళ్లు వేడిని కోరుకోంటోంది. వరుసగా తెరిపిలేని ముసుర్లు పడుతున్నయి. మధ్య మధ్య కుండపోత కురుస్తోంది. వాగులు, వంకలు పొంగి పొర్లుతూ ప్రయాణాలకు బ్రేకులు వేస్తున్నాయి. బస్తర్, గడ్చిరోలి జిల్లాలు ద్వీపంలా తయారయ్యాయని రేడియోలో చెబుతున్నారు. నదుల నీటి మట్టం ప్రమాద సూచికలను చేరాయనే వివరాలు చెబుతున్నాయి.

ధంకినీ, శంఖినీ, మిన్‌గచ్ఛ, బాందే, దీనా, పరాల్‌కోట, పాములగౌతమి నదులన్నీ పొంగి దిగువన గోదావరిలో కలుస్తున్నాయి. భద్రాచలం వద్ద నది 54 అడుగులకుపైగా చేరిందంటున్నారు.

అనేక ఊళ్లలోకి వరద నీరు చేరింది. జనాలు ఊళ్లు ఖాళీ చేసి సురక్షిత ప్రాంతాలకు వెళ్తున్నారు. లోతట్టు గ్రామాలకు వాహనాలు నడవడం లేదు. కానీ కొరోనా రోగుల సంఖ్య మాత్రం పెరుగుతూనే ఉంది. అడవిలోకి వచ్చిన అదనపు పోలీసు జవానులు కొరోనా వాహకులుగా మారిపోయారు. ఆదివాసులకు వైరస్ అంటించే ప్రమాదం రోజు రోజుకూ పెరుగుతోంది. వరదలు, కొరోనా ఏదీ పోలీసుల గాలింపులకు అడ్డం కావడం లేదు.

దండకారణ్యమంతా కార్పెట్ సెక్యూరిటీతో నిండిపోయింది. పోలీసు క్యాంపు లేని ప్రాంతమేదీ లేదు. పోలీసులు ఇట్లా కొత్తగా క్యాంపులు పెట్టడాన్ని వ్యతిరేకిస్తూ రోజులు, వారాలు పోరాటాలు చేస్తున్నారు. సర్కార్ 1996లో తయారు చేసిన పెసా కానున్‌ను పట్టుకొని ఊళ్లో గ్రామసభ పెట్టుకుంటే, దాన్ని ఏ కలెక్టర్, ఏ అధికారి పట్టించుకోవడం లేదు. ఖాకీల ముందు ఏ కానూన్ పనిచేయదని జనాలకు అర్థమైంది. అడవిలో పోలీసులు అంతటా పరికి కంపలా పరుచుకుపోయారు. గ్రామాలపై తరచుగా విరుచుకుపడుతున్నారు.

గత కొన్ని మాసాలుగా అరెస్టులో, ఎదురుకాల్పుల వార్తలో, లొంగుబాట్లో రేడియోలో చెప్పని రోజు ఉండడం లేదు. ఆడవాళ్లకు ఖాకీల వ్యవహారం రోజు రోజుకూ విషమిస్తోంది. మా ఊళ్లో పోలీసులొద్దు అంటూ జనాలంతా చేరి క్యాంపుల ముందు గొడవ పడడం సాధారణమైపోతోంది.

రుషి పడుకున్న దేరా పక్కనే ఉన్న ఓ చిన్న కాలువలో నీళ్లు బండల మధ్య నుండి వేగంగా ప్రవహిస్తున్నాయి. దాని చప్పుడుమోతతో అయనకు నిద్ర రావడం లేదు. టైం ఇంకా రాత్రి తొమ్మిది కూడా కాలేదు. రోజూ రాత్రి పదకొండుకు ముందు పడుకునే అలవాటు లేదు. దాంతో పక్క మీదా దొర్లడం తప్ప కునుకు వచ్చే జాడ అగుపడడం లేదు. ఏదైనా చదువుకుందామంటే ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్‌లో బ్యాటరీలు నిండుకున్నాయి. అవి మాత్రం సుబ్బరంగా పడుకున్నాయి. గత నాలుగేళ్లుగా విద్యుత్ జనరేటర్‌ల వాడకం లేకుండా పోయి అడవిలో

అంతా సోలార్ పానెళ్లతోనే వ్యవహారం నడుస్తోంది. అయితే పొద్దు దర్శనం ఇవ్వని రోజు రాతా, చదువూ అన్నీ బందే! అ రోజు అప్రకటిత సెలవుదినం!

**సుబోజిత్ వ్యాసంలో అర్జున్:**

రుషి మనసులో సుబోజిత్ బగ్చీ వ్యాసమే మెదలుతోంది. ఆయన 'ది హిందూ'లో పాత్రికేయుడిగా ఉన్నపుడు 50 సంవత్సరాల నక్సల్బరీ వేడుకలపై రాసిన వ్యాసం అది. అందులో ఆయన వరంగల్ జిల్లా, తంగళ్లపెల్లికి చెందిన రవీందర్ గురించి రాశాడు. విప్లవోద్యమం నుండి 2014లో లొంగిపోయిన రవీందర్ దగ్గర వ్యాసం మొదలై, కలకత్తాలో ఉంటున్న చారుమజుందార్ కూతురు డాక్టర్ అనిత వద్దకు వెళ్లి, అక్కడి నుండి అనాటి ఉద్యమ కార్యకర్త మల్లికతో ఆయన చైనా వెళ్లి వచ్చిన అనుభవాలను తెలుసుకొని బగ్చీ రాస్తూ రాస్తూ తిరిగి రవీందర్ వద్దకే చేరి వ్యాసాన్ని ముగించాడు.

అ రోజుల్లో అర్జున్ పేరుతో దండకారణ్య ఉద్యమ నాయకుడిగా, గెరిల్లాల కమాండర్-ఇన్-చీఫ్‌గా ఉన్న రవీందర్‌ను 2010లో బగ్చీ ఇంటర్వ్యూ చేశాడు. అర్జున్ రవీందర్‌గా అవతారమెత్తాక గడుపుతున్న జీవితాన్ని మాత్రం బగ్చీ ఎందుకూ కొరగాని జీవితమని నర్మగర్భంగా చూపించాడు. అర్జున్ ఒక విప్లవకారుడిగా ఉన్న రోజుల్లో ఆయన ఆదేశాలు పాటించడానికి వందలాది గెరిల్లాలు సర్వదా సంసిద్ధంగా ఉండేవారు. కానీ, పోలీసుల కాళ్లముందు సాష్టాంగ పడిపోయాక ఈ రోజు ఆయన భవిష్యత్ జీవితానికంతా ఇక తన 14 నెలల పాప 'రక్షిత'నే దిక్కయిందని అర్జున్ తానే చెప్పుకున్నాడు. ఇదే ఆయన దీనావస్థకు అద్దం పడుతోంది. ఆయన సహచరి అడిమే (దేవే) భారత విప్లవోద్యమంలోనే తొలిసారి దండకారణ్యంలో పోలీసుల మందుపాతర నిరోధక వాహనాన్ని (ఎమ్.పీ.వీ.) పేల్చిన గెరిల్లా మహిళ. వీరవనితగా ఎంతో గౌరవాన్ని సంపాదించుకుంది. ఎమ్.పీ.వీ. గురించి శత్రువు పలికే ప్రగల్భాలన్నీ దేవే చేసిన చర్యతో తునాతునకలయ్యాయి. అధికారుల వాగుడంతా తుస్సుమంది. కానీ అలాంటి ఆ దంపతులకు ఈ రోజు మిగిలింది పాపం రక్షితే!

మావోయిస్టుగా "ద" దండకారణ్యంలో ఉన్నపుడు ప్రభుత్వానికి కునుకు పట్టనీయని గెరిల్లా అర్జున్ ఇప్పుడు సర్కార్ అందించిన డబ్బుతో పబ్బం గడుపుతున్నాడు. అదీ అమ్దాని లేని రైతు జీవితంలో తన పాప కోసం సెక్యూరిటీ గార్డుగానైనా కొలువు తీరుతానని, తనకా తెలివితేటలున్నాయని ఆ పాత్రికేయుడికి చెప్పుకున్నాడు.

ఆ వ్యాసంలోని అర్జున్ -దేవే -రక్షితలతోపాటు తేజ, సంధ్య,

రంజిత్, భగత్, రమేశ్, స్వప్న స్నేహ, రాజా, రమ్య, వివేక్, అశ్విని, చిన్నారి నవ్నీల వరకు తనకు తెలిసిన విప్లవకారుల పిల్లలంతా కదలాడారు. అ పిల్లలంతా ఉద్యమ పొత్తిళ్లలో పురుడుపోసుకున్న బిడ్డలే! వాళ్ల తల్లి తండ్రులు సాయుధ ఉద్యమంలో పాలు పంచుకుంటూ వారికి జన్మనిచ్చారు.

కొంతమంది బయటి జీవితంలోనే పిల్లలను కన్నారు. ఆ తల్లిదండ్రులు తమతోపాటు ఉద్యమంలోకి పిల్లలనూ తెచ్చారు. మరికొంత మంది తాము తల్లి తండ్రులం కావాలని కోరుకోకున్నప్పటికీ సకాలంలో జాగ్రత్తలు తీసుకోకపోవడంతో పుట్టిన పిల్లలూ ఉన్నారు. ఐదు మాసాలకు పైబడిన గర్భాన్ని తొలగించడానికి పార్టీ అనుమతించదు. అలా పుట్టిన పిల్లలూ ఉన్నారు. వారంతా తమ తల్లిదండ్రులతోపాటు ఉద్యమంలో ఎదుగుతున్నారు. వాళ్లలో సాయుధ సమరాంగాన ఒరుగుతున్నవాళ్లూ ఉన్నారు. ఇదంతా రుషి మనసులో మెదిలింది.

కానీ, వారందరికి భిన్నంగా పుట్టింది రక్షిత. అందులో ఆ పాప ప్రమేయం ఏమీ లేదు. జనం కోసం సర్వం అంకితం చేసిన రోజుల్లో అర్జున్-దేవే పిల్లలను కోరుకోలేదు. అ జీవితానికి దూరమయ్యాక లొంగుబాటు డబ్బులతో తిరిగి 'రీచానలైజేషన్' అపరేషన్ చేయించుకున్నాక పాప పుట్టింది. అలా దిక్కులేకుండా పోయిందనుకున్న తమ జీవితాలకు రక్షితను దిక్కు చేసుకొన్నారు. బతుకు పందేరంలో తంటాలు పడుతున్నారు.

**స్వప్న, తేజ, వివేక్-వారిని కన్నవారు:**

ఇంటి దగ్గరే బిడ్డలకు జన్మనిచ్చి తమతో పాటు అ బిడ్డలను సైతం ఉద్యమ పొత్తిళ్లలో 'పెంచుకుందామనే అంకితభావంతో అలోచించినప్పటికీ విప్లవ జీవితంలో అది సాధ్యం కాదని అర్థమయ్యాక, తమ కడుపు పంటలను విప్లవ సానుభూతిపరులకు పెంపకానికి ఇస్తే ఇక ఆ పిల్లల భవిష్యత్ ఏ మలుపు తీసుకుంటుందో! జన్మనిచ్చిన అమ్మ నాన్నలకు అణు మాత్రమైనా సంబంధం లేకుండా పోతుందని స్వప్న జీవితం తెలుపుతోంది. అందుకు భిన్నంగా జనం మధ్య జీవించిన శంకర్ జీవితం, ఆయన తల్లి త్యాగం ఋషి అలోచనలలో పదే పదే తలంపుకు వస్తున్నవి.

తనకు జన్మనిచ్చిన తండ్రి పోలీసుల తూటాలకు బలై, అపాదమస్తకం చిత్రహింసల పాలై అసువులు బాసినాడు. ఆయన పార్థివ శరీరాన్నైనా చూడని, ఆయన తన తండ్రి అని తెలియని స్వప్నలాంటి వాళ్లకు జన్మనిచ్చిన ఉద్యమ తల్లులు అనుభవించే క్షోభకు అక్షర రూపం ఎవరు ఇవ్వగలరు? బిడ్డకు జన్మనిచ్చిన తండ్రి అనుపానాలైనా తెలువకపోవడం ఎంతటి విషాదం! దాని కన్నా పిల్లలు అవసరం లేదని, జనం బిడ్డలే తమ బిడ్డలనే చైతన్యాన్ని ప్రదర్శించిన గెరిల్లా సహచరుల జీవితాలే ఎంతో మెరుగనుకుంటూ రుషి తన సోదరుడి అమర జ్ఞాపకాలతో కన్నీరు కార్చాడు.

మా స్వప్న మాకొక స్వప్నంగానే మిగిలింది. అది మా బిడ్డ అని చెప్పుకోవడం కూడా అప్రకటిత నిషేధంగా మారింది. అది అ చిట్టితల్లి బంగారు జీవితానికి అవసరమట! అనుకుంటూ పక్కపై దొర్లుతున్న ఋషికి చిన్నారి తేజ గుర్తొచ్చింది.

తేజ అడవిలో పుట్టిన చిన్నారి. గెరిల్లాలందరి మధ్య అడుకున్న పాప. కానీ అ పాప భవిష్యత్తు అనామకంగా మిగిలి పోకూడదని తేజ తల్లిదండ్రులు అనుకున్నారు. జన్మనిచ్చిన వాళ్లు ఎవరో పాపకు తెలియడం తన భవిష్యత్తుకు అవసరం అని పార్టీ ముందు వాదించారు. కూతురును తమ వాళ్లకే 'స్వార్థంతో' పెంపకానికి ఇచ్చుకున్నాడు. తదనంతర కాలంలో ఆయన విప్లవ జీవితం నుండి వైదొలగినా, తమ కూతురితో తమ శేష జీవితకాలాన్ని గడపడం, తేజ తన అమ్మ నాన్నల ప్రేమను పంచుకోవడం తేజకు కావల్సిందే! కానీ కోటానుకోట్ల తేజల తేజోమయ జీవితాల కోసం పోరాడతామని చెప్పిన ఆ జంట అన్నీ వదిలేసి వెళ్లిపోయింది అనుకుంటూ ఋషి కళ్లు నులుపుకున్నాడు.

ఉద్యమంలోని అనేక మంది తమ బిడ్డలను ఉద్యమ ప్రాంతాలలోని జనతన సర్కార్లకు నిశ్చింతగా అప్పగించారు. ఉద్యమ బాధ్యతలలో మునిగిపోయారు. వారిని తలుచుకుంటున్న ఋషి మనసులో తన సహచరి కదలాడింది. ఆమె ఆదివాసీ. తమ పెళ్లయిన కొత్తలో పిల్లలు కావాలని వ్యక్తావ్యక్తంగా కోరుకుంది. అందులోని సాదకబాదకాలను, తన సోదరుడి కూతురు స్వప్న ఉదంతాన్ని చెప్పి ఆమెను కన్విన్స్ చేసుకోవడం ఋషికి మరిచిపోలేని జ్ఞాపకాలే! అవి గుర్తొచ్చి అయన పెదవులపై నవ్వు ముద్ర వెలిగింది. కానీ ఆమె మాత్రం ఊళ్లో ఏ తల్లి చంకలో చంటిపిల్ల అగుపడినా ఎంతో అపురూపంగా చేయిజాపి తీసుకొని ఎత్తుకొనేది. వారిని ముద్దాడేది. ఆ గతం ఆయనలో మెదిలింది. అంతేకాదు, బొద్దుగా, ముద్దుగా వున్న పిల్లల క్యాలండర్ ఆమె కంట పడినా అ ఫోటోను ఎంతోసేపు తదేకంగా చూస్తూ మురిసిపోయేది. తనకూ అలాంటి బిడ్డే ఉంటే.....! అన్న క్షణకాల ఆలోచన ఆమెలో మెరుపులా మెరిసేది. అది రుషి పసికట్టేవాడు! అది ఒక్క ఆయన సహచరి మనసులోని ఆరాటమే కాదు. ఈ తరం స్మరణ వరకూ అమ్మ కావాలని సహజంగానే కోరుకున్నవాళ్లు ఎందరో రుషికి తెలుసు. రుషి చెమ్మగిల్లిన కళ్లతో 'వర్గ పోరాటం...శిథిలమైన పాతవ్యవస్థను కూల్చి కొత్త ప్రగతిశీలమైన సమాజాన్ని నిర్మించే మహత్తర కర్తవ్యమే నిర్దాక్షిణ్యమైనద'ని అనుకున్నాడు.

తన దేరా పక్కనుండి నడుస్తూ వెలుతున్న వారి అడుగుల చప్పుడు విన్న ఋషి లోగొంతుకతో "ఎవరు" అనడంతో అవతలి నుండి 'నేను అరున్‌ను దాదా" అని విన్న జవాబుతో పాటు "స్మరణను సెంట్రీ లేపాను" అంటూ అరున్ వెళ్లిపోయాడు. రుషికి సన్నిహిత కామ్రేడ్లలో అరున్ ఒకరు. ఆయన ఉద్యమంలో ఎదిగి వచ్చిన పట్టా లేని ఆదివాసీ 'సర్జన్'. ఆలోచనలు అటువైపు వెళ్లిపోయాయి.

అరున్ స్థానిక అదివాసీ యువకుడు. ఆయన తనకు వరుసైన గెరిల్లా యువతిని ఉద్యమంలోనే వివాహమాడాడు. ఆయన సహచరి నెల తప్పిన విషయం అలస్యంగా ఆయనకు తెలువడంతో గర్భ విచ్ఛిత్తికి అవకాశం లేకుండా పోయింది. ఆమెకు గర్భవిచ్ఛిత్తి అంటే ఎక్కడ లేని భయం పట్టుకోవడంతో ఎవరికీ చెప్పకుండా ఐదు మాసాల వరకు గడిపింది. కానీ, కడుపులో పెరుగుతున్న పిండం పెరిగే పొట్ట ఆకారాన్ని బయటికి అగుపడకుండా ఆపడం ఆపై ఆమెకు సాధ్యం కాకుండా పోయింది. తుదకు వారికి చక్కని మగ బిడ్డ పుట్టాడు. వాడికి 'వివేక్' అనే పేరు పెట్టుకున్నారు. తన కొడుకు తెలంగాణ విద్యార్థి నాయకుడు అమరుడు వివేక్‌లాగా ఎదుగాలని వాడి తల్లి తన గుడ్డుకు అ పేరు పెట్టుకుంది.

యేడాది వరకు వివేక్‌కు పాలిచ్చి పెంచిన తల్లి అ తరువాత ఇక తన విప్లవ విధుల్లో తాను చేరిపోవాలని భావించింది. దానితో, అ జంట తమ బాబును ఊళ్లో పిల్లలు లేని ఒక రైతు జంటకు పెంపకానికి ఇచ్చారు. జనతన సర్కార్ అండతో పిల్లలను పెంపకానికి ఇవ్వడం అన్ని రకాలుగా బాగుంటుందని వారు భావించారు. వాళ్ల బాబును వాళ్లు తరచుగా కలుస్తున్నారు.

అ బాబుకు ఇప్పుడు ఇద్దరు తండ్రులు, ఇద్దరు తల్లులు. వాడు అలాగే పిలుస్తున్నాడు. ఇది జగమెరిగిన రహస్యం. అయితే అ విషయం పోలీసులకు తెలిసిన్నాడు ప్రజలే వారిని కాపాడుకోవాలి. అంతకన్నా మార్గాంతరం ఏమీ లేదు. ప్రజల భవిష్యత్తులోనే పిల్లల భవిష్యత్తు అధారపడి ఉంటుందని వివేక్‌లాంటి అనేక మంది పిల్లల జీవితాలు గుర్తుచేస్తున్నవి.

అప్పుడు రుషికి జ్యోతి గుర్తుకు వచ్చింది. ఆమె తన కళ్ల ముందే పెరిగిన పిల్ల. తనను నోరారా "తాతా" అంటూ పిలిచేది. జ్యోతిని ఆయన ఇప్పటికీ రోజూ ఊరిపిల్లల్లో చూసుకుంటూ మురిసిపోతుంటాడు. రుషిని సారక్క గర్భశోకం చుట్టుముట్టింది. శంకర్ అమరత్వం గుర్తుకు వచ్చింది. సారక్క సహచరుడు తనకు రాసి పంపిన లేఖ గుర్తుకు వచ్చింది. అది చదివినప్పటి నుంచి విప్లవంలో తల్లులు, పిల్లలు ఎందరో రుషి అంతరంగాన్ని ఆవరించారు.

**ఎందరిలాగో అఖిలేష్:**

సారక్క ఒక ఆదివాసీ మహిళ. అమె పాత వరంగల్ జిల్లా తాడ్వాయి మండలంలోని ఓ ఆదివాసీ పల్లెకు చెందిన ఆడపడచు. సారక్క ఊరుకు, కుటుంబానికీ గొప్ప త్యాగాల చరిత్ర ఉంది. ఆమె తనకు నచ్చిన, ఇష్టమైన ఆదివాసీ యువకున్ని వివాహం చేసుకుంది. వాళ్లకు కలగిన పుత్రుడే అభిలాష్. అభిలాష్‌కు వాళ్ల నాన్న గురించి తెలియకముందే ఆయన పోలీసులు జరిపిన ఒక బూటకపు ఎన్‌కౌంటర్‌లో అసువులు బాసాడు.

సారక్క తనలో నరనరాన జీర్ణించుకుపోయిన అంకితభావం, అమెకు తెలిసిన జనం బిడ్డల బలిదానాల పాఠాలను సారక్క తన బాబుకు నిత్యం సనుపాలలో రంగరించి పోసింది. అ పల్లెతల్లులు జోలపాటలుగా వారి అమర గీతాలను అభిలాష్‌కు విన్పించేవారు. కానీ, అ అవకాశం కన్న తల్లి సారక్కకు ఎక్కువ కాలం దక్కలేదు. నాలుగు మాసాల పసికందును తన తమ్ముడి వద్ద వదిలి సారక్క తన ఉద్యమ బాధ్యతలలోకి బాబు జ్ఞాపకాలతో, మధుర స్మృతులతో వెళ్లింది.

మేనమామ దగ్గర పెరుగుతున్న అభిలాష్ ఎంతో చురుకైనవాడు. ఆయనకు జన్మనిచ్చిన తల్లి, తమ సనుపాలు తాగించిన ఊరు తల్లులు ఆశించినట్టే అభిలాష్‌కు అమరవీరుల ధైర్య సాహసాలు అబ్బాయి. ఆయనకు ప్రజావీరుల త్యాగగుణం ఉగ్గుపాలతో అణువణువునా జీర్ణించుకు పోయింది. అమ్మ పాల నుండే ఆయనకు పోరాట బాటలు బోధపడినవి. ఆయనకు బడి పాఠాలకన్నా పోరు పాఠాలే ఎక్కువ మక్కువ. అ బాబు పెరుగుతున్న ప్రాంతం ఎప్పుడూ ఖాకీల ఉక్కు పాదాల పదఘట్టనల కింద నలుగుతునే ఉన్నప్పటికీ అ పల్లెలలోని ప్రజలకు మాత్రం అడవి బిడ్డలంటే చచ్చే ప్రేమ. వారంతా తమవాళ్లే కావడంతో పాటు వారు తమ అడవి జీవితాలలో వెలుగులు నింపుతున్న చిరుదివ్వెలనే నిజం అ జనాలకు తెలుసు. అ నిజం ప్రజలు వారిని ఎన్నటికీ విడువకుండా తమ కంటిపాపలుగా కాపాడేలా చేస్తున్నది. ఆ ప్రజల కోటలో పల్లెలన్నీ అడవి బిడ్డల అట పాటలతో, విప్లవ సందేశాలతో మారుమోగేవి. అభిలాష్‌కు బడి చదువు అబ్బింది తక్కువే. ఉక్కు పాదాల అణచివేత చర్యలు మాత్రం ఆయనలో చిన్నతనం నుండే వర్గకసిని పెంచి పోషించాయి. ఏ చిన్న అవకాశం చిక్కినా వారిపై సాహసిక చర్యలకు ప్లానులు వేసేవాడు.

**గడ్చిరోలి నుంచి కన్నీటి వార్త:**

సారక్క తన గెరిల్లా సహచరుల రక్షణలో గ్రామ పార్టీ కమిటీ కామ్రేడ్స్‌తో కలసి జనతన సర్కార్ సమావేశం చేస్తోంది. అక్కడికే అమెకు ఒక ఉత్తరం చేరింది. ఆమెకు ఉత్తరం వచ్చిందంటే మొదట గుర్తొచ్చేది తన బాబే! చాలా కాలంగా బాబును చూడాలని కబురు పెడుతున్న సారక్కకు శంకర్‌గా మారిన అభిలాష్ ఎప్పుడూ ఉద్యమ వార్తలతో తనకు తీరిక దొరకడం లేదనీ, తనకూ అమ్మనూ, నాన్నను ఓసారి చూడాలని మనసు తన్లాడుతున్నదనీ రాసిన ఉత్తరాల పేజీలన్నీ సారక్క మదిలో చకచకా కదిలిపోతున్నాయి. ఈ ఉత్తరం అలాంటిదే అయి ఉ ంటుందనుకున్న సారక్క అ ఉత్తరం విప్పి చదువుతున్నకొద్దీ అక్షరాలు మసకబారుతున్నాయి. కళ్లజోడు సవరించుకున్నా కన్నీరు అక్షరాలను అడ్డుకుంటున్నది.

సారక్క ఉత్తరం చివరికి చేరలేకపోయింది. అందులో రాసి వున్న తన కొడుకు వార్తతో ఒక్కసారి ఆమె ఆశల ప్రపంచం అంతా కుప్పకూలి పోయినట్టయింది. భూమ్యాకాశాలు తలకిందులైన చందంగా మారాయి. ఆమె కళ్ల వెంట జలజలా కన్నీరు కారుతోంది. నోట మాట రావడం లేదు. చేష్టలుడిగిన సారక్క వాలకం చూసిన అక్కడి బాధ్యురాలు చంపా "ఏమైందక్కా" అనే సరికి సారక్క గుండెల్లో నుండి దుఃఖం పెల్లుబికి బోరున ఏడ్వసాగింది. చంపా చేతిలో సారక్క అ ఉత్తరాన్ని పెట్టింది. చంపా అ ఉత్తరాన్ని గబగబా చదివింది. విషయాన్ని అర్థం చేసుకుంది. ఉత్తరాన్ని చదువుతున్న చంపా కళ్లెంట అప్పటికే కన్నీళ్లు కారుతున్నాయి. కాసేపు సారక్కను ఓదార్చే ప్రయత్నం చేయలేదు అమె. "కన్నతల్లి కడుపు కోతకు కన్నీళ్లు ఒక వ్యక్తీకరణ. ఏడుపు ఒక ఊరట" అనుకున్న బాధ్యురాలు అ తల్లి శోకాన్ని అపలేదు.

కామ్రేడ్ సారక్క అభిలాష్‌కు జన్మనిచ్చినప్పటి నుండి ఆయన శంకర్‌గా ఎదిగి జులై 3 నాడు గడ్చిరోలీ అడవులలో అమరుడయ్యే వరకు ఆయన ఎదిగిన, తమ వెంట సాగిన క్రమాన్నంతా గుర్తు చేసుకుంటూ కన్నీరు కారుస్తోంది. నాలుగు మాసాల నెత్తుటి గుడ్డును విప్లవం కోసం వదలి వచ్చిన నాటి నుండి ఇప్పటివరకు తన బాబు తన వెన్నంటి ఉంటూ వచ్చిన గతాన్ని ఏకరువు పెడుతూ సారక్క విలపిస్తోంది.

"నాలుగు నెలల గుడ్డును కొడుకా
వదిలి వస్తిని గద కొడుకా
నీ వడుపు వినొచ్చి కొడుకా
నా గుండె పగిలింది కొడుకా
బస్సు లేటైతే బాగుండని కొడుకా
ఆలోపు పాలిచ్చి వద్దామనుకున్న కొడుక
బస్సులో పోతుంటే కొడుక
నా సనుపాలు సలిపినై కొడుక
దుఃఖ మాగుతలేదు కొడుక
బస్సుల పోలీసులుండ్రు కొడుక

ఏపీటీ చేరినాంక కొడుక
బోరున ఏడ్చిన కొడుక
పాలు ఆపనీకి కొడుక
మందులు తినిపిచ్చిరి కొడుక
నేపులచ్చిన పాలు కొడుక
రోజుకొక సీసా పిండి కొడుక
నిను గుర్తుచేసుకుంట కొడుకు
నా సనుపాలు పుట్టల పోస్తి కొడుక
320 యేండ్లు పెరిగితివి కొడుక
10 సార్లు కలిస్తిమి కొడుక

దండకారణ్యంలోనే కొడుక
నెల కలిసుంటిమి కొడుక
జనం కోసం నువు కొడుక
తల్లినైనా చూడ రావైతివి కొడుక
నమ్మిన జనంలోనే కొడుక
నీకు ద్రోహలు ఉచ్చు వేసిరి కొడుక
జులై 3నాడు కొడుక
ఖాకీలు నీను కాల్చి చంపిరి కొడుక
నా కడుపు కాలింది కొడుక
మోదీ గద్దె కూలుతది కొడుక
ఈ దోపిడీ రాజ్యం కొడుక
కాలి కూలిపోతది కొడుక"

నాలుగునెలల పసి గుడ్డును ఇంటి వద్ద వదిలి బయల్దేరింది. బస్సు కాసేపు ఆలస్యమైతే బాబుకు మరోమారు పాలివ్వాలని తను పడిన తపనను సారక్క ఎలా మరిచిపోతుంది? ఏ తల్లికైనా తన రక్తం పంచుకు పుట్టిన పసిగుడ్డుకు టైంకు పాలిచ్చి ఆ గుడ్డు అకలి తీర్చాలనీ, వేళ దాటిపోతే రొమ్ముల్లో సలిపే పాలసేపులు నోరులేని బిడ్డ అకలితో తల్లిని ఎంతో ఉక్కిరిబిక్కిరి చేస్తాయి! చనుపాలతో సలిపే రొమ్ములను తన బిడ్డ నోట కరిచాక అ పాపాయి తృప్తిగా పాలు తాగుతూ బోసి నవ్వులతో తల్లి ఒడిలో కాళ్లు అడిస్తూ అకలి తీర్చుకునే అ మధుర క్షణాలు, తీయని స్మృతులు పిల్లలకు జన్మనిచ్చిన కన్న తల్లులకు తప్ప ఎవరికి అర్థమవుతాయి! కానీ వర్గపోరులో అనేకం త్యాగం చేయాల్సి ఉంటుంది. తల్లులు పిల్లలను, పిల్లలు తల్లులను, భార్యలు భర్తలను, భర్తలు భార్యలను, మిత్రులను, హితులను, సన్నిహితులను, సుతులను విప్లవం కోసం వదలుకోక తప్పదు. అ సామాజిక విప్లవ కమిట్‌మెంటు అలాంటిది.

నాలుగు మాసాల పసిగుడ్డును ఇంటి వద్ద వదలి వచ్చిన కామ్రేడ్ సారక్క ఒకవైపు తన శరీరంలో సహజంగా ఉత్పన్నమయ్యే తల్లి పాల ఉత్పత్తి నిలిచిపోయె మందులు తింటూనే మరోవైపు రొమ్ములు సలుపుతూ జలజల కారే పాలను రోజూ సీసాలో పిండి రెండో కంట పడకుండా పుట్టలో పారపోసిన ప్రతిసారి ఆకలితో తన బాబు అలమటిస్తు, కాళ్లు తన్నుకుంటూ బిగ్గరగా గుక్కపట్టి ఏడుస్తున్న దృశ్యమే అగుపడేది. ఆ క్షణాలలో ఆమె అనుభవించిన మానసిక క్షోభను అక్షరాలలోకి మలిచే శక్తి కలాలకు ఎక్కడిది! అది అనుభవించిన తల్లులకే అ 'హింస' పునాదులు అర్థమవుతాయి. అ హింసే వారిని మరింత గట్టిపరిచి ఏ తల్లీ ఆ బాధ అనుభవించకూడదనే గట్టి తలంపుతో నిర్దాక్షిణ్యమైన వర్గ పోరులో వారిని కాకలుతీరుస్తుంది. కామ్రేడ్ సారక్క సామాజిక విప్లవం కోసం, తన చిన్నారి బాబు కోసం పడిన ఆరాటాన్నంతా గుర్తు చేసుకుంటూ తాను వరంగల్ వదిలి దండకారణ్యం చేరే వరకు అనుభవించిన జీవితాన్ని బాబుతో పెనవేసుకున్న అనుబంధాన్ని పదే పదే గుర్తు చేసుకుంటుంటే ఆమె కళ్లు వర్షిస్తున్నాయి. అ కన్నీళ్ల వెనుక దాగిన చరిత్ర అ తల్లికి, ఆమె రక్తం పంచుకు పుట్టిన అ బాబుకే తెలుసు.

సారక్క జంట 2008లో విప్లవ కర్తవ్య నిర్వహణలో దండకారణ్యంలో భాగమైంది. అమెతో బాబూ దండకారణ్యం చేరాడు. బాబుతో వారు కొద్దిమాసాలు గడిపారు. ఉద్యమంలో వారి బాధ్యతలు వారు తమ పూర్తి శక్తియుక్తులను వెచ్చించి నిర్వహించాల్సి ఉంటుంది. వాటిని సరైన దిశలో ఎంత శక్తిమంతంగా నిర్వహించగలిగితే దీర్ఘకాల విప్లవం అంత త్వరగా విజయం సాధిస్తుంది. అ అవగాహనే ప్రతి విప్లవ కార్యకర్తకు గీటురాయి. ఆ అవగాహన కలిగిన సారక్క జంట తమ నూతన విప్లవ బాధ్యతలు స్వీకరించి బాబు భవిష్యత్‌ను పార్టీ నిర్ణయానికి వదిలేసింది. అభిలాష్ చురుకుదనం, ఆయన ఉద్యమంలోకి వచ్చిన నేపథ్యం తెలిసిన పార్టీ ఆయన్ని గడ్‌చిరోలీ ఉద్యమంలో భాగం చేసింది.

2008 నుండి 2020 వరకు గడచిన 12 సంవత్సరాలలో తన బాబు గెరిల్లా దళ సభ్యుడి నుండి పార్టీ సభ్యుడిగా, అ తరువాత ఏ.సీ. మెంబర్‌గా, ఒక ఏరియా కమాండర్‌గా ఎదగడాన్ని ఎంతో అనందిస్తూ తన బాబు తన వారసత్వాన్ని తండ్రి హన్మంతు విప్లవ వారసత్వాన్ని నిలబెడుతున్నడనీ చాలా సంతోషించేది.

బాబు జ్ఞాపకాలను తలచుకుంటూ కన్నీరు కారుస్తున్న కామ్రేడ్ సారక్క దుఃఖంలో ఉద్యమ గమనం, గతిశీలత వ్యక్తమవుతోంది. తనకు పరిచయం ఉన్న అనేక మంది అమరులను సారక్క పేరు పేరున తలుచుకుంది. అ దుఃఖంలో సైతం ఆమె నోటి నుండి పదే పదే విప్లవం పట్ల ఆమె విశ్వాసం జాలువారుతోంది! ఆమె నిశితమైన వర్గకసితో 'మోదీ గద్దె కూలుతుందని' అంటోంది. ఏ పోలీసు, మిలిటరీ, అమెరికోడు నిన్ను కాపాడదని అంటోంది.

చెట్టెత్తు కొడుకును పోగొట్టుకున్న అక్క ఏడుస్తూ గుర్తు చేసుకుంటున్న జ్ఞాపకాలను విని జనాలు కంట తడి పెట్టారు.

వారిలో నుండి ఒక మహిళ తన పక్కనున్న మరో మహిళతో "నా బిడ్డను నిరుడు పోలీసులు చంపినపుడు నా పరిస్థితి ఇట్లనే ఉండె"

"నీ బిడ్డతో పాటు ఒక్కసారే 10 మందిని పోలీసులు తాడిబల్లన పొట్టన పెట్టుకున్నపుడు ఈ చుట్టు పక్కల అన్ని ఊర్ల పరిస్థితి అదే కదా!" మరో మహిళ.

జనంలో కూచున్న మరో మహిళ స్వగతంలోనే "ఈ లడాయిల పడచు పడచోల్లు పగోని చేతిల పాణాలు పోగొట్టుకోవట్టిరి అనుకున్న మాటలు పక్కవారికి స్పష్టంగానే వినబడ్డాయి.

ఆ మాటలు చెవులపడ్డ ఓ వృద్ధ మహిళ "పాణాలు పోకుంటే ఇయ్యాల మన బతుకు గిట్ల ఉండేదా! ఈ జంగల్ల ఎనుకట మన బతుకులెట్లుండేది. అడవిలో బతికేటోళ్లం ఏరుగపోయి నాలుగాకులు తెంపుతే దండుగేసేటోళ్లయిరి. కూటికి సత్తిమి. గుడిసెకు గడ్డి కోసుడు తిప్పలేనాయె! ఎన్నితిప్పల్లు, బతుకులన్నీ తిప్పల్లేనాయె! అవి తెలువందెవలకు! ఇయ్యాల మన బిడ్డలకు అవి తెలువవు. అదే చాలు. పాణాలు పోతె పోయినయి" అన్న మాటలు విన్న మహిళ కళ్లలో తన జీవితాన్ని దొంగ పట్వారోడు ఎట్ల బుగ్గిపాలు చేసిండో గుర్తుకువచ్చి ఆమె కళ్లలో నీళ్లు తిరిగినయి.

"నిజం బిడ్డా, మన పోరగాండ్లు మంచిగ బతుకుతాండ్రు" అంటూ అమరుల త్యాగాలను ఎత్తిపడుతూ "సారక్క కొడుకు శవం ఏమైందో! ఈడనైతే మనం మన పిల్లగాండ్ల శవాలకోసం పోలీసోల్లతో లడాయి చేసి తెచ్చుకుంటున్నం. కనీ, ఆయినె శవాన్ని అక్కడి జనం పోయి అడిగినా దొంగ చట్టాలియ్యనియ్యయాయె! కన్నోల్లా, పెంచినోల్లా అంటూ పోలీసోల్లు గెదుముతరాయె! పాపం, ఎట్లయిందో జనం కోసం పాణమిచ్చిన ఆ పిల్లగాని శవం" అంటూ తన బాధను వ్యక్తం చేయడం ఆమె పక్కనున్న పొరుగూరి సంఘ నాయకుడు విజ్జాల్ విన్నాడు.

అనేక సంవత్సరాలుగా తాము అనుభవిస్తోన్న పోలీసుల అత్యాచారాలు, అరెస్టులు, హత్యలు ఒకరు మరొకరితో జనాలు

పంచుకుంటున్నారు. వారంతా గత రెండు దశాబ్దాలుగా రాజ్యహింస మధ్య రగులుతున్న అగ్నికణాలే!

అంతలోనే బాధ్యురాలు చంపా 'కామేడ్స్' అంటూ జనాలను ఉద్దేశించి సంబోధించేసరికి వాతావరణం అంతా గంభీరంగా మారిపోయింది.

సారక్క తన చేతిలో పెట్టిన ఉత్తరం చంపా చేతిలో గాలికి రెపరెపలాడుతోంది. అంత కన్నా వేగంగా ఆమె గుండె లబ్‌డబ్ పెరిగింది. అమె కళ్లలో నుండి కూడా కన్నీరు కారడం మొదలైంది. నోటమాట తడబడుతూ సరిగా రావడం లేదు. జనాలవైపు, సారక్క వైపు చంపా పదే పదే చూస్తూ తన చేతిలోని కాగితాన్ని చూస్తోంది.

చంపా కోయలో "కామేడ్స్, మీరు మీ జీవితాలలో అనేక బాధలు అనుభవిస్తున్నారు. మీరు అనేక త్యాగాలు చేస్తున్నారు. కన్నీళ్లు, కష్టాలు మీ జీవితాలలో అంతర్భాగం. మీ గూడాలకు పోలీసులు రాని రోజులు చాలా అరుదు. మీపై వారు చేయని అఘాయిత్యం అంటూ లేదు. అయినప్పటికీ మీరు పోరాటంలో దృఢంగా నిలిచి పార్టీనీ, గెరిల్లాలను కంటికి రెప్పలా కాపాడుకుంటున్నారు. అందుకే గత 40 సంవత్సరాలుగా మన పార్టీ ఇక్కడ మనగలుగుతోంది. మీరు గడిచిన మీ చాలీ చాలని జీవితాలను, దిన దిన గండం బతుకులను కోరుకోవడం లేదు. మీరు మీ సంఘటిత శక్తి ద్వారా అనేక విజయాలు సాధిస్తున్నారు. మీరు గత 20 సంవత్సరాలుగా ఇక్కడ మీదంటూ ఒక ప్రభుత్వాన్ని నిలుపుకొని మీ జీవితాలను చక్కదిద్దుకుంటున్నారు. ఇవన్నీ మన వర్గ పోరాటంలో భాగమే! దీనితో దోపిడీ సర్కార్ ఖంగుతిని మన పార్టీనీ, విప్లవోద్యమాన్ని పూర్తిగా నిర్మూలించాలనీ వేగిరపడుతోంది. 2017 మధ్య నుండి ఒక కొత్త అణచివేత పథకాన్ని 'సమాధాన్' పేరుతో ప్రారంభించింది మీకు తెలుసు" ఒక్కసారి అందరి ముఖాలూ చూసింది.

తమ జీవితాలను తమ మాటల్లోనే చంపా తమ ముందు ఉంచుతుండడంతో జనాలు చాలా శ్రద్ధగా వింటున్నారు. వాళ్లంతా సారక్క కొడుకు మరణానికి కారణం ఏమై ఉంటుందా అనే విషయం ముందు తెలుసుకోవాలనే అతురతలో ఉన్నారు.

అలోపు మళ్లీ చంపా మరో విడుత 'కామ్రేడ్స్' అనడంతో వాళ్లు అమె వైపు గంభీరంగా చూశారు.

"ఇప్పుడు దండకారణ్యంలో మొబైల్ టవర్లు రాని ఊరూ, గుట్టా లేకుండా పోయింది. సర్కారోల్లు కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి వాటిని కొండలల్లకు తెస్తున్నరు. మన అడవిల ఇపుడు మొబైల్ లేని ఇళ్లు లేదేమో! వాటిని మీరు అడుగకున్నా పోలీసోల్లే మీకు ఇస్తున్నారు. "ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడన్నట్టు' అసలు దొంగలు బయటపడకుండా ఉండడానికి ఇదో తరీకా! అనేక ఊర్లలో కలుపు మొక్కల్లాంటి పోలీసు ఇన్ఫార్మర్లు తయారయ్యారు. వాళ్లు బయటపడకుండా మన ఉద్యమ సమాచారం, దళాల కదలికలు అన్నీ శత్రువుకు వెంట వెంట రహస్యంగా చేరవేస్తున్నారు. మనం అ ద్రోహులను పసిగట్టలేకపోయిన చోట రహస్యాన్ని కాపాడుకోలేకపోతున్నాం. పోలీసులు అ సమాచారంతో వచ్చి మన దళాలపై దాడులు చేస్తూ మనల్ని నష్టపరుస్తున్నారు. మనం ఎక్కడ ఏ కొద్ది ఏమరుపాటుగా ఉన్నా నష్టపోతున్నాం" చంపా తన చేతిలోని ఉత్తరంలోకి చూసింది.

"జూలై 3 నాడు గడ్‌చిరోలీ జిల్లా భామ్రాగఢ్ తాలూకా గట్ట ప్రాంతంలో ఏర్‌దడిమి గ్రామం వద్ద దూడెపల్లి అడవిలో జరిగిన ఎదురుకాల్పులలో పెరిమిలి దళ కమాండర్ కామ్రేడ్ శంకర్ (కోటె అభిలాష్) గాయపడి సజీవంగా శత్రుచేత చిక్కి వాడి చిత్రహింసలతో అమరుడయ్యాడు" అన్న వాక్యాలను అందులోనుండి చదివి ప్రజలకు విన్పించింది.

చంపాకు గడ్‌చిరోలీ ప్రాంతమంతా ముందే పరిచయం ఉన్న ప్రాంతం కావడంతో అక్కడి వివరాలు మరికొన్ని కూడా అక్కడ కూచున్న జనాలతో పంచుకుంది.

"ఇక్కడిలాగే గట్ట ప్రాంతం కూడ దట్టమైన అడవితో పాటు భౌగోళికంగా ఎత్తైన కొండలతో కూడుకొన్నది. గెరిల్లాలకు చాలా అనుకూలమైన టెర్రయిన్ ఉన్న ప్రాంతం. మనకు ఇక్కడ అంత లేవు కానీ విశాలమైన వెదురు వనాలున్నాయక్కడ. అక్కడ నీటి వనరులూ పుష్కలంగానే ఉంటాయి. శంకర్ వాళ్లపై కాల్పులు జరిగిన ఊరు సహా ఆ ప్రాంతమంతా సూర్జాగఢ్ కొండల వరుసలో భాగమే! అక్కడి నుండి ఇనుప ఖనిజం తీసుకెల్లడానికి గత 20 ఏళ్లకుపైగా లాయిడ్ అనే బడా పెట్టుబడిదారుడు సర్కార్‌ను, పోలీసులను పట్టుకొని అనేక ప్రయత్నాలు చేస్తున్నాడు. కానీ, ఆ ప్రయత్నాలన్నీ అక్కడి ప్రజలు మాత్రం తమ బతుకు కోసం చాలా దృఢంగా ఎదుర్కొంటున్నారు.

ప్రజలు పెసా చట్టాన్ని అనుసరించి గ్రామసభలు కూడా ఏర్పర్చుకున్నారు. అయినప్పటికీ ఆ గనుల తవ్వకం పనులు సాఫీగా జరుగడానికి సర్కార్ సాబులు పెసా చట్టాన్నీ గ్రామసభలనూ పక్కనపెట్టి దాని చుట్టూ అరు గ్రామాలలో వందల సంఖ్యలో పెద్ద పెద్ద పోలీసుల క్యాంపులతో ఒక వలయాన్ని ఏర్పర్చారు. గట్ట అడవుల నడిబొడ్డున దమ్‌కొడివాహి అనే చోట కూడా గనుల తవ్వకానికి రంగం సిద్ధమైంది. కానీ ఆ ప్రాంతంలో జనతన సర్కార్లు వాటిని వ్యతిరేకిస్తున్నాయి. తమ అడవులను నాశనం చేయవద్దనీ, తరతరాల తమ పూజా స్థలాలను ధ్వంసం చేయకూడదనీ, ప్రజల మనుగడతో పరిహాసమాడుతూ పర్యావరణ సమతుల్యతను దెబ్బ తీయకూడదనీ, మన ప్రజల కోసం కానపుడు అ తవ్వకాలను పెట్టుబడి కోసం తవ్వడాన్ని మేం ససేమిరా అనుమతించం అని అక్కడి గ్రామసభలు చట్టపరంగా పోరాడుతున్నాయి.

గ్రామసభలవాళ్లు జెనీవాలో జరిగిన అంతర్జాతీయ మూలవాసీ దినంలో పాల్గొని ప్రపంచ మూలవాసులకు తమ వ్యథను వినిపించుకున్నారు. మన దేశంలో ఢిల్లీ, నాగపూర్ సహా అనేక చోట్ల సభలు పెట్టి తమ గోడు వినిపించుకున్నారు. వారితో అనేక ఆదివాసీ ప్రగతిశీల సంఘాలు భుజం భుజం కలిపాయి. అక్కడి ప్రజలు చట్టపర పోరాటాలతో పాటు స్థానికంగా తవ్వకం, రవాణా పనులనూ ధైర్యంగా అడ్డుకుంటున్నారు. కానీ, ఏ చట్టం వారిని కాపాడడం లేదు. వారికి అండగా నిల్చిన సామాజిక రాజకీయ కార్యకర్తలను 'ఊపా' కింద పోలీసులు జైల్లో పెట్టారు. ప్రజలు తమ అస్తిత్వం, ఆత్మగౌరవం కోసం తవ్వకం పనులను అడ్డుకుంటూ ముడి ఖనిజం రవాణా వాహనాలను తగులపెట్టిన కేసులో పోలీసులు విప్లవ రచయిత వరవరరావును ప్రధాన నిందితుడిగా ఇరికించారు.

మరోవైపు గట్ట అడవులలో విప్లవకారులను ఏరివేయడానికి పోలీసులు అనేక కుట్రలకు పాల్పడుతున్నారు. హంతక దాడులు ముమ్మరమయ్యాయి. ప్రజల వాకిళ్లలో బూట్ల టకటకలు వినపడని రోజుండడం లేదు. నిరుడు అ ప్రాంత బాధ్యురాలు కామ్రేడ్ నారోటి రాంకోను, ఆమెతోపాటు ప్రజాకళాకారిని శిల్పను పోలీసులు బూటకపు ఎదురుకాల్పులలో హత్య చేశారు. అంతకు ముందు కసనూర్‌లో 40 మందిని పొట్టన పెట్టుకున్నారు. ఇపుడు శంకర్‌ను హత్య చేశారు" చంపా చాలా ఉద్వేగంగా చెప్పి తన ఎదురుగా ఉన్న విజ్జాల్ వైపు చూసింది.

ఆయనకు ఆ ఘటన ఎలా జరిగిందో వివరాలన్నీ తెలుసు. ఆయనే ఆ ఉత్తరాలు తెచ్చినవాడు కావడంతో ఘటన వివరాలన్నీ ప్రత్యక్షంగా ప్రజలకు విన్పించమని విజ్జాల్‌ను చంపా కోరింది.

విజ్జాల్ లేచి నిలబడ్డాడు. జనమంతా విజ్జాల్ ఏం చెపుతాడో విందామని శ్రద్ధగా ఉన్నారు. ఎవరి మనసులలో వారికి అనేక సందేహాలు మెదులుతున్నాయి. వారంతా తమ అనుభవంలో ఎంతో మంది ద్రోహులను చూశారు. వారి ద్రోహాలతో తమ కండ్ల ముందు అసువులు బాసిన అనేక మంది అమరవీరుల శవాలు కదులుతున్నాయి. తమ బిడ్డల శవాల కోసం గత సంవత్సరం పోలీసు స్టేషన్‌కు వెళ్లి పోరాడి తెచ్చుకున్న అనుభవం అందులో పాల్గొన్నవారిలో మెదిలింది. వాతావరణం ఎంతో బరువుగా మారింది. ఈలోగా విజ్జాల్ తన కండ్ల ముందు కదులుతున్న శంకర్ అమరత్వ ఘటనను మాటలలోకి మారుస్తూ జనం ముందుంచసాగాడు.

"కామ్రేడ్స్! ఆ రోజు జులై 3. మన శంకర్ వాళ్లు అంటే గట్ట దళం కామ్రేడ్స్ 12 మందితో పాటు, ప్రజా మిలీషియా కార్యకర్తలు 6-7గురు ఉండిరి. వారంతా 28 జులై అమరుల సంస్మరణ వారం ప్రచార తయారీలలో ఉన్నారు. పోస్టర్లు, బ్యానర్లు రాస్తున్నారు. గట్ట దళ కమాండర్ కామ్రేడ్ శశిధర్ పొరుగూరిలో ఉన్న సంఘనాయకునికి వచ్చి తనను కలువాలనీ ఒక మిలీషియా కామ్రేడ్‌తో కబురు చేశాడు. ఆ కామ్రేడ్ పక్కూరు సంఘనాయకుడి ఇంటికి వెళ్లి వెనకా ముందు పరిశీలించకుండానే ఆయన అగుపడిన వెంటనే గబగబా దళం రమ్మందన్న కబురు చెపుతుండగా ఆ నాయకుడు వెంటనే వారిస్తూ బయటికి వచ్చి తల పట్టుకున్నాడు. ఏం లోపం జరిగింది అని మిలీషియా కామ్రేడ్ అనుకుంటుండగానే...

"కామ్రేడ్, ఈ రోజు మాఊళ్లో పటేల్ ఇంట్ల పెళ్లి ఉంది. మా ఊరి నుండి, పక్కూర్ల నుండి సీ-60 పోలీసులలో ఉన్నది అందరికి తెలిసిందేకదా! అండ్ల మల్ల మా ఊరి పటేలుకు పోలీసులతోని బాగనే సోపతని మనకు తెలుసేనాయె. వానింట్ల పెండ్లికి వచ్చిన పోలీసులల్ల మా చుట్టపోడు కూడ ఉన్నడు. వాడు గిపుడే మా ఇంటికి అచ్చిండు. నువు వచ్చేది చూసే నేను బయటకు వత్తాన్న నువు ఇంట్ల ఎవలున్నది చూడకుండా గబగబా ముచ్చట చెప్పితివి. ఇపుడు వాడు వినే ఉంటాడు" అంటూ ఆ నాయకుడు ఏం చేయడమా! అన్నట్టు తల గోక్కుంటూ దళం కబురు చేర్చిన మిలీషియా కామ్రేడ్‌తో అంటుండగానే.. ఇంట్లో ఉన్న సీ-60 పోలీసు కమాండో ఆ ఇంట్లో నుండి బయటికివచ్చి వెళ్లిపోతుండడం మిలీషియా గమనించి వెంటనే దళం వద్దకు అపరాధ భావనతో పరుగుతీశాడు. దారొదిలి అడ్డదిడ్డంగా అడవిలో పరుగెత్తుతూ మొసపోస్తూ తొందరగా దళం వద్దకు చేరాలనే గాబరాలో మిలీషియా ఉన్నాడు. ఆయన పరుగును మించిన వేగంతో ఆలోచనలు పరుగెడుతున్నాయి.

దళం వద్దకు ఎగపోస్తూ మిలీషియా రావడం గమనించిన శశిధర్ శత్రువు సమాచారమేదో ఉండి ఉంటుందని ఊహించుకొని నింపాదిగానే ఆ కామ్రేడ్ భుజంపై చేయి వేశాడు.

మిలీషియా కామ్రేడ్ తనతో జరిగిన పొరపాటు చెప్పి వెంటనే 'డేరా ఖాళీ చేయాలి దాదా అంటూ శశిధర్‌ను కోరాడు.

రోజు వారి దళ జీవితంలో అలాంటి ప్రమాదాలు అనేకం చోటుచేసుకుంటున్న గడ్‌చిరోలీలో, దళం ఏమాత్రం నిబ్బరం కోల్పోకుండా, అలస్యం చేయకుండా డేరా ఖాళీ చేసి అక్కడి నుండి బయలుదేరింది. అంతటితో ఆ రోజు ఏ ప్రమాదం లేకుండానే గడిచింది.

మరుసటి రోజు కూడా ఏ ఊరి జనం నుండి శశిధర్ వద్దకు ఎలాంటి పోలీసుల కదలికల వార్తలు రాలేదు. కానీ, పోలీసులు అనుసరిస్తున్న 'ఫైట్ గెరిల్లా, లైక్ గెరిల్లా' విధానం తెలిసిన గెరిల్లాలు మాత్రం అప్రమత్తంగానే ఉన్నారు.

మూడవరోజు ఉదయం గెరిల్లాలు 11 గంటల వరకు భోజనాలు ముగించుకున్నారు. కొరోనా ప్రమాదాన్ని తెలియచేసే పోస్టర్లు, బ్యానర్లతో పాటు కొరోనా వాహకులుగా మారిన పోలీసులు గ్రామాల్లోకి రావద్దంటూ విజ్ఞప్తి చేస్తూ రాస్తున్న పోస్టర్లతో పాటు అమరుల సంస్మరణ వారం గురించిన పోస్టర్లూ, బ్యానర్లూ చకచకా రాసేస్తున్నారు.

గెరిల్లాలు నీళ్ల తావునే డేరా వేసి ఉండడంతో, అక్కడికే నీళ్ల కోసం వచ్చిన ఊరి మహిళలకు శశిధర్ అగుపడేసరికి వారి గుండె వేగం పెరిగింది. వెంటనే శశిధర్ వద్దకు ఒక యువతి పరుగెత్తి తాము నీళ్ల కోసం రాంగ కొద్ది దూరంలో అగుపడిన పోలీసుల విషయాన్ని చెప్పి గుండె బరువు దించుకొని తలపై నీళ్ల బిందెతో అందరితో పాటు అడుగులు వేసింది. దళం క్షేమంగా బయటపడాలనే మాటలే వారందరి మధ్య నడుస్తున్నాయి.

వెంటనే గెరిల్లాలు పక్కనే ఉన్న పెద్ద గుట్ట ఎక్కి చెట్ల కవర్లు చూసుకొని పొజిషన్స్‌లోకి వెళ్లారు. పోలీసు సమాచారం కోసం శశధర్ ఒక మిలీషియా కార్యకర్తను స్కౌట్‌గా పంపాడు. మిగితావారంతా ఎవరి పొజిషన్స్‌లో వాళ్లు చాలా అలర్ట్‌గా ఉన్నారు. బహుముఖ 'సమాధాన్' ఆపరేషన్స్ మధ్య అలా ఉండడం గత మూడేళ్లుగా వారికి అతి సాధారణ ప్రాక్టీస్‌గా మారింది.

స్కౌట్ పనిపై వెళ్లిన మిలీషియా కామ్రేడ్ తనకు తెలిసిన సమాచారంతో రెండు గంటల తరువాత దళం వద్దకు చేరాడు.

ఊరివాళ్లు మనకు చెప్పిన చోటే రెండు పోలీసు బ్యాచులు వంట చేసుకొని నేను అక్కడికి వెళ్లేసరికి అప్పుడే సర్దుకొని బయలుదేరారు. ఎటు పోయింరో తెలువదు. గట్ట క్యాంపు వైపే వెళ్లినట్టున్నది. అయితే, పక్కపక్కల ఇంకా బ్యాచులు ఉంటయనే నా డౌట్. ఒక్క దిక్కే వస్తలేరిపుడు. ఈ గుట్ట వెనుక వైపు కూడా నేను పోయి చూసొస్తా అంటూ ఆయన రెండు అడుగులు అటు వైపు వేసేసరికి కమాండర్ శశిధర్ ఆయన్ని వారించాడు.

మన ముందు వైపు అయితే పోలీసులు లేరు కదా, ఫర్వాలేదు. ఫటాఫట్ టీ చేద్దాం, నువు కూడా తాగి ఈ వైపు వెళ్లి వద్దువు అంటూ శశిధర్ సహచర గెరిల్లాలను చాయ్ తయారీకి పురమాయించాడు. దానితో గెరిల్లాలు తమ తమ కవర్ల నుండి లేచి చాయ్ తయారీలో మునిగారు. అయితే, కొండ పై మెట్టులో ఉన్న ముగ్గురు గెరిల్లాలు మాత్రం అప్పటికీ ఇంకా తమ తమ కవర్లలోనే ఉన్నారు.

"ఇంకేం! చాయ్ చేయడంలో గెరిల్లాలు ఒకరొకరే చేరిపోయి పొయ్యి దగ్గర మాటామంతీ మొదలైంది. కర్రల పొగ పైకెగసింది. నీళ్ల కోసం వెళ్లే వాళ్లు వెళ్లారు. చిన్నపాటి సందడి మొదలైంది. అరగంటలో చాయ్ తాగే వాళ్లు తాగారు. మిగితావాళ్లు కబుర్లలో పడ్డారు. మిలీషియా కామ్రేడ్ వెనుక వైపు స్కౌట్‌కు బయలుదేరబోయేసరికి ఎదురుగా మానవాకారాలు అగుపడ్డాయి.

ఎవరబ్బా! అంటూ పైకే అనేసి ఆవైపు తదేకంగా చూసే సరికి ఆయనపైనే కాల్పులు ప్రారంభమైనాయి. అనేక ఏకే రైఫిళ్లు ఒకేసారి గెరిల్లాల వైపు గురిచూసి కాలుస్తున్నాయి. రాపిడ్ ఫైరింగ్ జరుగుతోంది. మొదటి తూటా మిలీషియా కామ్రేడ్‌కు తగలలేదు కానీ మరో తూట శంకర్ కాలికి తగిలింది. తాను పరుగెత్తలేననే విషయం అయనకు

అర్థం అయిన వెంటనే, ఆయన తన తుపాకీ ఎస్.ఎల్.ఆర్.ను దూరంగా విసిరి రోలింగ్‌లో అక్కడికి వెళ్లాడు. అక్కడున్న మిగితా సహచరులతో కలసి దాదాపు ఒక ఫర్లాంగ్ అతి కష్టంగా నడిచాడు. కానీ ఎడతెరిపి లేని కాల్పులు వెంటాడుతూ వాళ్ల మీద జరుగుతునే ఉన్నవి. శంకర్ కాలి నుండి రక్తస్రావం ఆగడం లేదు. ఇక తను నడవలేని స్థితిలోకి వెళ్లాడు. కళ్లు బైర్లు కమ్ముతున్నాయి. అపస్మారక స్థితికి చేరువవుతున్నాడు. ఆలోపు మరో తూటా మరో కామ్రేడ్ చేతికి తగిలింది. కాల్పుల మధ్య గెరిల్లాలు రెండు బ్యాచీలుగా విడిపోయారు. శశిధర్ బ్యాచులో ఇద్దరు క్షతగాత్రులయ్యారు. ఇద్దరినీ మోసుకెళ్లే స్థితి ఆ బ్యాచులో లేదు. అ పరిస్థితి అర్థమైన శంకర్ తన తుపాకి, తూటాల మాల సహచరుల చేతిలో పెట్టి స్పృహ కోల్పోయాడు.

శంకర్ ఆజానుభావుడు. ఆరోగ్యంగా ఉన్న మూడు పదుల నవయవ్వన యువకుడు. ఆయన్ని ఆ కాల్పుల స్థలం నుండి మోసుకురావడం, మరో క్షతగాత్రున్ని మోయడం ఎలా అని సహచర గెరిల్లాలు అ కాల్పుల మధ్యనే సతమతమవుతుండగా మరో తూటా ఓ మహిళా కామ్రేడ్ మోచేతిని నుజ్జునుజ్జు చేస్తూ వెళ్లింది. కానీ ఆమె అప్పటికే గాయాలతో నడువలేకపోతున్న ఇద్దరు సోదర గెరిల్లాల పరిస్థితిని అర్థం చేసుకున్నందున తాను గాయపడ్డానన్న విషయమైన కమాండర్‌కు రిపోర్టు చేయలేదు. కానీ కమాండర్ ఆ విషయం గమనించాడు.

కాల్పులు ఆగడం లేదు. అక్కడ ఏమాత్రం ఆలస్యం చేసినా ఇంకెంత మంది గాయపడుతారో అర్థం కాని ఆందోళనకర పరిస్థితిలో కన్నీరు కారుస్తూ బిగించిన పిడికిళ్లతో కామ్రేడ్ శంకర్‌కు లాల్‌సలాం చేస్తూ సోదర గెరిల్లాలు వడివడిగా వేగంగా అడుగులు వేయసాగారు. వారి రిట్రీట్‌ను కవర్ చేస్తూ కామ్రేడ్ నిశా కవర్ ఫైర్ చేస్తూనే గెరిల్లాలను అనుసరించింది. ఆరుగురి టీం, అందులో ఇద్దరు క్షతగాత్రులతో కొద్ది క్షణాల్లోనే శంకర్‌కు దూరమయ్యారు.

స్పృహ కోల్పోయి పడివున్న శంకర్‌ను సీ-60 వాల్లు చేరుకున్నారు అంటూ విజ్జాల్ బాధతో కళ్లు మూసుకున్నాడు. ఆయన కళ్లల్లో పోలీసుల చిత్రహింసల మధ్య విలవిలలాడుతున్న శంకర్ శరీరమే కదలాడుతోంది.

విజ్జాల్ పరిస్థితిని సభలో కూచున్న గెరిల్లా కామ్రేడ్ దూలా అర్థం చేసుకొని వెంటనే లేచి వెళ్లి నీళ్ల సీసా అందించాడు. దానితో పాటు మెల్లగా సీ-60 అంటే ఏమిటి విజ్జ దాదా" అన్నాడు.

దూలా అందించిన బాటిల్‌లోని నీళ్లతో నాలుక తడుపుకున్న విజ్జాల్ 'ఇంగో, వెహతకన్' (సరే, చెప్పుతా) అన్నట్టు తల ఊపి ఆయన చేతిలో నీళ్ల బాటిల్ పెట్టాడు.

విజ్జాల్ మళ్లీ జనాలను చూశాడు. వాళ్లంతా ఆయన చెపుతున్నది చాలా సీరియస్‌గా వింటున్నారు. గాయపడ్డ శంకర్ పోలీసు చిత్రహింసల మధ్య తట్టుకోలేకపోతున్నది కొంతమంది ఊహించుకొని తమ కళ్లు తుడుచుకోవడం కూడా విజ్జాల్ గమనించాడు. ఆయన నీళ్లు తాగేలోపు కొందరు లేచి మూత్రానికి వెళ్లి అలస్యం కాకూడదనీ గబగబా రావడం కూడా గమనించాడు. ఎవరి స్థలాలలో వాళ్లు కూచున్నాక ఆయన మళ్లీ తన రిపోర్టును ప్రారంభించాడు. కామ్రేడ్ దూలా అడిగిన ప్రశ్నతోనే మొదలుపెట్టాడు.

"మన లడాయిని అంధ్రలో దెబ్బతీయడానికి మొదట గ్రేహౌండ్స్‌ను ఏర్పర్చారు. అ తరువాత ఎనిమిదేళ్లకు 1992లో మహారాష్ట్ర ప్రభుత్వం గడ్‌చిరోలీలో 60 మంది స్థానిక అదివాసీ యువకులతో "క్రాక్ కమాండోస్" (సీ-60) పేరుతో నూతన కమాండో బలగాలను తయారు చేసింది. ఇక్కడ బస్తర్‌లో 2018లో డీ.ఆర్.జీ.ని రూపొందించారు. వీళ్లంతా స్థానికులే. మన అదివాసులే! మనవాళ్లతోనే మన జనాలను చీలదీసి మన కంట్లోనే మన వేలుగుచ్చే దోపిడీ సర్కార్ విధానం ఇది. మన ఆదివాసులలో ఒక సెక్షన్‌ను కరుడు గట్టిన విప్లవ ప్రతీఘాతకులుగా తయారు చేస్తున్నారు. వారిని మన జనంపైకే అంటే బంధుమిత్రులపైకే ఉసిగొలిపే ఈ సర్కార్ దుష్ట విధానం బ్రిటిష్ కాలం నుండే కొనసాగుతోంది" సీ-60 వివరణ ఇచ్చి విజ్జాల్ దూలా వైపు చూశాడు.

దూలా ముఖంలో కొత్త విషయం తెలిసిందన్న సంతృప్తి ఆయన ముసినవ్వుతోనే విజ్జాల్ అర్థం చేసుకున్నాడు.

తిరిగి విజ్జాల్ జనాలను ఉద్దేశిస్తూ "పోలీసుల చేతికి అందులో సీ-60 కమాండోల చేతికి సజీవంగా దొరికిన ఒక విప్లవకారున్ని వారు ఎన్ని చిత్రహింసలకు గురిచేసి ప్రాణాలు తోడేస్తారో మనలో తెలువందెవరికి" అంటూ విజ్జాల్ ఆగాడు, ఆయన కళ్లు చెమ్మగిల్లాయి. కాసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆయన మౌనాన్ని ఛేదిస్తూ ఒక్కసారే జనాల్లో "అమరవీరులకు జోహార్లు, కామ్రేడ్ శంకర్ అమర్‌రహే, అమరవీరుల ఆశయాలను కొనసాగిద్దాం, ఉంటే ప్రాణం, పోతే ప్రాణం, నక్సలైట్లకు ప్రజలే ప్రాణం" నినాదాలు కొండల మధ్య అడవిలో ప్రతిధ్వనించసాగాయి.

కామ్రేడ్ విజ్జాల్ చూపులు సారక్క మీదా నిలిచాయి. ఆమె పుట్టెడు దుఃఖంలో కూడా బిగించిన పిడికిలితో నినదించడం అగుపడింది.

విజ్జాల్ తన చేతి రుమాలుతో కళ్లు తుడుచుకొని "మన శంకర్ శవాన్ని తెలంగాణ నుండి వాళ్ల ఇంటోళ్లు వచ్చి తీసుకుపోయార"ని చెప్పి అందరికీ లాల్‌సలాం చేసి తన స్థలంలోకి వెళ్లి కూచున్నాడు.

విజ్జాల్ చెప్పిన చివరి మాటలు విన్న సారక్క మనసు కొంత కుదుటపడింది. జనం కోసం కొట్లాడిన తన కొడుకు శవం దిక్కులేని శవంగా మారలేదనీ, పోలీసులే పాతేసే దుస్థితి రాలేదని సారక్క తనలో తాను తన కుటుంబాన్ని గుర్తుచేసుకొని పెంచిన ప్రేమతో శవాన్నైనా తనవాళ్లు చూసుకున్నారు అనుకుంది.

విజ్జాల్ గత 20 ఏళ్లకు పైగా విప్లవోద్యమంలో సంఘ సభ్యుడిగా పని చేస్తూ రహస్య పార్టీ సభ్యుడిగా ఎదిగాడు. ప్రజల ఆదరాభిమానాలను, పార్టీ విశ్వాసాన్ని చూరగొన్న విజ్జాల్ గ్రామ పార్టీ కమిటీ (జీ.పీ.సీ.) సభ్యుడిగా ఎదిగివచ్చాడు. ఆయనకు ఎలాంటి చదువు సంధ్యలు లేవు. ఆయన ప్రజలను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తాడు. గౌరవిస్తాడు. ఊళ్లో ఎవరికి ఏ కష్టం వచ్చినా విజ్జాల్ అక్కడ ప్రత్యక్షమై అందులో భాగమవుతాడు. ఆయనకు భార్య, ముగ్గురు సంతానం. ఆయన నిరుపేద ఆదివాసీ కుటుంబం నుండే వచ్చాడు. కానీ విప్లవోద్యమ ఫలితంగా ఆయన తల్లీ తండ్రి కొంత అడవి నరికి తమ పిల్లలను కలుపుకొని కష్టపడి ఆ భూమిని సాగులోకి తెచ్చుకున్నారు.

సల్వాజుడుం కాలంలో దుష్ట ఆదివాసీ తెగ పెద్ద ఊరి నుండి పారిపోవడంతో అతడి భూములను ఊరి జనతన సర్కార్ స్వాధీనం చేసుకొన్న దానిలోనుండి భూమిలేని పేదరైతులకు పంచడంలో భాగంగా విజ్జాల్ కుటుంబానికి అప్పటికే ఉన్న భూమికి తోడుగా మరికొంత భూమి దొరికింది. జనతన సర్కార్ యేటా చేపడుతున్న 'భూమి చదును' కాంపెయిన్‌లో భాగంగా వారి భూమి కూడా సాగుకు యోగ్యంగా తయారయింది. అ తెగపెద్ద పశువులు కూడ స్వాధీనపరుచుకున్న జనతన సర్కార్ వాటినీ పశువులు లేని రైతులకు పంచడంతో విజ్జాల్ కుటుంబానికి నాగటెడ్లు దొరికాయి. గత సంవత్సరం జనతన సర్కార్ మరో దుష్ట

భూస్వామి నుండి స్వాధీనం చేసుకున్న ట్రాక్టర్‌తో ఊరి రైతుల భూములు దున్ని ఇవ్వడం మొదలు పెట్టడంతో ఆ కుటుంబం పనులు తేలికై వారి శ్రమతో మెరుగైన పంటలు పండుతున్నాయి. దానితో నిన్నటి నిరుపేద విజ్జాల్ కుటుంబం విప్లవోద్యమ ఫలితంగా ఒక మధ్యతరగతి రైతు స్థాయికి చేరింది. అయితే విజ్జాల్ కుటుంబం మొదటినుండి అక్కడ జరిగిన అన్ని ప్రజా పోరాటాలలో భాగమవుతూ ఉంది. అందులో విజ్జాల్ సంఘ నాయకుడిగా, ప్రజల మధ్య శత్రువుకు అభేద్యమైన ఒక రహస్య పార్టీ ప్రతినిధిగా ఎదిగి వచ్చాడు.

**చిన్నారి నవ్నీ, తన తల్లి పౌరీ:**

10 మాసాల నవ్నీ (నవనీత) అముల్ శవం దగ్గర అంబాడుతూంది. శవం చుట్టూ చేరిన గ్రామస్థులు, గెరిల్లాలు ఏడుస్తున్నారు. ఊరి మహిళ నవ్నీని దగ్గరికి తీసుకొని ఎత్తుకుంది.

నవ్నీ తల్లీ పౌరీ తన సహచరుని శవం పైబడి ఏడుస్తోంది. గెరిల్లాలు ఆమెను ఊరడిస్తున్నారు.

"అక్కా ఇక మనకు అముల్ లేడక్కా, ఆయన ప్రజల కోసం విప్లవోద్యమంలో నవ్వుతూ అసువులు బాసాడు. ఆయన అంతిమ ఘడియలలో నిన్నూ నవ్నీని గుర్తు చేసుకున్నాడు. మీకు పదే పదే లాల్‌సలాం చెప్పాడు" అముల్ మరణాన్ని శశిధర్ కోయ భాషలో నవ్నీ తల్లి ముందుంచాడు.

ఊరి జనతన సర్కార్ అధ్యక్షుడు రామల్ తప్పే అముల్ ఎట్ల చనిపోయిండని శశిధర్‌ను అడిగాడు.

కమాండర్ శశిధర్ గద్గద స్వరంతో ఊరివాళ్లందరినీ ఉద్దేశిస్తూ తమపై జరిగిన కాల్పుల ఘటన వివరాలు చెప్పడం ప్రారంభించాడు.

"కామ్రేడ్స్! మా దళంపై ఏర్దడిమి అడవిలో కాల్పులు జరిగాయి. కాల్పుల మధ్య మేం రెండు బ్యాచులుగా విడిపోయాం. మా బ్యాచులో మేం అరుగురమే అయ్యాం. అరుగురిలో మన పెరిమిలి దళ కమాండర్ శంకర్ కూడా మాతోనే ఉండే. ఆయనకు మొదటి తూటా తగిలి తీవ్రంగా గాయపడి అధిక రక్త స్రావం, నొప్పితో నడవలేని స్థితిలో స్పృహ కోల్పోయాడు. ఆ సమయంలో మన కామ్రేడ్ అముల్ కూడా గాయపడినాడు. కామ్రేడ్ లచ్చీ గాయపడింది. మా ఆరుగురిలో ముగ్గురు క్షతగాత్రులు. ఆ స్థితిలో మేం శంకర్‌ను తేలేకపోయాం. ఆయన శత్రువు చేత చిక్కి అసువులు బాసాడు" అంటూ అపరాధభావంతో శశిధర్ తల దించుకున్నాడు.

ఆ గ్రామస్థులకు కామ్రేడ్ శంకర్ కూడా మంచి పరిచయస్తుడే. శంకర్ అమరత్వ వార్త విన్న ఆ గ్రామ యువత ఒక సాహసశీలి మిత్రున్ని నాయకున్ని కోల్పోయామన్న బాధకు గురయ్యారు. ఆ యువతకు ఆయనంటే ఎంతో ప్రేమ. చదువుకున్న శంకర్ వాళ్లకు ఎన్నో రాజకీయాలు, తెలంగాణ ఆదివాసుల జీవితాలు చెప్పేవాడు. తను కలసినపుడల్లా పెరిమిలి ప్రాంతంలో పోలీసుల కదలికలు, వాటి మధ్య ప్రజల సహకారంతో తన దళం పని చేయడం, అక్కడి ప్రజా మిలీషియా చర్యలు చెప్పి యువతను ఎంతో ఉత్సాహపరిచేవాడు. అలాంటి గెరిల్లా నాయకున్ని కోల్పోయామని విన్న యువతలో శంకర్ వీరోచిత జ్ఞాపకాలు మెదిలాయి.

"కామ్రేడ్స్" అంటూ శశిధర్ మళ్లీ మొదలుపెట్టాడు. "గాయపడిన అముల్‌ను సైతం మేం కాపాడుకోలేకపోయాం. మాతో ఉన్న 12 మందిలో శంకరే గెరిల్లా డాక్టర్‌గా ఉండే. ఆయన దగ్గరే మందుల కిట్ ఉండింది. మా దగ్గర ఏ మందూ లేదు. అముల్ రక్త స్రావాన్ని ఆపడానికి మేం చేసిన ప్రయత్నాలేవి పని చేయలేదు. మా నుండి కాల్పుల మధ్య విడిపోయిన బ్యాచు మాకు దారిలో ఒక గంట తరువాత కలియడంతో అముల్‌ను మేం ఎత్తుకరాగలిగాం. ఆ కలిసిన బ్యాచులో ఉన్న అక్కడి జనతన సర్కార్ అధ్యక్షుడు వున్నీస్ తప్పై రక్తస్రావాన్ని అరికట్టే మందుల కోసం ఊళ్లోకి పరిగెత్తాడు. కానీ, ఆయన వచ్చేలోపే మన అముల్ అసువులు బాసాడు." అముల్ సహచరివైపు చూస్తూ "క్షమించాలి కామ్రేడ్, అముల్ అమితంగా ప్రేమించే నవ్నీ ముందుకు, ఆయన్ని జీవిత సహచరుడిగా ఎన్నుకున్న నీ ముందుకు మేం అముల్ శవంతో రాక తప్పలేదు" అన్నాడు.

అముల్ వివరాలు ఆ గ్రామస్థులకు తెలియవు. ఆయన సహచరికి సైతం ఆయన పూర్తి వివరాలు తెలియవు.

అముల్‌తో అమెకు ఉద్యమంలోనే పరిచయం. అమెకు గెరిల్లా జీవిత అనుభవం కూడా కొత్తే! పౌరీ ఊళ్లో విప్లవ మహిళా సంఘం కేఏఎంఎస్ కార్యకర్త. అముల్ ఆ ప్రాంత గెరిల్లా దళ ఉప-కమాండర్ కావడంతో ఆయనతో అమెకు ఏర్పడిన పరిచయం ప్రేమగా మారి అది వారి మధ్య సాన్నిహిత్యాన్ని పెంచింది. ఆయన ప్రోత్సాహంతోనే అమె పీ.ఎల్.జీ.ఏ.లో చేరింది. ఆ క్రమంలో వారి మధ్య శారీరక సంబంధాలు ఏర్పడడంతో ఆమె గర్భం ధరించింది.

అదివాసీ సమాజంలో వివాహపూర్వ సంబంధాలపై ఎలాంటి నిషేధం లేదు. యువతీ యువకులు ఒకరిని ఒకరు ఇష్టపడితే వారి మధ్య స్వేచ్ఛగా సంబంధాలు ఏర్పర్చుకుంటారు. అవేమి గుప్త సంబంధాలు కావు. దానికి ప్రజల నుండి అభ్యంతరం ఏమీ ఉండదు. శారీరక సంబంధాలు ఏర్పడితే వివాహం అనివార్యమనే పూర్వ షరతూ లేదు. వారు వివాహం చేసుకున్నా మరొకరిని వివాహమాడినా ఎవరికీ అభ్యంతరం ఉండదు. ఈ క్రమంలో వారు పిల్లలను కన్నా అడ్డు చెప్పేదేమి ఉండదు. కాకపోతే, మారుతున్న సామాజిక విలువల ప్రభావంతో గర్భపాతాలు జరుగుతున్నాయి. అయితే, వివాహపూర్వ సంబంధాలతో ఎదురవుతున్న సమస్యలతో పాటు శృంగార విషయాలలో సైతం మార్పు తీసుకురావడానికి విప్లవోద్యమం ఎంతగానో కృషి చేస్తోంది. మరోవైపు బయటి సమాజంతో సంబంధాలు పెరుగుతుండడం, బ్రాహ్మణీయ భావజాలం, విస్తరిస్తుండడం కూడా తోడవుతూ ఆదివాసీ మహిళ హైందవ ఇనుప కచ్చడాల మధ్య బందీ అవుతోంది. శశిధర్ కూడ అదివాసీ యువకుడే కావడం, అముల్ గురించి, ఆయన ప్రేమించిన యువతి గురించి తెలిసిన వాడు కావడంతో అతడు ఇద్దరినీ చాలా ప్రేమించేవాడు. అముల్ గురించి తెలిసిన కమాండర్ శశిధర్ ఆయన ఉద్యమంలోకి వచ్చిన నేపథ్యం గురించి నవ్నీ తల్లి పౌరీతో పాటు ప్రజలకు సైతం తమ ఏరియా ఉప-కమాండర్ గురించి తెలువాలని భావించి నవ్నీని తన చేతులలోకి తీసుకున్నాడు.

"నవ్నీ తప్పె (తండ్రి) అముల్ బీజాపూర్ జిల్లా భైరన్‌గఢ్ ఏరియా వెచ్చం గ్రామస్థుడు. ఆయనకు తల్లి తండ్రులు ఛోటూ అని పేరు పెట్టుకున్నారు. వాళ్లది మనందరిలాగే పేద అదివాసీ కుటుంబం. పోరాట సంప్రదాయాలు కల విప్లవ కుటుంబం.

ఆ ప్రాంతంలో ఫాసిస్టు సల్వాజుడుం దుర్మార్గాలకు, దుశ్చర్యలకు గురికాని కుటుంబాలు బహుశా లేవు. మన ఛోటూ తండ్రి సంఘ నాయకుడు కావడంతో సల్వాజుడుం హంతక ముఠా ఆయన్ని హత్య చేసింది. ఆయన పినతండ్రిని గ్రీన్‌హంట్ అపరేషన్ కాలంలో పోలీసులు బలి తీసుకున్నారు. ఆయన తమ్ముడు ప్రమాదవశాత్తు బాంబు పేలిన దుర్ఘటనలో మన ఉద్యమంలోనే ప్రాణాలు కోల్పోయాడు. అవన్నీ మన నవ్నీస్ తప్పెను ఎంతగానో రాటు తేల్చాయి. తన తండ్రి, పినతండ్రి,

సోదరుని విప్లవ వారసత్వాన్ని కొనసాగిస్తూ ఉద్యమంలో చేరిన ఛోటూ ఇక్కడ గఢ్‌చిరోలీ ఉద్యమంలో ప్రజల కోసం తన నులివెచ్చని నెత్తుర్లను ధారపోసి నవ్వీని తన వారసత్వంగా మనకు మిగిల్చి వెళ్లాడు." అంటూ శశిధర్ నవ్వీ చేతిని పైకెత్తి బిగించిన పిడికిలితో అలాంటి వీరయోధుడికి "లాల్ సలాం" అన్నాడు.

ప్రజలంతా ఒక్కసారి అముల్ విప్లవ వారసత్వాన్ని తెలుసుకొని ఎంతగానో ముగ్ధులయ్యారు.

తన జీవిత సహచరుడు ఒక గొప్ప విప్లవ సంప్రదాయాల కుటుంబం నుండి వచ్చిన వాడు అన్న వివరాలు తెలుసుకొన్న పౌరీ కళ్లవెంట ఆయనను కోల్పోయానన్న బాధతో కన్నీళ్లు కారుతుండగా 'సమరంలో అమరత్వాలు' సహజమే కదా అనుకుంటూ తన సహచరుడి శవానికి ఆమె లాల్‌సలాం చేసి తుది వీడ్కోలుగా ఆయన నుదుటి పై ముద్దు పెట్టుకుంది.

"అక్కా అముల్ గురించి నీకు తెలిసింది చెప్పు అక్కా" అంటూ శశిధర్ పౌరీని కోరాడు.

పౌరీ అముల్ శవం తల వద్దే నిల్చుంది. "అముల్ గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. మన కామ్రేడ్ శశిధర్ చెప్పిన విషయాలు నేనిప్పుడే తెలుసుకున్నాను. మా ఇద్దరి పరిచయం కూడా ఇటీవలి కాలానిదే! మేం ఒకరిని ఒకరం ఎంతో ఇష్టపడ్డాం. నన్ను సాయుధం కావాలని అముల్ కోరాడు. నేను ఆ సంసిద్ధతతోనే సంఘంలో చేరాను. మా ఊరి నుండి కూడా గెరిల్లాలుగా ఉన్నారు. ఉద్యమంలో అమరులైన వారున్నారు. మా నాన్న కూడా సంఘ నాయకుడే. మా అమ్మ, నాన్నా ఊరి వాళ్లు నన్ను ప్రోత్సహించారు. నేను అముల్‌ను ఇష్టపడుతున్న విషయం కూడా వాళ్లకు తెలుసు. పెద్దలకు మా గోత్రాలు కలిసాయి. మాకు మనసులు కలిసాయి. శరీరాలూ కలిసాయి. మాకు నవ్వీ పుట్టింది. ఇక నాకు నవ్వీని అముల్ వారసురాలుగా ఉద్యమ బిడ్డగా పెంచడమే కర్తవ్యంగా మిగిలింది. ఈ ప్రజలే నాకు కాన్పు చేశారు. శత్రు దాడుల నుండి తమ బిడ్డలా నన్నూ నవ్వీని కాపాడుకుంటున్నారు. వారి ఋణం తీర్చుకోవడానికి నేను తుదివరకు అమరుడి ఆశయాల సాధనకై పాటు పడుతాను"' అంటూ ప్రజలకు తన సందేశాన్ని విన్పించింది.

స్థానిక జనతన సర్కార్ అధ్యక్షుడు అముల్ శవంపై అరుణపతాకాన్ని కప్పాడు. ఆయన తన బాధ్యతగా ప్రజల ముందు ఉద్యమ పరిస్థితులు, ఉద్యమంలో అమరత్వాలు, క్షతగాత్రులు కావడంపై లచ్చివైపు చూస్తూ మాట్లాడాడు.

"కామ్రేడ్స్, మనం మన సృజనక్క అమరత్వ వార్త విని రెన్నెళ్లవుతోంది. నిరుడు ఇదే కాలంలో మనం మన పియమైన రాంకో, శిల్పలను కోల్పోయాం. అంతకు ముందు కసనూర్‌లో 40 మందిని నష్టపోయినం. ఇపుడు శంకర్, అముల్‌లు మనకు లేరు. కానీ, వారి పోరాటం,త్యాగాలు లేకుండా నేను లేను, మీరు లేరు. వాళ్లు గొప్ప నిస్వార్థ జీవులు. వాళ్లు పోరాడుతూ మన ప్రజల చేతిలో అధికారాన్ని నిలపడానికి అహర్నిశలు శ్రమిస్తున్నారు. మన అధికారం దోపిడీ వర్గాలకు కునుకు పట్టనివ్వడం లేదు. అడవిలో ఎక్కడ చూసినా పోలీసులే! ఎక్కడెక్కడివాళ్లో ఏదేదో భాష మాట్లాడేవాళ్లు మన అడవిలో మన మధ్యకు చేరారు. మన గెరిల్లాల అచూకి తెలిసిందంటే జంతువులను వేటాడినట్టు వేటాడుతున్నారు. ఎవరూ అ వలలో చిక్కకూడదు. మనం చాలా జాగ్రత్తగా ఉండాలి.

"మనవాళ్లు ఊరి అక్కలు శత్రు సమాచారం ఇచ్చినపుడు అక్కడి గుట్టపైకే ఎక్కి కవర్లు తీసుకోవడం కాకుండా ఎక్కువ దూరం వెళ్లి ఉంటే మనకు దక్కేవారేమో! సరే, అక్కడి గుట్టే ఎక్కి కవర్లు తీసుకున్నవాళ్లయినా అ కవర్లలో ఉండకుండా ఒక్క దిక్కు సమాచారం తెలుసుకొని గుట్ట దిగి చాయ్ దాంధాకు ఎందుకు దిగిండ్రో! లడాయిల అలవాట్లు లడాయిని బట్టే మారాలి కదా! చాయ్ దగ్గర లొల్లి విని వాడు చుట్టుముట్టే! గవన్నీ లేకుంటే మనవాళ్లు మనకు మిగిలేదేమో! సీ-60 కమాండోలు మన విప్లవకారులను హతమార్చడానికి అనేక రకాలుగా వలలు పన్నుతున్నారు. ఇది అడుగడుగున మనసులుండాలని చెప్పేటోల్లే మరిచిపోయినపుడు నష్టాలుంటయి మరి!

వందేళ్ల క్రితం మాడియా రాజ్యాన్ని స్థాపించిన మన ఆదివాసీ ప్రజా నాయకుడు గుండాదూర్‌ను బ్రిటిష్ వాళ్లు కాల్చి చంపారు. అంతకు ముందు 1857లో మన మరో అదివాసీ నాయకుడు వీరబాబురావు సద్మెక్‌ను చంద్రపుర్ జైల్లో ఉరితీశారు. మనమంతా వారి వారసులం. మన గోండు జాతిది పోరాట వారసత్వం. మన శంకర్ తండ్రి కోటె హన్మంతు అమరుడు. మన అముల్ తండ్రి అమరుడే. వాళ్లంతా ఈ అడవులు మావే అని నినదించి పోరు దారిలో నడిచిన వీరయోధులు. వారి త్యాగాలు మనకు నిత్యం అదర్శం. మనం వారి త్యాగాల నుంచి నేర్చుకుందాం. వారి ఆశయాలను కొనసాగిద్దాం. వారు ఎత్తిపట్టిన పోరాట జెండాను అడవుల గుండా, మైదానాల గుండా దిల్లీలో ఎగురవేద్దాం. మనది లంబా లఢాయి (దీర్ఘకాల యుద్ధం). ఇది మన శక్తికి పరీక్ష. ఇందులో మనం గెలిచి తీరుతాం" అంటూ తన మాట ముగించిన సర్కార్ అధ్యక్షుడు అముల్ శవానికి (పాడె) భుజాన్ని అందించాడు.

గ్రామస్థులూ, గెరిల్లాలూ శవాన్ని అడవికి చేర్చారు. ముందే అక్కడికి చేరి అంత్యక్రియల ఏర్పాట్లు చేసిన గెరిల్లాలు శవాన్ని కాష్టంపై పెట్టారు. జనతన సర్కార్ అధ్యక్షుడు పాడెకు నిప్పంటించాడు. ఆకసానికి నిప్పులు చెలరేగుతున్న మంటలలో నవ్వీ పౌరీల ముఖాలు అరుణ వర్ణంలో వెలుగుతున్నాయి.

**లడాయిలో మాతృత్వం-అమరత్వం:**

వానలు తగ్గాయి. పోలీసు క్యాంపులకు వ్యతిరేకంగా అనేక ప్రాంతాల్లో పోరాటాలు తీవ్రమయ్యాయి. వేలాది మంది నెలల తరబడి వీధుల్లో ఉన్నారు. ఇంకో పక్క లక్షల సైనిక, అర్ధ సైనిక బలగాల దాడులు పెరిగిపోయాయి. కరోనా ప్రభావం చూపుతున్నది. వైరస్ నివారణకు ఎక్కడికక్కడ అవగాహన క్యాంపెయిన్లు జరుగుతున్నాయి. అవసరమైన చోట వైద్యం అందుతోంది.

రుషి తలమునకలుగా పనిలో ఉన్నాడు. కానీ ఆయన్ను విప్లవంలో పిల్లలు, తల్లుల త్యాగాల ఉద్విగ్న విషాదాలు వెంటాడుతునే ఉన్నాయి. ఎప్పటికప్పుడు కొత్త వార్తలు. అదే కన్నీటి జడి. అయినా అన్నిటినీ, అందరినీ విప్లవోద్యమం తీర్చిదిద్దుతున్న తీరును పదే పదే అంచనా వేసుకుంటున్నాడు. శంకర్, అముల్ అమరత్వ సందేశాల వీడియోలు అందాయి.

వాటిని చూడటానికి అందుబాటులో ఉన్న కామ్రేడ్స్ అంతా ఒక చోటికి చేరారు.

రుషితో పాటు రాహీ దళం, అందులో సభ్యురాలైన గెరిల్లా స్మరణ వీడియో చూస్తున్నారు. తనకు తెలిసిన గెరిల్లాల పిల్లలు అశ్విని, రమా, వివేక్, భగత్, రమేశ్, సంధ్య, రంజిత్, క్రాంతి.. ఇలా ఎందరో. ఇంకా ఉద్యమంలో పుట్టినా తల్లితండ్రులు లొంగిపోవడంతో అనివార్యంగా కుళ్ల సమాజంలో భాగమైన పిల్లలూ మెదులుతున్నారు. ఉద్యమంలో

(మిగితాది 18వ పేజీలో...)

# విషాద ప్రహసనం 'కుట్రదారు కోడి'

పి.వరలక్ష్మి

ఏడవలేక నవ్వే స్థితిని ఎలా వర్ణిస్తాం? అయిదేళ్ళ క్రితం ప్రజల చేతుల్లో ఉన్న డబ్బంతా ఉన్నఫలంగా చెల్లనిదైపోయి, చిల్లర కోసం అష్టకష్టాలు పడిన సందర్భాన్ని గుర్తుచూస్తూ, వట్టిపోయిన రాజకీయ ప్రగల్భాలపై సోషల్ మీడియాలో చాలా మంది జోకులు వేసుకున్నారు. కరోనా విషాదంలో చప్పట్లు కొట్టించుకున్నప్పుడు, కోటి ఉద్యోగాలు పోయినప్పుడు, స్కూలు నాటకం వెనక కుట్రను వెతికినప్పుడు.. అనేక అసంబద్ధతలు క్రూర పరిహాసం చేసినప్పుడు బహుషా చాలామంది విషాదంగా నవ్వుకొనే ఉంటారు. ఇప్పుడు జరుగుతున్నవన్నీ ఉన్నవి ఉన్నట్లు చిత్రించినా బోలెడంత వ్యంగ్యం కనపడుతుంది. దీన్ని సాహిత్యం చేయాలంటే బైటికి కనిపిస్తున్న ఈ ప్రహసనం లోలోపలికి చూడగలగాలి. ఈ పరిణామాలు మనుషుల వ్యక్తిగత జీవితంలో, సాంఘిక జీవితంలో అంతకుమించి మానసిక ఆవరణలో పుట్టించే ప్రకంపనలను సున్నితంగా గ్రహించగలగాలి.

వ్యవస్థ లోపాలను, అధికార వర్గాల డాంబికాలను ఎత్తిచూపడానికి రచయితలు వ్యంగ్యాన్ని ప్రయోగిస్తుంటారు. వ్యంగ్యం నవ్వు పుట్టిస్తుంది. ఆలోచింపజేస్తుంది. దేశంలో ఇప్పుడు నడుస్తున్న సన్నివేశం పైకే ఒక వ్యంగ్య నాటకంలా కనిపిస్తుంది. కానీ సాహిత్యం అంతకు మించి ఏదో చేయగలగాలి. పాలకులు కాదు, సాధారణ ప్రజలు ఇంత ఉన్మత్తంగా తయారుకావడం ఎలా జరుగుతోందో పట్టుకోవాలి. మనిషి సున్నితత్వాలన్నీ ఎక్కడ మొద్దుబారుతున్నాయో, వ్యక్తిత్వాలు ఎలా విధ్వంసం అవుతున్నాయో కనిపెట్టాలి.

'కుట్రదారు కోడి' అనే పేరు చూడగానే అదొక వ్యంగ్య రచన అని అర్థమవుతుంది. ఈ వ్యంగ్యం కుట్రలు ఎలా తయారుచేయడబతాయో ఎత్తిచూపుతుంది. దీనికి నేరుగా బలయ్యే బాధితుడే కాదు, బలి చేసే ఊరు మొత్తం పరోక్ష బాధితులే. కుట్రదారు మాత్రమే కాదు, ఆ కుట్రకు ఒక చేతతోనో, మాటతోనో, మౌన అంగీకారంతోనో సహకరించే మూర్ఖులు, మర్యాదస్తులు అందులో ఎలా భాగస్వాములవుతారో చూపిస్తుంది.

రచయిత ఉన్ని ఆర్ మళయాలంలో కథకుడిగా, సినిమా స్క్రీన్ ప్లే రైటర్‌గా, నటుడిగా కూడా కేరళ సమాజానికి బాగా పరిచయస్తుడు. తన నవల 'ప్రతి పూవన్ కొళి' తెలుగు అనువాదం 'కుట్రదారు కోడి' ద్వారా ఇప్పుడు తెలుగు పాఠకులకు పరిచయమవుతున్నాడు. జె.దేవిక మొదట దీనిని 'ద కాక్ ఈజ్ ద కల్ప్రిట్' పేరుతో ఇంగ్లిష్‌లోకి అనువదించారు. దానిని పద్మజా షా తెలుగు చేశారు.

కుట్రదారు కోడి కథ కేరళలో ఒక చిన్న గ్రామం గురించి. అది మినీ భారతదేశమే. అమెరికా భక్తుడు, ముస్లిం ద్వేషి అయిన ఊరిపెద్ద చాక్కు 'చట్టాన్ని పక్కన పెట్టి పది వరిమళ్లను నింపేసి ఉంటాడు. ఇల్లు కట్టేటప్పుడు పంచాయితీ రోడ్డును ఆక్రమించి ఉంటాడు.' అయితే ఏం, చట్టం పట్ల ఎంతో గౌరవం ఉన్న దేశభక్తుడు. ఉలిపి



కట్టెలా ఒక్కడు తప్ప ఊర్లో ఎవరూ తర్కం ప్రయోగించి ఆలోచించరు. వాడు కొచ్చుకుట్టన్. బుర్రలో చాలా ఆలోచనలు, ప్రశ్నలు ఉన్నవాడు ఊరికి ప్రమాదకారి కాకుండా ఎలా ఉంటాడు? తొంభై ఏళ్ల నానియమ్మ ఇంటికి పోలీసులొస్తే ఎందుకు వచ్చారు అని అడుగుతాడు. ఆమె కోడి మీద కంప్లెయింట్ ఉంది. అమరజవాన్ల పవిత్ర స్మృతికి నివాళు లర్పిస్తున్నప్పుడు, పూజ మొదలుపెట్టేటప్పుడు, అజా ఇవ్వబోతున్నప్పుడు, జాతీయగీతం పాడుతున్నప్పుడూ అది దిక్కులు దద్దరిల్లేలా కూత పెడుతుంది. ఇది ఊరందరినీ కలవరపెడుతుంది. అందరూ కోడి కూతకు భయపడిపోయేవారే. బిక్కచచ్చి మూర్ఛపోయేవాళ్లు కూడా ఉంటారు. ఊరిలో కోడి కూత సర్వసాధారణం కదా! మరి ఈ రియాక్షన్ ఏమిటి అంటే దానికి ఎప్పుడైతే దేశద్రోహి ముద్రపడిందో అప్పటి నుండి అది అన్నిటికీ దుష్టశకునమైంది. చివరికి కమ్యూనిస్టులు కూడా కలవరపడతారు. తప్పదు, దేశభక్తి ఇప్పుడు పాలకుల చేతిలో తిరుగులేని శక్తి. ఏ కమ్యూనిస్టులు వాళ్లు? కమ్యూనిస్టులనబడే వాళ్లంతా ఒకటి కారని, పాలకుల కుహనా దేశభక్తిని ప్రశ్నించేవాళ్లే నిజమైన కమ్యూనిస్టులని అనవచ్చు. కాని నవల ఫోకస్ ఇది కాదు. కాబట్టి ఆ చర్చలోకి పోవడం లేదు.

విన్నవి, ఊహించినవి కలిసి వినాయకుడు పొలుతాగుతున్నాడంటే పోలోమన్న జనం లాగా అవుతుంది పరిస్థితి. ఇది నమ్మశక్యంగా లేదు అంటాడు కొచ్చుకుట్టన్. తనలాగే కొంతమందైనా హేతుబద్ధంగా ఆలోచిస్తారని అనుకుంటాడు. కానీ ప్రతిదాన్నీ ప్రశ్నించమని తనకు పాఠాలు చెప్పిన కురుప్ సార్ 'పాత చాక్‌పీస్ పొడిని' దులిపేసుకొని, కొత్త నీతులు చెబుతాడు. తన ఇంటి వరండా గోడమీద ఉన్న నారాయణ గురు ఫోటో తీసేసి 'మాత' (బహుషా భారతమాత!) ఫోటో పెట్టుకొమ్మని, అప్పుడే తనని ఎవరూ అనుమానించరని గట్టిగా చెప్తాడు.

నానియమ్మ కోడి కోసం మొదలై ఊర్లో ఉన్న కోళ్ళన్నిటినీ నిర్మూలించేదాకా పోవడం, విధవరాళ్ళైన కోడిపెట్టలని సాయుధం చేసే ప్రయత్నం జరిగిందనడం.. అంతా ఒక ప్రహసనంలా ఉంటుంది. నిజానికి ఫార్స్ (ప్రహసనం) అనే సాహిత్య ప్రక్రియ నిర్వహణలో ఎంతో సృజనాత్మకత అవసరమవుతుంది. మామూలుగా ప్రహసనం హాస్యం పుట్టిస్తుంది. విషాద ప్రహసనం సాహిత్యంలో అరుదే. దానిని అద్భుతంగా నిర్వహించాడు ఉన్ని ఆర్. కుట్రదారు కోడి కథలోని అసంబద్ధ సన్నివేశాలు, మనుషుల వింత ప్రవర్తనలూ, విపరీత మానసికతలూ చదివి నవ్వుకుంటాం. కాని అంతర్గతంగా దానిలో ఉండే విషాదం కళ్లపడినప్పుడు చురుక్కుమనే బాధను అనుభూతి చెందుతాం. దు:ఖపడతాం, ఆవేశపడతాం. ఈ విషాదానికంతా కొచ్చుకుట్టన్ జీవితం ప్రతీక. సౌదీ పోయి డబ్బు సంపాదించుకొని స్థిరపడాలని కలలు కనే మామూలు యువకుడు కొచ్చు మానసికంగా, శారీరకంగా శిథిలమై మంచం పడతాడు. ఈ యువకుడిలాగే ఉంది కదా దేశం అనిపించక మానదు. ఈ దేశంలో ఆలోచించడం, ప్రశ్నించడం ఎంత నేరమో మనకు తెలుస్తూనే ఉంది.

నవలలో ఒక సంభాషణ భీమా కోరేగాం కుట్ర కేసును గుర్తుకుతెస్తుంది. గ్రంథాలయం గోడమీద 'ద గుడ్ పర్సన్ ఆఫ్ షెజ్వాన్' లోని వాక్యాలను కొచ్చుకుట్టన్ కురుప్ సార్‌కు చూపిస్తాడు. "ఇదేం నగరం? మీరెట్లాంటి జనాలు? నగరంలో అన్యాయం జరిగినప్పుడు తిరుగుబాటు చేయాలి. తిరుగుబాటు లేకపోతే చీకటి పడేలోపు ఆ నగరం నాశనం అవటమే మంచిది" ఎల్గార్ పరిషత్ మీటింగ్‌లో ప్రదర్శించిన నాటకంలో ఈ వాక్యాలున్నాయని భీమాకోరేగాం కుట్ర కేసులో పోలీసులు రాశారు. కుట్రలు ఎక్కడ పుడతాయి అంటే చాక్కు వంటి షావుకారు ఇళ్లలో పుడతాయి. అవి ఊర్లలో వాడల్లో ప్రయోగించబడతాయి.

ఒక చోట నానియమ్మ గురించి చెప్తూ ఆమె ఎవరో కాదు దుర్గాభాబీ అంటారు. భగత్‌సింగ్ ఫోటో కూడా మసగ్గా ఆమె ఇంట్లో కనపడుతుంది. కథలో కుట్రకు కేంద్రం కూడా ఆమె ఇళ్లే. ఎందు అని రచయిత నేరుగా మనకు వివరించదు. మనం ఊహించుకోవాలి. అలా ఓపెన్ ఎండెడ్ సంభాషణలు, సన్నివేశాలు ఈ నవలలో కనిపిస్తాయి. కొచ్చుకుట్టన్ స్నేహితులు ముస్లింలు కావడం అనుమానించదగ్గ విషయమవుతుంది. నానియమ్మ కోడి పుంజును చంపితే అందరి సమస్యా తీరుతుందని చివరగా కొచ్చు స్నేహితుడు ఒక ప్రయత్నం చేస్తాడు. కోడిపుంజు నవ్వుతుంది. ఆ నవ్వులో చాలా అర్థాలున్నాయి. అన్ని అసంబద్ధతలను వివరించే అర్థాలున్నాయి.

కొచ్చుకుట్టన్ తల్లి సుమతి వ్యక్తిత్వం గొప్పది. ఆమె కష్టజీవి, నిజాయితి, హేతుబుద్ధి కలది. ఇంటి వరండా గోడ మీద నారాయణ గురు స్థానంలో వేరే ఫోటో పెడితే అదెవరని కొడుకుని అడుగుతుంది. 'మాత' అని చెబితే నేను కదా నీ మాతను, ఒక తల్లి చాలు ఇంటికి, తీసిపారెయ్' అంటుంది. ఆ రకంగా దేశభక్తిని ప్రదర్శించుకొని మంచివాడనిపించుకునే అవకాశం కొడుక్కు ఇవ్వదు. ఆంతోనియస్ మరో విలక్షణ పాత్ర. లోకంలోని రీతి రివాజులకు అతీతుడు. నేరస్తుడు, బహిష్కృతుడు. అతన్ని చూస్తేనే జనం దడుసుకుంటారు, సుమతి, ఆమె భర్త తప్ప. చాలా ప్రత్యేకంగా అనిపించే ఇవన్నీ నిజానికి ప్రతీకాత్మక పాత్రలే.

నవలను 13 అధ్యాయాలుగా విభజించాడు రచయిత. ఒకొక్క అధ్యాయం ముందున్న ఒకొక్క బొమ్మను జాగ్రత్తగా పరిశీలిస్తే రచయిత ఆలోచనలోని లోతు మనకు తెలుస్తుంది. అగిపెట్టె మీదున్న కోడి బొమ్మను చూస్తే ఊరు తగలబెట్టడానికి కోడిని ఉపయోగిస్తున్నారనే అర్థం స్ఫురిస్తుంది. ఒక అధ్యాయం ముందు తగలబడుతున్న రైలు బోగీ బొమ్మ ఉంటుంది. దేశ రాజకీయాలను ఒక రక్తసిక్త మలుపు తిప్పిన రైలు బోగీ కదా అనిపించకమానదు. అక్కడి నుండి నిర్మూలనం మొదలవుతుంది. ఈ కథలో అది కోడి పుంజుల నిర్మూలం కావడం మళ్లీ ఒక ప్రతీక.

అట్లాగే ఆధ్యాయాల పేర్లు కూడా సాధారంగా ఉంటూనే లోతైన అర్థాలను స్ఫురిస్తాయి. ఈ నవల దేశంలో జరిగిన ఏ ఒక్క సంఘటనకు సంబంధించిన ప్రతీక కాదు. చదువుతుంటే అనేక విషాద సంఘటనలు మనముందు అలా మెరిసిపోతాయి. దీనికి ముగింపు కూడా లేదు. ముగింపు మనం ఆలోచించవలసిందే. ఇటువంటి గొప్ప ప్రయోగం చేసిన రచయితను అభినందించాల్సిందే. శ్రమతీసుకొని తెలుగులోకి అనువాదించి పద్మజా షా తెలుగు పాఠకులకు ఎంతో మేలు చేశారు. అక్కడక్కడా కొన్ని వాక్యాలు సంక్లిష్టంగా ఉన్నా చదివిస్తుంది.



---

(16వ పేజీ తర్వాత)

పుట్టి ఉద్యమానికి దూరంగా సానుభూతిపరుల వద్ద తమ తల్లిదండ్రులెవరో తెలియకుండా పెరిగి పెద్దయినవారూ తలపుకొస్తున్నారు. బయటి జీవితంలో పిల్లలను కని ఉద్యమంలో భాగమయ్యాక తమ పిల్లల గురించి కనీస సమాచారం లేని తల్లిదండ్రుల రెప్పచాటు వ్యథలు గుర్తుకొస్తున్నాయి. కనీసం ఎక్కడ ఉన్నారో, ఎలా ఉన్నారో కూడా తెలియకుండా పెరుగుతున్న పెరిగిన పిల్లల కోసం తన్లాడే తల్లులు ఆవేదన స్మరణలో మెదిలింది. ఇక పిల్లలను కనకూడదనే నిర్ణయం తీసుకొని అమ్మతనాన్ని వదులుకున్న తన సహచరి వంటి వారెందరో లెక్కలేదు. అదీ ఒకలాంటి త్యాగమే అనిపించింది. ఇదంతా ఒక పాత ప్రపంచాన్ని రద్దు చేసి కొత్త ప్రపంచాన్ని నిర్మించడానికి వేలాది, లక్షలాది తల్లులు, వాళ్ల పిల్లలు చేసిన సాహసిక త్యాగమయ పోరాటం..

రుషి వీడియో చూస్తూ పదే పదే ఎందరినో గుర్తు చేసుకుంటున్నాడు. ఆయన హృదయమే కాదు. జ్ఞాపకాలూ బరువెక్కాయి.

శంకర్, అముల్‌లకు జోహార్లు.. అని అక్కడున్న వారందరూ నినదించారు. దాంతో ఆయన తన తలపుల వ్యథ నుంచి బైటకి వచ్చాడు.

అప్పటికే స్మరణ వీడియోను కట్టేసింది.



# శాంతికి మానవీయ చిత్తరువు



నెత్తురు కక్కుతున్న కాలాన్ని
తన నగ్న పాదాలతోనే
అధిగమించాడతను
పూసే పొద్దుకు అభిముఖంగా
అనివార్యపు యుద్ధంలా పర్చుకొని
చరిత్రను విస్తృతం చేశాడు
అతను కేవలం అస్తమించాడు
ఈ ముసురు యుద్ధపు విభ్రాత్రిలో
అనునయంగా మనతో సంభాషిస్తూనే ఉంటాడు

# ఆర్కె ఆదర్శం

సాకీ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో మావోయిస్టు పార్టీ జనశక్తిపార్టీ చర్చల తర్వాత ఆర్కె గురించి రాయడానికి ఆయన్ని తెలియనివారుండరు. తెలుగు సమాజంలోనే కాదు దేశమంతటా ఆ చర్చలు ఎంతో సమర్థవంతంగా నిర్వహించిన విప్లవోద్యమ నాయకుడుగా ఆయన గుర్తింపు పొందారు. అప్పటి మీడియా పరిశీలన ప్రకారం మధ్యవర్తిత్వం వహించిన కమిటీ ఫర్ కన్సర్న్డ్ సిటిజెన్స్ సభ్యుడు దాని కన్వీనర్ యస్ఆర్ శంకరన్ గారిని అలా ఉంచి తమ తమ శిబిరాలకు ఎంతో సమర్థవంతమైన, సంయమనం పాటించిన, అదే సమయంలో స్పష్టంగా తమ వైఖరి ఏమిటో చెప్పిన నాయకుడిగా రామకృష్ణ (ఆర్కె) గుర్తింపు పొందాడు. అప్పటి చర్చల గురించి మీడియాలో విన్న వాళ్లందరూ ఇప్పటికీ గుర్తుపెట్టుకున్నారు. ఒకటి, రెండు విషయాలను ఇక్కడ ప్రస్తావించాలి. మొదటిది ప్రభుత్వం తరపున హెూం మంత్రి సిపిఐ ఎంఎల్ పీపుల్స్‌వార్‌కు మాత్రమే చర్చలకు ఆహ్వానం పంపారు. ఈ చర్చలు విప్లవోద్యమ పార్టీలతో జరగాలని, తమతో పాటు సిపిఐ ఎంఎల్ జనశక్తి నాయకత్వం కూడా వస్తుందని ఏపీ పీపుల్స్‌వార్ పార్టీ కార్యదర్శిగా హెూంమంత్రికి రాసింది కూడ రామకృష్ణనే. తీరా అక్టోబరు 11వ తేదీన నల్లమల నుంచి గుత్తికొండ బిలం మీదుగా హైదరాబాదు చేరుకొని తమకు వసతి కల్పించిన మంజీరా గెస్ట్ హౌస్‌లో జనశక్తి నాయకుడు అమర్, ఆయన సహ ప్రతినిధి రియాజ్‌లతోపాటు ఎఓబి పీపుల్స్‌వార్ కార్యదర్శి సుధాకర్, ఉత్తర తెలంగాణ పీపుల్స్‌వార్ ప్రతినిధి గణేశ్‌లతో అక్టోబరు 12 న నిర్వహించిన మీడియా కాన్ఫరెన్సులో తమది ఇప్పుడు సిపిఐ ఎమ్ఎల్ పీపుల్స్‌వార్ కాదని, అప్పటికే సెప్టెంబరు 21న తమ పార్టీ ఎంసీపీతో కలిసి సిపిఐ మావోయిస్టుగా ఏర్పడిందని, తాము చర్చల్లో జనశక్తితో కలిసి మావోయిస్టు పార్టీగానే పాల్గొంటామని ప్రకటించారు. హెూంమంత్రితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన ఏ సందర్భంలోనూ ఆయన ఈ విషయాన్ని ప్రస్తావించలేదు. అయినా మీడియాతో ఈ ప్రకటన చేసిన తరువాత ప్రభుత్వం నుండి గానీ, మీడియా నుండి గాని సిసిసి నుంచి గానీ ఏ సందేహం తలయెత్తలేదు. ఏ ప్రశ్నా రాలేదు. ఆ తరువాత ఎప్పుడో బహుశా పదవీ విరమణ చేసింతర్వాత అనుకుంటాను రాధాకృష్ణగారు చేసిన ఇంటర్వ్యూలో అప్పటి ఇంటెలిజెన్స్ చీఫ్‌గా ఉన్న కె.అరవిందరావు సిపిఐ మావోయిస్టుగా ఏర్పడడం వల్ల దానికి అఖిల భారత పార్టీ గుర్తింపు వచ్చినట్టయిందని, కనుక అంతర్జాతీయ దక్షిణాయుత ప్రాంతాలలో ఇరుపక్షాల మధ్య శాంతి కోసం చేసే చర్చలకు అంతర్జాతీయ సూత్రాలను అన్వయించాల్సి వస్తుందనీ, అందువల్లే రెండోదశ చర్చలకు ప్రభుత్వం పిలవలేదని చెప్పాడు (ఓపెన్ హార్ట్ విత్ ఆర్కేలో ఇవే మాటలు కాకపోవచ్చు ఈ భావం వచ్చేలా). రెండవ అంశం చర్చలు ఆరంభం కాగానే ఒకరికి ఒకరం ఉత్తరాలు రాసుకొని ఆహ్వానం పొంది, ఆమోదం పొంది ఉన్నాము కానీ ఉభయులూ కలిసి చర్చల కోసం ఒక ఆమోదపత్రం రాసుకోవాలని ఆర్కె పట్టుబట్టాడు. చర్చలలో ప్రతిష్టంభన వచ్చిందని లంచ్ సమయానికి ఇంటెలిజెన్స్ వాళ్లు మీడియాకు ఉప్పందించారు. వాస్తవానికి అప్పటికి అది మధ్యవర్తుల జోక్యం వల్ల చర్చల సమయానికే టీకప్పులో తుఫానులా సమసిపోయింది. లంచ్ సమయంలో హెూంమంత్రి జానారెడ్డి గారి అత్తవారి ఊరు రామకృష్ణ పుట్టిన ఊరు అనే వంటి ప్లజంటరీలు కూడా చోటు చేసుకున్నాయి.

చర్చల ఎజెండా మీద చర్చ ప్రారంభిస్తూ రెండుపార్టీల ప్రతినిధివర్గానికి నాయకత్వం వహిస్తున్న రామకృష్ణను ఉద్దేశించి... రామకృష్ణగారూ మీకేం కావాలో చెప్పండి అని రెండు పార్టీలు ఏవి చర్చించదలుచుకున్నాయో అనే భావంతోనే అడిగాడు. దానికి ఆర్కె... మేము ప్రజల ఆకాంక్షలపై ప్రజామోదంతోనే ప్రజాస్వామ్యవాదులైన మేధావుల ప్రమేయం వలన ప్రభుత్వంతో

ఈ చర్చలకు వచ్చాము. ఈ చర్చలపట్ల మాకేమీ భ్రమలు లేవు, అయితే మాకేం కావాలని అడగటానికి గానీ, మీకేం కావాలని అడగటానికి గానీ రాలేదు. వైరి శిబిరాలుగా ఉన్న మనం ఒక బల్లకిరువైపులా కూర్చొని మాట్లాడుకొనే ఒక పరిస్థితిని కల్పించిన

ప్రజల కోసం ఏమైనా చెయ్యగలమా అని చర్చించే ప్రతిపాదనతో వచ్చాము. మిమ్మల్ని మా సిద్ధాంతాన్ని అంగీకరించమని అడగడానికి గాని, మా ఎజెండా ప్రకారం సమస్యలు పరిష్కరించండి అని అడగటానికి గానీ రాలేదు. మీరు ప్రమాణం చేసి అధికారంలోకి వచ్చిన రాజ్యాంగంలోని ఉపోద్ఘాతం, ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కులకు ఏ మాత్రం కట్టుబడి ఉన్నారు, ఏ మేరకు పాటించబోతున్నారు అనేవి చర్చించడానికి మాత్రమే వచ్చాము... అన్నాడు.

నాలుగురోజులపాటు ఎంతో అర్థవంతంగా జరిగిన చర్చల్లో పౌర, ప్రజాస్వామిక హక్కుల గురించి ఒకరోజు భూసంస్కరణలు గురించి మూడు రోజులు చర్చలు జరిగాయి. గతంలో జరిగిన ఉల్లంఘనలపై విచారణ కాకుండా తన ప్రభుత్వం రూల్ ఆఫ్ లా (చట్టబద్ధపాలన) అందిస్తుందని హెూంమంత్రి హామీపడ్డాడు. ఇంక మూడురోజుల పాటు భుసంస్కరణలపై చర్చ జరిగింది. అది కూడా దున్నేవారికే భూమి అని విప్లవపార్టీ ఎజెండాగా కాకుండా ప్రతి దళిత కుటుంబానికి మూడెకరాల భూమి ఆ కుటుంబంలోని స్త్రీ యజమాన్యంను గుర్తిస్తూ ఇవ్వాలని విప్లవ పార్టీలు ప్రతిపాదించాయి. అట్లాగే ప్రభుత్వ భూములు, అన్యాక్రాంత భూములు ఎన్నో కాటగిరీలు కలుపుకొని ఒక కోటి ఇరవైలక్షల ఎకరాల మిగులు భూమి ఉందని ప్రతిపాదించాయి.

ఈ భూసంస్కరణ చర్చల్లో రామకృష్ణతో పాటు జనశక్తి రియాజ్ కూడ జనశక్తి పోరాట అనుభవం నుంచి చాలా ప్రతిపాదనలు చేసాడు. ఈ ప్రతిపాదనలు చేస్తూనే తమ మాటే చివరిమాట కావాలని కోరుకోవడం లేదని దీనిపై ఒక కమిషన్ వేయమని కెఆర్. వేణుగోపాల్ నాయకత్వంలో ఆదివాసీ దళిత, సమస్యలపై పనిచేస్తున్న ముప్పై పేర్లతో ఒక జాబితా ఇచ్చారు. రెవెన్యూమంత్రి ధర్మాన ప్రసాదరావు 30శాతం రెవెన్యూ రికార్డులు లభించడం లేదని, తాము ఈ ప్రతిపాదన పరిశీలించి

రెండోదఫా చర్చలకు పిలుస్తామని అన్నారు. అప్పటికే కెఆర్ వేణుగోపాల్, జల్ జంగల్ జమీన్ లపై ఆదివాసీల అధికారం గురించి కనీసం 20 లక్షల ఎకరాలు మిగులు భూములు ఉన్నాయని, అవి భూమిలేని దళితులకు పట్టాలివ్వాలని ఎస్ఆర్ శంకరన్ గారు నాలుగు వ్యాసాలు రాసి ఉన్నారు.

చర్చలు నాలుగురోజుల్లో ముగిసాయి గానీ మంజీరా గెస్ట్ హౌస్‌లో ఆర్కెతో సహా రెండు పార్టీల నాయకులు 11 రోజులు ఉన్నారు. ఆ పదకొండు రోజులు ముఖ్యమంత్రి ప్రజాదర్బార్ నిర్వహించే లైక్ష్యా గెస్టుహౌస్‌కు ఒక్కరూ వెళ్లలేదు. స్త్రీ పురుష సమస్యలు మొదలుకొని నిరుద్యోగం, భూమి సమస్య దాకా సమాజంలో ఉన్న ప్రతి సమస్య మీద రామకృష్ణకు వినతిపత్రాలు రాసుకొని మంజీరా గెస్టుహౌస్‌కు బారులుకట్టారు. పొత్తూరు వెంకటేశ్వరరావుగారు చర్చల మధ్యవర్తి మాత్రమే కాకుండా విప్లవపార్టీల ప్రతినిధులను టీకి ఆహ్వానించి అందరికీ వైద్యపరీక్షలు నిర్వహించారు. పత్రికా సంపాదకులు, మీడియాలో పనిచేస్తున్న వారందరూ వచ్చి పలకరించారు. ఒక్కమాటలో మంజీరా గెస్ట్ హౌస్‌లో ఉండి (ఫాంహౌస్‌లో ఉన్నట్టు కాదు, సిఎమ్ క్యాంప్ ఆఫీస్ నుండి కాదు) చెన్నారెడ్డి మానవ వనరుల భవనానికి వెళ్లి ఆర్కె విప్లవకారులు అడవిలో ఉండే కాదు, మహానగరం నుంచి కూడా కర్తవ్య నిర్వహణ చేయగలరని చూపించారు. పారదర్శక పాలనకు సంబంధించి కూడా వాళ్లదగ్గర ఒక బ్లూ ప్రింట్ ఉన్నదని ఎందరో మేధావులు భావించారు. చర్చల సరళిపై ప్రజాస్వామ్యవాదులు సంతృప్తి ప్రకటించారు. ఇదంతా విప్లవపార్టీల ప్రతినిధివర్గ నాయకుడు రామకృష్ణ నిర్వహించిన దౌత్యానికి ఒక గుర్తింపుగా ఇప్పటికీ నిలిచిపోతుంది. అయితే ఈ దౌత్యమైనా ఈ చర్చలైనా ఆయన ప్రజాయుద్ధ ఆచరణలో భాగంగా చూసాడు. విప్లవోద్యమంలోని యుద్ధం - విరామంలో భాగంగా చూసాడు. ఆయనకి ఈ జ్ఞానం అంతా విప్లవోద్యమ నిర్మాణ ఆచరణ నుంచి వచ్చింది.

ఆదర్శం, నిజాయితీ, విలువలు ఉపాధ్యాయుడుగా ఆచరించిన తండ్రి, ఆయనతో సమఉజ్జీగా సమాజసేవలో పాల్గొన్న తల్లి నుంచి అబ్బినవి అయినప్పటికీ తాను కూడా ఒక ఉపాధ్యాయుడుగా ఒక సంవత్సరం పనిచేసేనాటికే ఆయన విప్లవాచరణలో భాగం అయ్యాడు. ఆయన గుంటూరు జిల్లాలో డిగ్రీ చదువుతున్న రోజుల్లో ఏర్పడిన రాడికల్ విద్యార్థిసంఘం, ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత గుంటూరులో ఏర్పడిన రాడికల్ యువజనసంఘంతో కలిసి 1978లో ఇచ్చిన "గ్రామాలకు తరలండి" పిలుపుతో ప్రజలనుండి నేర్చుకునే ఆయన విప్లవాచరణ ప్రారంభం అయ్యింది. 1978-85 కాలంలో విశాల విస్తృత ఆచరణగా ఈ కార్యక్రమంలోనే ఆయన 1982లో పీపుల్స్‌వార్ పార్టీ సభ్యుడయ్యాడు. ఇంక అక్కడి నుంచి గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో మొత్తంగా నల్లమల విప్లవోద్యమ నిర్మాణంలో ఆయన విప్లవోద్యమ నిర్మాతల్లో చిరస్మరణీయంగా నిలిచి ఉంటాడు. ఈ క్రమమంతా ఆయన 'గ్రామాలకు తరలండి' పిలుపులో చెప్పిన నిరుపేద దళితుల ఇళ్లల్లో ఉండి వాళ్లతో తిని వాళ్ల కష్టసుఖాలు తెలుసుకొని వాళ్ల జీవితాలు పంచుకోవడంతో మొదలై అది తన సహచర్యాన్ని ఎంచుకునే వ్యక్తిగత నిర్ణయం దాకా ఒక సంస్కృతిగా రూపొందింది.

చర్చలకు వచ్చేటపుడు నల్లమల శ్రీశైలం దిగువ చినఆరుట్ల నుండి గుత్తికొండబిలం మీదుగా గుంటూరు జిల్లాలో ఆయన చేసిన ప్రయాణం అంతా దారిపొడుగునా ప్రతీపల్లెలో ముఖ్యంగా దళితవాడల్లో వేలాదిగా తరలివచ్చిన ప్రజలను చూస్తే వాళ్ల హృదయాల్లో ఆయన ఎంతగా గూడుకట్టుకొని ఉన్నాడో అర్థం అయింది. చర్చల కాలానికే ఆయన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటీ కార్యదర్శి అయ్యాడు. కేంద్రకమిటీ సభ్యుడయ్యాడు. ప్రభుత్వం ఎన్‌కౌంటర్ల ద్వారా చర్చలను విఫలం చేయడం జనవరిన ప్రారంభించడంతోనే కాల్పుల విరమణ ఒప్పందాన్ని ఉల్లంఘించడంతోనే చర్చల నుండి వైదొలగి చేవట్టిన ప్రతిఘటనోద్యమానికి కూడా ఆయన నాయకత్వం వహించాడు. ప్రభుత్వం నల్లమలను రక్తసిక్తం చేసింది. విప్లవోద్యమం మిగిలిన నల్లమల నాయకత్వాన్ని, శ్రేణులను వేరే ప్రాంతాలకు తరలించి ఆర్కెను - ఏఓబి విప్లవోద్యమానికి నాయకత్వం వహించడానికి పంపించింది. ఏఓబి విప్లవోద్యమ నిర్మాణంలో రిక్రూట్‌మెంట్ల ద్వారానూ, విప్లవ ప్రచారం ద్వారానూ ఉన్నతదశకు తీసుకుపోవడం వరకే కాకుండా ప్రజారాజ్యపాలన ఎటువంటి పారదర్శక ప్రత్యామ్నాయం ఇస్తుందో ఆయన మార్గదర్శకత్వం చేసి చూపింది. అందుకే అమరుడయ్యేదాకా కూడ ఆయన ఛత్తీస్‌ఘడ్‌లో ఉన్నప్పటికీ కూడా కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడుగా ఏఓబి విప్లవోద్యమానికి నాయకత్వం వహిస్తున్నాడు. రెండు రాష్ట్రాలుగా ఏర్పడిన తెలుగునేలలో ఇవ్వాళ ఏఓబిలో భాగమైన ఉత్తరాంధ్రలో మాత్రమే విప్లవ నిర్మాణం, పోరాటం మిగిలి ఉండడం ఆయన నాయకత్వ పరిణతికి దాఖలాలు. ఆయన గెరిల్లా యుద్ధతంత్రానికి బలిమెల దాడి ఒక ఉదాహరణ. రామగూడ ఎన్‌కౌంటర్‌లో దళనాయకుడైన తన కొడుకు మున్నాను కోల్పోవడమే కాకుండా బుల్లెట్ గాయానికి గురయ్యాడు. ఆయనెప్పుడో యవ్వనంలోనే కిడ్నీ వ్యాధికి చేయించుకున్న చికిత్స తర్వాత ఇంతకాలానికి మళ్లీ కిడ్నీల క్రియ విఫలమై ఆయన విప్లవం కన్నతల్లి ఒడిలోనే కన్నుమూసాడు. అదే ఆయన జీవన సాఫల్యం.



(22వ పేజీ తర్వాత)

ప్రతి విషయాన్ని కూలంకషంగా తెలుసుకుని కచ్చితమైన అంచనాకు వచ్చేవారు. అయితే సదరు అంచనాను చెప్పాల్సినవారి వద్ద మాత్రమే చెప్పేవారు. సర్కారు జిల్లాల్లో తిరుగుతూ పార్టీ పనులు చేస్తున్న సీనియర్ నేత బాగోగులు అడిగారు. జాగ్రత్తలు పాటిస్తున్నాడా అంటూ ప్రత్యేకంగా అడిగారు.

నేను గమనించిన రెండు మూడు అనుమానాస్పద ఘటనల గురించి చెప్పాను. జాగ్రత్తలు అంతగా పాటించడం లేదన్నాను. 'ఈ ప్రకారమే అయితే... ఆయన ఈ పాటికి వారి వలలో ఉండే ఉంటాడు. దుర్వార్త వినాల్సి వచ్చినా ఆశ్చర్యం లేదు' అన్నారు. అనుకున్నట్టుగానే.. ఛత్తీస్‌ఘడ్‌లోకి వెళ్లిన తర్వాత ఉత్తర తెలంగాణ మిత్రులు తెచ్చిన తెలుగు పత్రికలో ఎన్‌కౌంటర్ వార్త కనిపించింది. ఇద్దరినీ పార్వతీపురం వద్దగల బందుగాం అడవుల్లో కాల్చేశారు. ఎస్వీ నిట్టూర్చారు.

అజ్ఞాత జీవితం నావల్ల కాదని చేతులెత్తేసిన తర్వాత ఎస్వీ ఏమీ అనలేదు. వెళ్లి కుదురుకోవడానికి ఎంతైతే సరిపోతుందీ అని అడిగారు. కొంత నగదు నా చేతిలో పెట్టి, జాగ్రత్త చెప్పి అక్కడి నుంచి వెళ్లిపోయారు తప్ప నన్ను కసురుకోలేదు. నా ప్రయాణం గురించి తగు సూచనలు చేసి... ఒక సీనియర్‌కు నన్ను అప్పగించి ఒడిశా వెళ్లిపోయారు ఎస్వీ.

నిర్బంధాలూ... ఒత్తిడులూ... అనారోగ్యం, వయసూ.... ఎదురు కాల్పులూ.... అన్నీ వేధిస్తుంటే.... తపస్విలా బతికి... అడవిమట్టిలో కలిసిపోయాడు ఎస్వీ....



# తపస్వ్యం ఎస్వ్యం

నీలి కురింజి

పద్దెనమిదేళ్ల క్రితం నాటి మాట. మండువేసవి. ఒక అర్ధరాత్రి బీ.కే.తిర్మలాపూర్ పరిసరాల్లోని బొప్పులు – సహజసిద్ధంగా ఏర్పడిన రాతి స్తంబాల మధ్య దారితెలియక చిక్కుకుని... తిరిగీ.. తిరిగీ.. తెల్లవారి మకాం చేరాం. ఉదయపు ఎండ బట్టతలపై పడి మెరుస్తోంది. నేను అంతకుముందు రోజు కొన్న హిందూ పేపర్ ముందేసుకుని చూస్తున్నాడాయన. ఆయనెవరో అప్పటికి నాకు తెలియదు.

కొనపూరి అయిలయ్యను అడిగాను... ఎవరీయన అని. గుర్తు పట్టలేదా.. అన్నాడు. లేదన్నట్టు తలూపాను. 2002 చర్చల కాలంలో పత్రికల్లో కనిపించిన ఫొటోల్లో.. హాలీవుడ్ సినిమా హీరోలా ఆలివ్ గ్రీన్ డ్రెస్, నెత్తిన టోపీ, కలష్నికోవ్, ఛాతిచుట్టూ ఏకే బుల్లెట్ మేగజైన్లతో కనిపించిన ఆర్కే... టీ షర్ట్ వేసుకుని నెత్తిన టోపీలేకుండా బట్టబుర్రతో కనిపించేసరికి గుర్తించలేదు. నాకు ఆయన పరిచయం అయింది 'ఎస్వీ' అనే మారు పేరుతో. చనువుగల కార్యకర్తలు 'శ్రీనివాసూ' అనే వారు. 2003 మే మాసం మొదలు 2008 డిసెంబర్ వరకూ ఆయనతో ప్రత్యక్ష, పరోక్ష బంధం కొనసాగింది. ఆ తర్వాత అవి తెగిపోయాయి.

ఆయనతో కొద్దికాలమే అయినా అతి దగ్గరగా చూడటం, గతం తాలూకు విషయాలు తెలుసుకోవడం, కొన్ని వ్యక్తిగత విషయాలను పంచుకోవడం వల్ల ఆయన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేశాను. ఆయన్ను కలిసిన తొలిరోజుల్లోనే ఒక ఘటన జరిగింది. ఇద్దరు మహిళా కార్యకర్తల మధ్య పని పంపకాల్లో స్పర్ధలు వచ్చాయి. అవి తరచూ బయటకు వ్యక్తమవుతున్నాయి.

కొద్ది రోజులుగా వీటన్నింటినీ గమనిస్తూ వస్తున్నారు ఎస్వీ. ఒక మహిళా కార్యకర్తను పిలిచీ... 'ఆమెకు అబార్షన్లు కావడం, అతిగా బ్లీడింగ్ కావడం వల్ల ఆమె పనిచేయలేకపోతోంది. బద్ధకం వల్ల కాదు. పైగా చంటిబిడ్డను వదిలి సహచరుడితో కలిసి వచ్చింది. అవన్నీ మానసిక, శారీరక ఇబ్బందికి గురిచేస్తాయి. అటవీ జీవితంలో... అననుకూలతల మధ్య ఉన్న మనం ఒకరినొకరం అర్థం చేసుకోవాలి' అని నచ్చజెప్పారు. ఏ విషయంలో అయినా సరే... సావధానంగా పరిశీలించి, మనుషులను బట్టి వారికి అర్థమయ్యే పద్ధతిలో విషయాన్ని అర్థం చేయించేవారు ఎస్వీ. ఆవేశకావేశాలకు గురైన సందర్భాలు చాలా అరుదు.

చిన్ననాటి రోజుల్లో తండ్రి ప్రభావం కారణంగా పులుపుల వేంకట శివయ్య రాసిన 'పలనాడు వెలలేని మాగాణిరా' బాలడ్ నేర్చుకున్న దాఖలా గురించి చెప్పారు. మా ఇద్దరి సంభాషణ మధ్య ఏడెనిమిది చరణాలు పాడారు కూడా. "తొలిసంజ దీక్షతో తెలుగు శిల్పుల చేతి/ పోగరలు మలచిన/ బుద్ధయుగ జీవితము/ నవశిల్ప రతనంబు రా, పలనాట/ నాగార్జునుడి కొండరా!" ప్రస్తుతానికి గుర్తున్న పంక్తులు. వ్యక్తిగత విషయాల ప్రస్తావనను ఎస్వీ పెద్దగా ఇష్టపడేవారు కాదు. రహస్యంగా ఉంచాలన్న ఉద్దేశంతో కాదు. వాటికి అంతగా ప్రాధాన్యత లేదనే భావన ఆయన మాటలో ధ్వనించేది.

ఒడిశా గహనాటవుల చీకటి రాత్రుళ్లలో మానసికంగా కుంగిపోయి... ఉండలేని స్థితి వచ్చినపుడు.... ఒక రోజు చీకటి ముసురుకుంటోంది. మల్కన్‌గిరి నుంచి చత్తీస్‌ఘడ్‌లోని దర్భా డివిజన్ వైపు ప్రయాణం కొనసాగుతోంది. మజిలీలో.. చెట్టుకింద కూర్చుని రాసుకుంటున్న ఎస్వీ వద్దకు వెళ్లి అడిగాను. రాత్రి కాగానే డిప్రెషన్‌గా ఉంటోందన్నాను. తాను పలనాడు గ్రామాల్లో తిరుగుతున్న రోజులనాటి ఒక అనుభవం చెప్పారు.

'పశువుల కొట్టాల్లోని దుర్వాసనల మధ్య, ఇరుకిరుకు ఇళ్లకు వెళ్లి ప్రజల్లో పనిచేస్తున్నపుడు.. వారు పెట్టే పశుమాంసం తినాలంటే డోకు వచ్చేది. మన సాంస్కృతిక నేపథ్యాన్ని ప్రయత్నపూర్వకంగా వదిలివేయాలి. ఆహారపు అలవాట్లను మార్చుకోవాలి. ప్రజలకోసం పనిచేయాలనే కఠినమైన నిర్ణయం తీసుకుంటే ఏ ఇబ్బంది ఉండదు.' అన్నారు. 'కష్టమైన దారిని ఎంచుకుని అందులో మనకు అనుగుణమైన స్థితిని వెతికితే కుదరదు. దారి చెప్పినట్టే నడకసాగాలి.' అన్నారు.

ఉమ్మడి ఏపీ వదిలి ఒడిశా చేరుకున్న తర్వాత కొంతకాలం ఆయనతో పాటు ఉన్నాను. అనారోగ్యం క్షీణిస్తోన్న విషయం ఆయన రోజు వారీ జీవితాన్ని చూస్తే అర్థమైంది. తూర్పు కనుమల అటవీ జీవితం సాహసులను సైతం పిరికివారిని చేస్తుంది. ఎత్తైన కొండల్లో నడక మనిషిలోని శక్తిని హరించేస్తుంది. స్నానానికి వెళ్లినపుడు అడిగాను... వీపు వెనుక నుంచి నడుముదాకా ఉన్న కోత గురించి. ఏదో సర్జరీ అయిందని దాటవేశారు తప్ప వివరం చెప్పలేదు.

నల్లమల–ఒడిశా అడవులకు మధ్య ఉద్యమ జీవితంలో వ్యత్యాసం ఏంటని అడిగాను. నల్లమలలో అయితే కేవలం ఒక రాష్ట్ర ప్రభుత్వ నిర్బంధం ఉండేది. తూర్పుకనుమల్లో ఏపీ, చత్తీస్‌ఘడ్, ఒడిశా...మూడు రాష్ట్రాల బలగాలను తప్పించుకుని తిరగాలి. దీంతో నడక సమయం పెరిగింది. సమావేశాలకోసం తరచూ దండకారణ్యం వెళ్లాల్సిరావడం కూడా ఆరోగ్యంపై ప్రభావం చూపుతోందని చూచాయిగా చెప్పారు.

దర్భా డివిజన్‌లో ఉండగా మున్నా నుంచి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం చదువుతూ... 'రోజు ఒక కట్ట బీడీలు తాగుతున్నాను' అనే వాక్యం బయటకు చదివి చిరునవ్వు నవ్వాడు. బయట ఉంటే... దురలవాట్లలోనే జీవితం ముగిసిపోతుందన్నారు. మిలటరీ విభాగంలో పనిచేస్తాననే ఆసక్తిని వెలిబుచ్చినపుడు. లేదు...మొదట 'మాస్ డివిజన్ ఆర్గనైజేషన్'లో పనిచేయాలి. ప్రజాజీవితం, ఉద్యమ అనుభవం లేకుండా తుపాకీ పట్టుకుంటే నిలబడలేమని కొడుకుకు సర్దిచెప్పినట్టూ..నాతో పంచుకున్నారు.

ఆర్కే అనే పేరు ఎందుకు వచ్చిందని అడిగాను. 90ల ప్రాంతంలో గుంటూరు జిల్లాలోని చంద్రవంక దిబ్బ వద్ద జరిగిన ఎదురు కాల్పుల్లో దళ కమాండర్ ఆర్కేతో పాటు ఆయన సహచరి స్నేహలత చనిపోయినట్టూ.. తాను ఆ దాడిలో తప్పించుకున్నట్టూ చెప్పారు. ఆ తర్వాత ఆర్కే అనే పేరు పెట్టుకున్నట్టూ చెప్పారు.

(మిగితాది 21వ పేజీలో...)

KAVITHAM కవిత్వం

# ఎక్కడికి పోతారు మనుషులు

సొదుం శ్రీకాంత్

ఎక్కడికి పోతారు మనుషులు
మహా అయితే మట్టి పొత్తిళ్లలోకి తప్ప
ఎక్కడికి పోతారు మనుషులు?

చిందే స్వేద ప్రతిబింబాలై
శ్రమ బిందువుకు సముద్రాన్ని పరిచయం చేసిన వాళ్లు
ముసురు కప్పిన మనసు ఘోషను
మేఘ తీరానికి చేర్చి
జడివాన కురవమని తడి భాష్యం నేర్పిన చిత్తరువులు
'జన'కలల్ని జన్ను తీగలపై
అలలు అలలుగా అల్లుకున్న
సనాతన సమాంతర స్వాప్నికులు
అలాంటి మనుషులు
ఎక్కడికి పోతారు వాళ్లు?

మానని గాయాలతో మన్యమంతా
పిట్టలు రోదిస్తుంటే
దిగులు గుండెల చుట్టూ దివిటీలు వెలిగించి
తీరని దాహంతో బ్రతుకు తీరమంతా
తిరుగుబాటై తిరుగాడిన తురాయి పూలు
ఏ మనో వనంలోనో ఎర్ర జాజి సుకుమాలై
విరబూస్తాయే తప్ప
ఎక్కడికి పోతాయి
ఆ సమభావన సువాసనలు?

వాళ్లేం కలగన్నారు...
నేల లోగిలంతా పచ్చని తోరణాలతో అలకాలనో...
చీకటి తలుపులు తెరచి వెలుగు తెరలై
చిరుగాలి కేరింతలై అల్లరి ఆటలై ఆడాలనో...
మట్టి అణువులు నేర్పిన నెత్తుటి పాఠాల నీతి
'ప్రతీదీ ప్రాణమై పోటెత్తి నిరంతర
సజీవ సాగర తరంగమై ప్రవహించాలనో'...
అందంగా ముస్తాబై ఊరేగుతున్న అసత్యం సమాధై
సత్యం సమీరమై స్వేచ్ఛగా తిరుగాడాలనో...

అలాంటి
ఆకాంక్షలకు కట్టుబడ్డ భూమి అక్షాంశాలు
ఎక్కడికి పోతారు వాళ్లు?

ఎక్కడికి పోతాయి
ఆ దివిసీమన పూసిన రంగు రంగుల పత్తి పూలు
అవి ఏదో ఒక భూమి బుగ్గపై
తెల తెల్లని వేకువ దూది పింజలై విచ్చుకునే ఉంటాయి

ఎక్కడికి పోతారు వాళ్లు
మళ్లీ ఏదో ఒక చెట్టు 'వేరు' పట్టుకుని
సత్యపు చేతులతో తిరిగొస్తారు
రెమ్మల చెవిలో
రాలిన కలల రహస్యం గురించి గుసగుసలాడతారు
కొమ్మలు పూసే పువ్వుల పొత్తిళ్లలో పసిపాపలా పారాడి
చివరకు పిట్టల గొంతు పాటై
మళ్లీ పోరాట చిరునామై తిరిగి చిగురిస్తారు.

# హృది నిండిన జ్ఞాపకాలు

*శిరీష*

సుదీర్ఘమైన
మన ప్రయాణంలో
ఎన్నో చెదరని జ్ఞాపకాలు
కండ్ల నిండా నింపుకున్న
నీ రూపం ఎలా మరవాలి కామ్రేడ్?!

ముప్పై ఐదు వసంతాల మన బంధం
ఘర్షణా ఐక్యతగా పెనవేసుకున్నదే కదా
నీతో గడిపిన క్షణాలు రాయాలని ఉంది
ఎలా రాయను ?
సుడులు సుడులుగా తిరుగుతున్న
నీ జ్ఞాపకాలు ఎలా మర్చిపోగలను?
ఏ పనిలో ఉన్నా
నీ ఆలోచనలే జీవనదిలా
నాలో నిరంతరం ప్రవహిస్తూనే ఉన్నవి కామ్రేడ్

నాలోని లోపాలను ఎంతో సున్నితంగా
చెప్పిన మాటలు గుర్తొస్తున్నాయ్
కర్తవ్య సాధనలో ధైర్యంగా కొనసాగాలని
నీవు కోరిన కోరిక గుర్తుంది కామ్రేడ్!

పురిటినొప్పులు పడుతున్నప్పుడు
నువ్వు నా పక్కనే ఉండి ఓదార్చిన
ఆ రోజును ఎప్పటికీ మర్చిపోలేను
ఆ రోజు వాడు కళ్లు
అటూ ఇటూ తిప్పుతూ చూస్తుంటే
నీవు అన్న మాట...
'వీడు సామాన్యుడు కాదు' అని...
ఇంకా గుర్తుంది కామ్రేడ్!
ఇప్పుడు తెలిసింది
వాడిలో ఏదో అద్భుతం ఉందని
ఏదో శక్తి ఉందని.

నీ కోసం
నెలలు... సంవత్సరాలు...
ఎదురుచూపులతో గడిపిన
రాత్రులు తలచుకొని
దుఃఖించినపుడు
నీవు రాసిన నాలుగు అక్షరాలు
నాలో స్థైర్యాన్ని నింపేవి కామ్రేడ్ !

నీవు కలిసిన రోజు
నాకు పండుగ రోజు
నువ్వు నాతో ఉండాలని
నీ ప్రేమ పొందాలని
చాలాసార్లు అన్నాను నీతో
అప్పుడు
ప్రేమగా నా తల నిమిరిన
నీ స్పర్శ జ్ఞాపకపు
తడి ఇంకా ఆరలేదు కామ్రేడ్ !

ఒక్కసారి బాబును తీసుకొని నీ దగ్గరికి వచ్చాను. మూడు రోజుల తర్వాత నీవు వెళ్లిపోతుంటే వాడు నీ కాళ్లు చుట్టుకుని నీతో వస్తానంటూ మారాం చేస్తుంటే నీ కళ్లల్లో ఆందోళన చూసాను. కరిగి పోతుందేమో నీ హృదయం అనుకున్న. కానీ నీవు మాత్రం ఆశయసాధనలో నిమగ్నమయ్యావు అని అర్థమైంది.

నీ కోసం
ఎన్నో కొండలు గుట్టలు నదులూ
రోజుల తరబడి నడిచి నడిచి
నా కాళ్లు బొబ్బలెక్కినా
నీ పాద ముద్రలు చూడగానే
అలసట ఆవిరయ్యేది
సంతోషం ఉరకలు వేసేది
చుక్కల పందిరి కింద
మనం గడిపిన రాత్రులు తలచుకుంటే
నా హృదయం భారమవుతుంది కామ్రేడ్!

నీకు ముద్దపప్పు ఆవకాయ నెయ్యి,
నీ కొడుక్కి దోసలు అంటే ఇష్టం కదా
అవి చూసినప్పుడల్లా
మీరే గుర్తొస్తున్నారు కామ్రేడ్
నీ వెనక నడుస్తూ పడినప్పుడు
చెయ్యి అందించి లేపావు...
నీ చెయ్యి అందుకోవడం కోసం
ఎన్నిసార్లు పడ్డా పర్వాలేదనుకునేదాన్ని కామ్రేడ్!

నీ కోసం
నిద్రలేని రాత్రులెన్ని గడిపానో
నాకు మాత్రమే తెలుసు

నీ ప్రేమ కోసం
ఎంత ఆరాటపడ్డానో
నీకూ తెలుసూ

నువ్వు ఆనాడు నా చేతి మునివేళ్లపై పెట్టిన
ముద్దు ఇంకా కాలుతూనే ఉంది
ఎలా మర్చిపోగలను కామ్రేడ్ !

నీ ఎదపై కన్నీళ్లతో తలపెట్టుకుంటే
'మనం ఏమంత దూరంగా ఉన్నాము
మన ఆలోచనలు ఎప్పుడూ
దగ్గరిగా ఉన్నాయ'ని కావలించుకున్న
ఆ రోజు గుర్తుంది కామ్రేడ్ !

ఒకసారి సినిమాకు వెళ్లాము
అప్పుడు నీ భుజం మీద తలవాల్చాను
వెంటనే నీవన్నమాట
'వెళ్దాము' ఇంటికి అని
'ఎందుకు?'... అమాయకంగా చూసాను
బాధపడ్డాను గొడవపడ్డాను
గుర్తుందా కామ్రేడ్ ?
తర్వాత ఆలోచించాను
మనిల్లు కాదు కదా అని
ఎన్నెన్ని జ్ఞాపకాలని..!
మనం విప్లవకారులం
సమాజం పట్ల ఎంతో బాధ్యతగా
మన ప్రవర్తన ఉండాలని చెప్పిన
ఆ మాటలు గుర్తున్నవి కామ్రేడ్ !

ఉదయం లేవగానే
టీవీ వార్తలు చూడాలంటే
భయపడేదాన్ని
అదే విషయం నీతో పంచుకున్నప్పుడు
చిరునవ్వుతో నా భుజం తట్టి
'మనం విప్లవకారులం
అమరుల త్యాగాలను తలచుకోవాలి
మన జీవితాన్ని ప్రజల కోసం
అంకితం చేసేలా మలచుకోవాలి'
అన్నమాటలు ఇంకా గుర్తున్నాయి కామ్రేడ్!
మున్నా అమరత్వం నన్నెంతో కలవరపెట్టింది
వాడింక లేడన్న బాధను భరించలేకపోతుంటే
'మున్నాకి తల్లిగా ఆలోచించినంత కాలం
బాధను భరించాల్సి వస్తుంది
అనేక మంది పిల్లలకు తల్లిని అనుకుంటే
బాధను అధిగమించవచ్చు'
అన్న నీ మాటలు ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి కామ్రేడ్!

నీ కళ్ల ముందు

సహచరులు ఒరిగి పోతుంటే
ఉబికి వస్తున్న కన్నీళ్లను ఒత్తుకుంటూ
పోరాడే నీ పటిమను ఎలా మర్చిపోగలను కామ్రేడ్!

దేశంలో నెలకొన్న పరిస్థితులు
విప్లవకారులమైన మనపై మరింత
బాధ్యతను మోపుతున్నాయని చెప్పిన మాటలు
ఎలా మరువగలను కామ్రేడ్ !

ఒక్కసారిగా మెరిసే చుక్కల్లో
మీ సజీవ రూపాలు కన్పించాయి
ఆతృతతో 'మున్నా! మున్నా!
ఆర్కే! ఆర్కే! బతికే ఉన్నారా!' అంటూ పిలుస్తున్నాను
కానీ, దూరంగా వెళ్తూ
వెనక్కి తిరిగి చూస్తూ
'నువ్వు మాట తప్పావు
ఏడుస్తున్నావు, ఏడుస్తున్నావు' అంటూ వెళ్తున్నావు
వెంటనే కళ్లు తెరిచాను
కల చెదిరింది
కన్నీళ్లింకిన కళ్లతో
మీ రూపాలను గుండెలకు హత్తుకుంటూ....
మీ అడుగుల్లో అడుగేస్తాను కామ్రేడ్ !!

# దుఃఖిత మేఘం

విరించి

అప్పుడే పూసిన పువ్వు దిగులు పరిమళాన్ని వెదజల్లుతూ
పలకరించింది
ఉదయపు గాలి దిగులుగా తాకుతూ వెళ్లింది
ప్రాతః మేఘం దుఃఖితగా కదులుతూ సాగింది
వేగుచుక్క ప్రకాశించలేక వెలాతలా పోతూంది
మంచుతెర తలదించుకుని నిశ్శబ్దంగా తొలగిపోయింది
సీతకోకలూ, తుమ్మెదలూ పక్షుల దిగులు రాగాలను
స్వాగతించలేనట్లు మొహం తిప్పుకున్నాయి
పొద్దు పొడవనా, వద్దా అనుకుంటూ అక్కడే తచ్చట్లాడుతూంది
మెరుపు లేని వురుమని మేఘం పిడుగులా నా దరి చేరింది
ఎదురు చూపులతో కాలగమనాన్ని కొలుస్తున్న నాకు
నిరామయ కాలం గమనాన్ని ఆపింది
నీ కోసం, నా కోసం పోరాడుతున్న ఒక చెట్టు నెమ్మదిగా
నేలకొరిగింది
స్వప్నాల దిశలో కొత్త లోకాన్ని కనుగొన్న నాకల చెదిరి
పోయింది



(36వ పేజీ తర్వాత)

చూస్తున్నావు కదా ప్రతీచోట ట్రాన్స్‌పోర్ట్ భలే కష్టమైపోయింది. వీలైనంత మంది వీలైన పద్ధతుల్లో శ్వాసని నిలపడానికి ప్రయత్నం చేస్తూనే వున్నారు. సెలబ్రెటీస్ కూడా ప్లాంట్స్ పెడుతున్నారు. అయినా మారుమూల పల్లెల్లో ప్రాణాల్ని నిలపటం కష్టమవుతుంది అనుకొంటూ నిట్టూర్చాడు శ్రీధర్.

"అంబులెన్స్ దొరకటం కల కానీ ట్రాక్టర్లో పట్టుకెళ్ళదామా" శివయ్యతో అన్నాడు ల్యాబ్ అసిస్టెంట్.

నారాయణ రెడ్డికి శివయ్య ఫోన్ చేసి వరమ్మ పరిస్థితిని చెప్పాడు.

"ఆసుపత్రికి వెళ్ళే వరకూ ఆ ఆక్సిజన్‌న్ని వరమ్మ పీలుస్తుందంటావా?! సరే వెళ్ళండి. జాగ్రత్త. కరోనా పేషెంట్. నువ్వు జాగ్రత్త" అన్నాడు నారాయణ రెడ్డి.

కాసేపటికి శివయ్య ఫోన్ నారాయణ రెడ్డికి ఫోన్ చేసి "వరమ్మ వూపిరి ఆగిపోయింది" అని చెప్పాడు.

నారాయణ రెడ్డి వెంకట్‌కి ఫోన్ చేస్తే నో రిప్లై.

మళ్ళీ మళ్ళీ ఫోన్ చేసాడు నారాయణ రెడ్డి. కాసేపటికి వెంకట్ తిరిగి ఫోన్ చేసాడు.

వరమ్మ విషయం చెప్పి "కరోనా డెడ్‌బాడీ కాబట్టి వూళ్లో పంచాయతీ. సిబ్బంది అంత్యక్రియలు చేసేస్తారు" నారాయణ రెడ్డి చెప్పారు.

దాంతో వెంకట్‌కి తండ్రిని చివరి చూపు చూడలేక పోవటం గుర్తొచ్చింది. యేడుపు తన్నుకొచ్చింది.

తలుపులు తీసుకొని బయటకొచ్చాడు. యెదురుగా ప్లేకార్డ్ We want Breath.

* * *

fb రోజులు చూసించిన మెమరీతో అప్పటి విషయాలన్నీ గుర్తు వచ్చి చెమర్చిన కళ్లని టిష్యూ పేపర్‌తో ఒత్తుకుంటూ తను నిలబడిన కాలానికి వచ్చిన వెంకట్ రోజులు యెంతలా పరుగులు తీస్తున్నాయో కదా.. fb గుర్తు చెయ్యక పోతే కొన్ని గుర్తొచ్చే పరిస్థితీ లేదు. తన అనుభవాల నుంచి తనేం నేర్చుకున్నాడు?!

అస్సలు పరిచయం లేని వర్చ్యువల్ మీడియాలో మాత్రమే తెలిసిన విశాల్.. శ్రీధర్.. చిత్రలేఖ.. గోపాలం ఆక్సిజన్ అందించటానికి దివారాత్రులూ అల్లాడిపోతూ పనిచేసారు. ఆ ట్రాక్టర్ డ్రైవర్ ప్రాణాలకి తెగించి అమ్మ పక్కన నిలబడ్డాడు. వృత్తి ధర్మంగా యెందరో పనిచేస్తున్నారు.. వృత్తి ధర్మమేనా?! యెంతటి ప్రేమ మనుష్యులకి సాటి మనుష్యుల మీద. మరి తనేమిటి?! తనేం చేస్తున్నాడు?!

తల్లితండ్రులని పిల్లలకి పిల్లలు తల్లితండ్రులకి కూడా దన్నుగా, భరోసాగా వుంచనివ్వని వలసల అభివృద్ధి యెందుకు?!. వర్చ్యువల్‌గా తను అక్కడ నుంచి ఆక్సిజన్ కోసం అడిగాడు.. కానీ ఆ ఆక్సిజన్ అందించటానికి నిజజీవితంలో తన అమ్మ ప్రాణాల్ని నిలపడానికి తమ ప్రాణాల్ని పణంగా పెట్టి నిలబడ్డారు. కన్నపిల్లలం యేమి చేస్తున్నాం?! అత్యంత యిష్టమైన తల్లితండ్రిని అవసరమైన సమయంలో చేరుకోలేని భౌతిక దూరం వెంకట్ ని గుచ్చుకుంటుంటే అతనికి వూపిరి అందనట్టు హృదయమంతా వుక్కిరిబిక్కిరిగా వుంటుంటే ఆ వేదనని తట్టుకోలేక అతనో నిర్ణయానికి వచ్చాడు తన వూరు వెళ్ళిపోదామని. అక్కడ అమ్మానాన్నా లేకపోయినా వాళ్ళ అడుగులున్నాయి, తన వాళ్ళు వున్నారు. తనూరుంది.

లతకి యెప్పుడెప్పుడు వెళ్ళిపోదామనే వుందేమో వెంటనే తన ఆమోదాన్ని చెప్పింది. పిల్లలకి యేమంత యిష్టంగా లేదా ఆలోచన. "మీరు మేజర్స్ అయ్యాక మీ గురించి మీరు మీ మీ నిర్ణయాలని తీసుకోండి" అని వెంకట్ లత పిల్లలతో ఇండియాకి వచ్చేసాడు.

వెంకట్ ఆ Fb మెమరీని చూస్తుంటే కళ్ళ నిండుగా నీళ్ళు.. అమ్మ పోయిన చేదు జ్ఞాపకాన్ని షేర్ చేస్తూ "మనిషిని మించిన ఆక్సిజన్ లేదు. యెప్పటికైనా మనిషి స్పర్శే ప్రాణవాయువు. అమ్మా నాన్న నన్ను క్షమించండి!!'





# లైంగిక వైవిధ్యాలను అర్థం చేసుకుందాం

బిట్టు కెఆర్

పితృస్వామిక సమాజం స్త్రీలపై అమలుచేసే హింస, అణచివేతల గురించి మనం ఎప్పటి నుండో మాట్లాడుకుంటున్నాం. వ్యక్తిగత ఆస్తి కేంద్రంగా నడిచే కుటుంబ వ్యవస్థ స్త్రీ లైంగిక స్వేచ్ఛను పూర్తిగా హరించి పురుషుడి కోరికలకు తగినట్లు విధివిధానాలను రూపొందించింది. భారతదేశంలో కులవ్యవస్థ అటు ఆస్తిని, ఇటు కులాన్ని పరిరక్షిస్తూ యువతీయువకుల సహజమైన ప్రేమ, ఆకర్షణలను నేరంగా పరిగణిస్తున్నది. ఇటువంటి సమాజంలో ట్రాన్స్‌జెండర్ అస్తిత్వానికి అసలు గుర్తింపే లేదు. గుర్తించినా అది ఛీత్కారానికి, వెలివేతకు గురవుతున్నది. భిన్న సమూహాలు తమ ప్రజాస్వామిక హక్కుల కోసం, ఆత్మగౌరవం కోసం గొంతెత్తుతున్న సందర్భంలో ఇటీవల ట్రాన్స్‌జెండర్ సమూహం తమ ఆత్మగౌరవ పతాకను ఎగరేస్తున్నది. ఇప్పుడు సమాజంలోకి వచ్చిన లైంగిక అస్తిత్వాలు ఎన్ని అంటే వానవిల్లులో ఉన్న రంగులన్ని. ఈ వైవిధ్యాలను లోతుగా అర్థం చేసుకోవడం మన బాధ్యత. ఇవాల లెస్బియన్, గే, బైసెక్సువల్, ట్రాన్స్‌జెండర్, క్వీర్ (ఎల్‌జిబిటిక్యూ) సమూహాలు ఒక్కటిగా రెయిన్‌బో జెండాను ధరించి ప్రైడ్ మార్చ్ చేస్తూ రోడ్డు మీదికొస్తున్నారు. వారి ఆత్మగౌరవ పోరాటాన్ని అర్థం చేసుకుందాం, ఆహ్వానిద్దాం. అరుణతారలో ఈ సంచిక నుండి ప్రారంభమవుతున్న రెయిన్‌బో శీర్షిక అందుకోసమే. ఈ అంశం మీద బిట్టు కెఆర్ అందించబోయే విశ్లేషణపై లోతైన విస్తృతమైన చర్చను ఆహ్వానిస్తున్నాం.

-సంపాదకవర్గం

మీరందరూ హిజ్రా సమూహం వారిని చూసి ఉంటారు. కలిసి కూడా ఉంటారు. అయితే లెస్బియన్, గే, బైసెక్సువల్, ట్రాన్స్‌జెండర్, క్వీర్ (ఎల్‌జిబిటిక్యూ) వంటి పదాలను ఎప్పటి నుండి వింటున్నారు? ఇవి ఇప్పుడిప్పుడే మన భారతీయ సమాజంలోకి ప్రవేశిస్తున్న పాశ్చాత్య భావాలుగా చాలా మంది అనుకుంటుంటారు.

ఈ శీర్షిక కింద నేను గ్లోబల్ ఎల్‌జిబిటిక్యూ కమ్యూనిటీతో హిజ్రా కమ్యూనిటీ వంటి మన స్థానిక సాంస్కృతిక నిర్మాణాల మధ్య సంబంధాలను, రాజకీయ వ్యత్యాసాలను వివరించడానికి ప్రయత్నిస్తాను. ప్రత్యామ్నాయ జెండర్లను వివరించడానికి స్థానిక భాషలలో మనం ఉపయోగించే కొన్ని పదాలు ఇంగ్లీష్ పదాలలో కొన్నింటికి సమానమైన అర్థాన్ని కలిగి ఉంటాయి. అయితే రెండిటికి రాజకీయ వ్యత్యాసం ఉంది. స్థానిక భారతీయ సంస్కృతులు ప్రపంచాన్ని లైంగికత (సెక్సువాలిటీ) వైపు నుండి కాక, లింగం (జెండర్) వైపు నుండి చూస్తాయి. దీన్ని మరింతగా తరువాత వివరిస్తాను. కానీ జీవసంబంధమైన లింగానికి (శరీరం), సామాజిక పాత్ర పరంగా లింగానికి, మరియు లైంగికతకు (సెక్సువాలిటీ- ఒక వ్యక్తి ఆకర్షణను అనుభవించగల లైంగాకత) మధ్య వ్యత్యాసం ఉంది.

ముందుగా మన సమాజంలోని హిజ్రా సమూహాన్ని అర్థం చేసుకుందాం. సాధారణ అభిప్రాయంలో, హిజ్రాలను కొన్నిసార్లు మూడవ లింగంగా (థర్డ్ జెండర్) పరిగణిస్తారు. పుట్టిన శిశువును ఆడ లేదా మగ అని వారి రూపాన్ని బట్టి వైద్యులు నిర్ధారిస్తారు. మామూలుగా ఉండే దురభిప్రాయం ఏమిటంటే, హిజ్రాలందరికీ పుట్టినప్పుడు వైద్యులు నిర్దేశించే మగ లేదా ఆడ శరీరానికి భిన్నంగా కనిపించే శరీరాలు ఉంటాయని. దీనికి ఇంటర్ సెక్స్ అనే ఆంగ్ల పదం ఉంది. ఇంటర్‌సెక్స్ వైవిధ్యాలు ఉన్న వ్యక్తులు ఆడ, మగ శరీరాల వర్గీకరణకు సంబంధించిన వైద్య నిబంధనలకు సరిపోని శరీరాలను కలిగి ఉంటారు. అయితే, చాలా మంది హిజ్రాలు ఇంటర్ సెక్స్ కాదు. అంటే పుట్టినప్పుడు వారి శరీరాలను పరీక్షించే వైద్యులు, శిశువును మగబిడ్డగా ప్రకటిస్తారు. పుట్టినప్పుడు వారి శరీరాలు మగ లేదా

ఇంటర్‌సెక్స్‌గా వర్గీకరించబడినా, హిజ్రాలందరూ వారి జీవితంలో ఒక పరిణామక్రమం గుండా ప్రయాణించి ఉంటారు. ప్రపంచవ్యాప్తంగా ట్రాన్స్‌జెండర్ మహిళలు పంచుకునే అనుభవాలే అవి.

ట్రాన్స్‌జెండర్ మహిళ అంటే ఎవరు? ట్రాన్స్‌జెండర్ వ్యక్తులు పుట్టినప్పుడు వైద్యుల ద్వారా, సమాజం ద్వారా వారికి ఇవ్వబడిన లింగంతో బలమైన శారీరక, సామాజిక అసౌకర్యాన్ని కలిగి ఉంటారు. తమ శరీరాలను పుట్టుకతో మగ లేదా ఇంటర్‌సెక్స్ శరీరాలుగా వర్గీకరించినప్పటికీ, తమను తాము స్త్రీలుగా గుర్తించుకునేవారే ట్రాన్స్‌జెండర్ మహిళలు. హిజ్రాలు కొంతమంది ట్రాన్స్‌జెండర్ మహిళలుగా గుర్తించబడతారు, లేదా మహిళలుగా గుర్తించబడతారు. మరికొందరు థర్డ్ జెండర్‌గా గుర్తించబడతారు. వివిధ స్థానిక భాషల్లో వారిని గుర్తించే పదాలున్నాయి: కర్ణాటకలో మంగళముఖి, తమిళంలో తిరునంగై లేదా అరవాణి, హిందీలో కిన్నార్.

హిజ్రా సమూహం అనేది ట్రాన్స్‌జెండర్, ఇంటర్‌సెక్స్ సమూహాల సభ్యులు అధికారికంగా కలిసి జీవించే, పరస్పర సహకార వ్యవస్థలోకి ప్రవేశించే సాంస్కృతిక సమ్మేళనం. వారు తమకు నచ్చిన జెండర్‌లో ఉంటారు. తమ శరీరాలను మార్చుకుంటారు. వారికి నచ్చిన జెండర్ గుర్తింపుకు అనుగుణంగా ఉండేలా శస్త్రచికిత్స చేయించుకుంటారు. వారు తమ సొంత కుటుంబాల నుండి, సమాజం నుండి తీవ్రమైన వెలివేతను, హింసను ఎదుర్కొంటారు. నివాసం, ఆరోగ్య సంరక్షణ పొందడంలో తీవ్రమైన వివక్షకు లోనవుతారు. విద్య నుండి, అన్ని రకాల పనుల నుండి బహిష్కరించబడతారు. తద్వారా వారు తమ జీవనోపాధి కోసం ఆర్గనైజ్ చేసుకున్న భిక్షాటన, సెక్స్ వర్క్‌లపై మాత్రమే ఆధారపడవలసి వస్తుంది. అయితే చాలా మంది ట్రాన్స్‌జెండర్ మహిళలు, ఇంటర్‌సెక్స్ వ్యక్తులు హిజ్రా వ్యవస్థ లోపల నివసించరు.

కొంతమంది వ్యక్తులకు పుట్టుకతో పురుష లింగాన్ని కేటాయించి ఉంటారు కానీ తర్వాత స్త్రీగా గుర్తించబడతారు. అయినప్పటికీ వారు తమ శరీరాలను మార్చుకోడానికి ఎటువంటి శస్త్రచికిత్స చేయించుకోవాలనుకోరు. వారిని భారతదేశం అంతటా "కోతీ" అని పిలుస్తారు. వారి స్త్రీలింగ గుర్తింపు వారు దుస్తులు ధరించే విధానంలో, జీవించే పద్ధతిలో ప్రతిబింబించవచ్చు. ఇలాంటి వారిని "సట్ల కోతీ" అని పిలుస్తారు. ప్యాంట్-షర్టు ధరించి స్త్రీలుగా గుర్తించబడే వారితో సహా భిన్న అస్తిత్వాలతో వారు ఉండవచ్చు. ఈ తరహా వ్యక్తులను "పంతి సట్ల కోతీ" అని పిలుస్తారు. పురుషులతో వారి సంబంధాల సందర్భంలో లేదా పురుషులతో వారి సంబంధాలను అంగీకరించడం ద్వారా కూడా వారు స్త్రీత్వాన్ని అనుభూతి చెందుతారు. కొన్నిసార్లు "గే" అనే ఆంగ్ల పదంతో గుర్తించే వ్యక్తులను కోతీలు "ఇంగ్లీష్ కోతీ" అని పిలుస్తారు. "గే" అనే పదం విదేశీ అని మనం భావించినప్పటికీ, భారతదేశంలోని కోతీ కూడా అలాంటిదే. తేడా ఏమిటంటే, కోతీ అనేది తమ స్వంత స్త్రీత్వాన్ని అంగీకరించే లింగ గుర్తింపు. పుట్టినప్పుడు కేటాయించబడిన పురుష గుర్తింపుకు భిన్నంగా వారు తమ లింగ గుర్తింపును అంగీకస్తారు. అయితే "గే" అనేది లైంగికతను (సెక్సువాలిటీని) సూచిస్తుంది. కోతీ-హిజ్రా ప్రాపంచిక దృష్టిలో, పురుషులందరూ ఎవరితోనైనా లేదా దేనితోనైనా సెక్స్ పట్ల ఆసక్తి కలిగి ఉంటారని భావిస్తారు. పురుష స్వలింగ సంపర్కుడికి పురుషుల పట్ల ఆసక్తి ఉన్న లైంగిక ధోరణి ద్వారా నిర్వచించబడిన స్థానిక పదం లేదు. ఇంగ్లీషులో హెటిరోసెక్సువాలిటీ అనే పదం పరస్పర భిన్నమైన లింగానికి చెందిన వ్యక్తులు ఆకర్షించబడే లక్షణాన్ని సూచిస్తుంది. ఉదాహరణకు పురుషులు స్త్రీల పట్ల ఆకర్షితులవుతారు. బైసెక్సువాలిటీ (ద్విలింగ సంపర్కం) అన్న పదం స్వలింగం పట్ల, అట్లాగే వ్యతిరేక లింగం పట్ల కూడా ఆకర్షితులయ్యే లక్షణానికి సంబంధించింది. ఉదాహరణకు పురుషులు పురుషులు పట్ల లేదా స్త్రీల పట్ల ఆకర్షితులవుతారు. వీటికి స్థానిక పదాలు లేవు.

లెస్బియన్ (ఇతర స్త్రీల పట్ల లైంగిక ఆసక్తి ఉన్న స్త్రీ) అనే పదం ఏ స్థానిక భారతీయ భాషలోనూ ఉన్నట్లు నాకు తెలియలేదు. మన కుల పితృస్వామ్య ఆలోచనా ధోరణిలో స్త్రీలకు లైంగిక ప్రాధాన్యతలు ఉంటాయని అంగీకరించే అవకాశం ఉండకపోవచ్చు. ఎందుకంటే కులాన్ని, ఆస్తిని సంరక్షించుకోడానికి మహిళలు కులం లోపల వివాహాలకు మాత్రమే సహకరించేలా వారి లైంగికతను నియంత్రించడం వ్యవస్థకు అవసరం.

అదేవిధంగా, ట్రన్స్‌జెండర్ పురుషుడిని (పుట్టినప్పుడు అమ్మాయి అని గుర్తింపునిస్తే, తర్వాత పురుషులుగా తమను తాము గుర్తించుకునేవాళ్లు) సూచించే పదాలు స్థానిక భాషలలో చాలా తక్కువ ఉన్నాయి. కన్నడలో, తెలుగులో ఉపయోగించే "గండబాసక" అనే పదం "శిఖండి" వలె అవమానకరమైన పదం. ట్రాన్స్‌మెన్ కోసం గౌరవప్రదమైన పదం "తిరుణంబి", ఇది తమిళనాడులో పెరియార్‌రైట్ ఆత్మగౌరవ ఉద్యమం ద్వారా సృష్టించబడింది.

"ఎల్‌జిబిటిక్యు" అనే ఆంగ్ల సంక్షిప్త పదంలో లైంగికతలోని వైవిధ్యాలు వివరించినట్లు, భారతదేశంలోని భాషలు వాటికి సమానమైన పదాలను కలిగి లేవు. ఒకే లింగానికి చెందిన వ్యక్తుల పట్ల ఆకర్షణను సూచించడానికి ఇటీవల వచ్చిన "సమలైంగిక" అనే ఒక కృత్రిమ పదం తప్ప. ఎల్‌జిబిటిక్యు (లెస్బియన్, గే, బైసెక్సువల్, ట్రాన్స్‌జెండర్, క్వీర్) కూడా ఇంగ్లీషులో ఇటీవలి పదాలే అని గుర్తించడం కూడా ముఖ్యం.

అయితే లింగ వైవిధ్యాలను వివరించడానికి భారతీయ భాషల్లో గొప్ప పద సంపద ఉంది. ఇంగ్లీషులో ట్రాన్స్‌జెండర్ అనే ఒకే పదం ఉంది. చాలా పాశ్చాత్య దేశాలలో లేని విధంగా భారతదేశంలోని హిజ్రా సమూహం ట్రాన్స్‌జెండర్, ఇంటర్‌సెక్స్ కమ్యూనిటీల చారిత్రక నాయకత్వాన్ని, దృగ్గోచరమైన అస్తిత్వాన్ని సృష్టించింది. వారి సమష్టి నిర్మాణాల గొప్ప చరిత్రకు, అపవాదాలు-హింస-వివక్షతలకు వ్యతిరేకంగా వారు చేస్తున్న రోజువారీ పోరాటాలకు మేము సెల్యూట్ చేస్తున్నాము.

## సైన్స్ ఏం చెబుతుంది?

పురుష శరీరం కలిగి ఉండటానికి పురుషునిగా ఉండటానికి తేడా ఏమైనా ఉంటుందా? చాలా మంది ఈ రెండూ ఒకటే కదా అనుకుంటారు. పురుషాంగం ఉంటే పురుషుడు. యోని కలిగి ఉంటే స్త్రీ. పురుషాంగం ఉండటానికి, పురుషునిగా ఉండటానికి తేడా ఉంటుంది. ఆ తేడాయే లైంగికతకు (సెక్స్), లింగానికి (జెండర్) మధ్య ఉండే తేడా.

లైంగికత (సెక్స్) అంటే ఏమిటి? లింగం (జెండర్) అంటే ఏమిటి? సెక్స్ అనేది జీవసంబంధమైనది. జెండర్ సామాజికమైనది – అంటే సమాజంలో ఏ జెండర్ పాత్ర నీవు నిర్వర్తిస్తావు అన్నదానికి సంబంధించినది. రెండింటికీ లంకె ఉంది. ఎలాగంటే నవజాత శిశు

వుగా నువ్వేమిటి అనేది వైద్యులు, కుటుంబం నిర్ణయించాక, దాని ఆధారంగా నీ సామాజిక పాత్ర ఆదేశించబడుతుంది. కొంతమంది ఇంటర్‌సెక్స్ (ఉభయలింగత్వం) ఉంటారన్న విషయం మీకు తెలిసుంటుంది. వారి శరీరాలను ఆడ అనిగాని, మగ అనిగాని డాక్టర్లు వర్గీకరించలేకపోతారు. నిజానికి జనాలు ఏమనుకుంటారంటే ట్రాన్స్‌జెండర్ వాళ్లందరూ ఇంటర్‌సెక్స్ అయిఉంటారని. కానీ అది నిజం కాదు. అయితే ఇంటర్‌సెక్స్, ట్రాన్స్‌జెండర్ అస్తిత్వానికి జీవసంబంధమైన మూలం కూడా ఉంటుందని సైన్స్ చెబుతుంది.

దీనిని అర్థం చేసుకోవాలంటే మొదట మనం ఆడ, మగ శరీరాలు కలిగి ఉండడానికి కారణమయ్యే జీవసంబంధమైన మూలాన్ని అర్థం చేసుకోవాలి. మానవుల్లోనూ, ఇతర జంతువుల్లోనూ ఆ మూలం క్రోమోజోముల్లో ఉండే జన్యువులలో (జీన్స్) ఉంటుంది. నిజానికి, అన్ని రకాల జంతువులలో 'ఆడ' అనేదానికి ఏకైక సార్వత్రిక నిర్వచనం ఏమిటంటే, అవి గుడ్లను ఉత్పత్తి చేస్తాయి. అవి స్పెర్మ్ (వీర్యం) కంటే పెద్ద పరిమాణంలో ఉంటాయి. మగజీవి నుండి ఒక స్పెర్మ్ కణం, ఆడజీవి నుండి ఒక అండం (గుడ్డు) కలయికతో ఒక శిశువు పుట్టుక ప్రారంభమవుతుంది. స్పెర్మ్ కణంలో 23 క్రోమోజోమ్‌ల సముదాయం ఉంటుంది. ఇందులో మన తండ్రి నుండి మనకు లభించే మొత్తం సమాచారం ఉంటుంది. మనం మన తండ్రిని పోలి ఉండడానికి కారణం ఇదే. అండం కూడా అలానే 23 క్రోమోజోమ్‌లను కలిగి ఉంటుంది. ఈ విధంగా శిశువు 23 క్రోమోజోమ్‌ల జతను పొందుతుంది. తల్లిదండ్రుల నుండి బిడ్డలు స్వీకరించే 23 జతల క్రోమోజోమ్‌లలో దాదాపు అన్నీ ఒకే విధంగా ఉన్నప్పటికీ, క్షీరదాలలో ఒకే ఒక జత భిన్నంగా ఉంటాయి. అంటే 22 జతలు ఒకేలా ఉంటాయి. 23వ జతలో మాత్రం రెండు వేర్వేరు రకాలుంటాయి. అవే జీవిలో లింగాన్ని నిర్ణయించే క్రోమోజోమ్‌ల జత 'ఎక్స్-వై'. ఒక వ్యక్తిలో రెండు 'ఎక్స్' ఆకారపు క్రోమోజోమ్‌లు ఉంటే, ఆ వ్యక్తిని స్త్రీ అని, ఒక 'ఎక్స్', ఒక 'వై' క్రోమోజోమ్ ఉంటే, ఆ వ్యక్తిని పురుషుడు అని నిర్ధారిస్తారు. క్రోమోజోములపరంగా మగ వ్యక్తి 'ఎక్స్' లేదా 'వై' క్రోమోజోమ్‌ని కలిగి ఉన్న స్పెర్మ్‌ను(వీర్యం) ఏదో ఒకదాన్ని ఉత్పత్తి చేస్తాడు. అదే స్త్రీ అయితే 'ఎక్స్' క్రోమోజోమ్ మాత్రమే ఉండే అండాన్ని ఉత్పత్తి చేస్తుంది. మగవాడి నుండి ఉత్పత్తి అయిన వై క్రోమోజోమ్ అండంతో కలిస్తే, పుట్టే బిడ్డ క్రోమోజోములపరంగా మగబిడ్డ అవుతాడు (అంటే ఎక్స్‌వై). ఒకవేళ మగవాడి ఎక్స్ క్రోమోజోమ్ అండంతో కలిస్తే వచ్చే బిడ్డ క్రోమోజోములపరంగా ఆడబిడ్డ అవుతుంది (ఎక్స్‌ఎక్స్). అంటే పుట్టేబిడ్డ ఆడా, మగా అని నిర్ధారించేది తండ్రే (అసంకల్పికంగానే అయినా). ఎప్పుడన్నా ఒక్కోసారి అండంలో గాని, వీర్యంలో గాని ఒకదానికి బదులు పొరపాటున రెండు క్రోమోజోములుంటే, పుట్టే బిడ్డకు మూడు క్రోమోజోములు వస్తాయి: ఎక్స్‌ఎక్స్‌వై లేదా ఎక్స్‌వైవై. ఇలా పుట్టే బిడ్డలను క్రోమోజోమ్లపరంగా ఇంటర్‌సెక్స్ అంటారు. పుట్టినప్పుడు ఎక్స్‌వైవై పిల్లలు డాక్టర్లకు మగపిల్లల్లాగే కనపడతారు.

క్రోమోజోమ్లపరంగా పురుషుడైన వ్యక్తి ఒక్కోసారి వీర్యం ఉత్పత్తి చేయకపోవచ్చు. అటువంటప్పుడు క్రోమోజోమ్లపరంగా వారి లింగానికి, వీర్యం లేదా అండ ఉత్పత్తిపరంగా వారి లింగానికి తేడా ఉంటుంది. ఇదెలా జరుగుతుంది? 'ఎక్స్' క్రోమోజోముకు, 'వై' క్రోమోజోముకు ఉండే ముఖ్యమైన తేడా ఏమిటంటే 'వై' క్రోమోజోములోని కొన్ని ప్రదేశాల్లో ఎదుగుతున్న బిడ్డలో వృషణాలు పెరగడానికి అవసరమైన జన్యు సమాచారం ఉంటుంది. అయితే కొంతమందిలో ఆ జన్యు సమాచారం మారిపోయి ఉంటుంది. దాని వల్ల వృషణాలు పెరగకపోవచ్చు లేదా వృషణాలు పెరగడం జరిగినా వీర్యం ఉత్పత్తి కాకపోవచ్చు. డెలివరీ చేసే డాక్టర్, పుట్టిన బిడ్డను వృషణాలు లేకుండా చూసినప్పుడు ఇంటర్‌సెక్స్ అని నిర్ధారిస్తారు. లేదా వృషణాలు మాత్రమే చూడగలిగి మగబిడ్డ అని అనుకుంటారు. రెండు సందర్భాల్లో బిడ్డ క్రోమోజోమ్లపరంగా మగవాడు, కానీ వీర్యం ఉత్పత్తిపరంగా కాదు.

ఇలాంటి వైవిధ్యాలను మరింత వివరంగా చెప్పుకోవచ్చు కానీ అసలు విషయం ఏమిటంటే బిడ్డ పుట్టినప్పుడు మనం మన సాధారణ జ్ఞానంతో, డాక్టర్ మామూలుగా చేసే పరిశీలనతో ఆడ, మగ లేదా ఇంటర్‌సెక్స్ అని అనుకుంటాము. కానీ వాస్తవానికి గర్భంలోపల జరిగే సంక్లిష్టమైన పరిణామంలో క్రోమోజోమ్లపరంగా ఆడ, మగ, ఇంటర్‌సెక్స్ వ్యత్యాసాలు (పుట్టుకతో కనిపించేవి, కనిపించనివి) మాత్రమే కాక, కడుపులో పెరుగుతున్న శిశువుకు ఆకృతినిచ్చే అనేక ఇతర అంశాలు ఉంటాయి.

అసలు అండం, వీర్యం కలయికతో ఏర్పడే ఏకకణం పరిపూర్ణమైన శిశువుగా ఎలా వృద్ధి చెందుతుంది? పాలిచ్చే జంతువులో (క్షీరదం) మొదట అది అనేక కణాలుగా విభజించబడి, తల్లి గర్భంలో అమరిపోతుంది. ఈ విభజన ఎలా జరగాలి, ఎప్పుడు జరగాలి, ఎప్పుడు నిలిచిపోవాలి, ఎలాంటి శిశువు రూపుదాలుస్తుంది అనే సమాచారం క్రోమోజోముల నుండి వస్తుంది. వాటితో పాటు కొత్త జీవపదార్థాలను తయారుచేయడానికి కణంలోని మరికొన్ని రకాల అణువులు, తల్లి గర్భం నుండి బిడ్డలోకి ప్రవేశించే హార్మోన్లు, ఇతర కారకాలు దోహదం చేస్తాయి. వీటిలో ఏదో ఒకదానిలో ఎక్కడైనా మార్పుజరిగితే పుట్టే బిడ్డ ఇంటర్‌సెక్స్‌గా ఉండొచ్చు. అది బైటికే ఇంటర్‌సెక్స్‌గా కనిపించొచ్చు లేదా శిశువులోని క్రోమోజోములకు, కనిపించే లింగానికి మధ్య అంతర్లీన వ్యత్యాసం ఉండి బైటికి ఆడగానో, మగగానో కనిపించొచ్చు. ప్రత్యేకించి ట్రాన్‌జెండర్ పిల్లలకు తల్లి గర్భంలో మెదడు అభివృద్ధి క్రోమోజోములపరంగా ఆశించేదానికంటే భిన్నమైన మార్గాల్లో జరుగుతుంది.

లైంగిక ధోరణి అభివృద్ధిని ప్రభావితం చేసే రకరకాల అంశాలు క్రోమోజోముల లోపల, క్రోమోజోముల వెలుపల ఉంటాయి. ఇంటర్‌సెక్స్ వైవిధ్యాలను పూర్తిగా అర్థం చేసుకున్న తర్వాతే మనం వాటిని బాగా అర్థం చేసుకోగలం. కాని జీవసంబంధమైన సెక్స్ గురించి ఒక్కమాటలో చెప్పాలంటే లింగం అంటే పిల్లల శరీరాలను బాహ్యంగా ఆడ లేదా మగగా చూడటం కాదు. బాహ్యరూపంగా కనిపించే లింగానికి, అందుకు మూలకారణమయ్యే క్రోమోజోములకు సంబంధించిన లింగానికి తేడా ఉండొచ్చు. అది మళ్ళీ వీర్యం ఉత్పత్తి ద్వారా నిర్వచించబడిన లింగానికి భిన్నంగా ఉంటుంది. అది కూడా హార్మోన్ల పనితీరువల్ల వ్యక్తుల్లో కనిపించే లైంగిక లక్షణాలకు (గడ్డం, రొమ్ములు పెరగడం వంటివి) భిన్నంగా ఉంటుంది. ఇట్లా జీవసంబంధమైన సెక్స్ వెనక ఉండే విభిన్న కారణాల నుండీ, గర్భంలో జరిగే సంక్లిష్టమైన అభివృద్ధి ప్రక్రియ నుండీ వ్యక్తులలో అనేక వైవిధ్యాలు ఉండటంలో ఆశ్చర్యం ఏముంది!

(ఇంకా ఉంది)



# అవినీతిపరుల కూపీలాగిన పండోరా పేపర్స్

ఎ. నర్సింహారెడ్డి

ప్రపంచవ్యాప్తంగా ప్రముఖులుగా చలామణీ అవుతున్న పన్ను ఎగవేతదారులైన సంపన్నులు, రాజకీయనాయకులు, దేశాధినేతలు తాము అవినీతి ద్వారా సంపాదించిన సొమ్మును ఏ విధంగా విదేశాల్లో రహస్యంగా దాచిపెట్టారో ఐదేళ్ళక్రితం (2016) పనామా పేపర్స్ ప్రపంచానికి తెలియచెప్పింది. ఇప్పుడు మరింత లోతైన శోధనతో అత్యంత సంక్లిష్టమైన అంశాలను సైతం ఛేదించి 117 దేశాలకు, 150 మీడియా సంస్థలకు చెందిన 600 మంది జర్నలిస్టులతో కూడిన ఇంటర్నేషనల్ కన్సార్టియమ్ ఆఫ్ ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం(ఐసిఐజె) అక్టోబరు 3న పండోరా పత్రాల పేరుతో వెలికితీసిన అనేకరెట్ల సమాచారాన్ని బహిర్గతం చేసింది. ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాలకు చెందిన రాజకీయ నేతలు, సినిమా స్టార్లు, వ్యాపారవేత్తల గుట్టును ఈ పండోరా పేపర్స్ రట్టు చేశాయి. భారత్, అమెరికా, రష్యా, పాకిస్తాన్ సహా 45 దేశాలకు చెందిన 130 మంది బిలియనీర్లు ఐసిఐజె జాబితాలో ఉన్నారు. 336 మంది రాజకీయవేత్తలు, అధికారులకు, వాణిజ్య దిగ్గజాలకు విదేశాల్లో 956 డొల్ల కంపెనీల్లో పెట్టుబడులు ఉన్నట్లు తేలింది. మారుపేర్లతో తెరిచిన బ్యాంక్ ఖాతాల సహాయంతో వీరంతా ఆస్తులను రహస్యంగా కొనుగోలు చేశారు. అక్రమార్జన చేస్తున్న వారి సంఖ్య రోజు రోజుకు పెరిగిపోతుంది.

ఒక దేశంలో చట్టపరంగా చెల్లించాల్సిన పన్నులు చెల్లించకుండా ఎగ్గొటిన వారు, బ్యాంకుల నుండి తీసుకున్న రుణాలు చెల్లించకుండా దివాళా తీసామని విదేశాలకు పారిపోయిన వారు, వాటికి అదనంగా డ్రగ్స్, మహిళల రవాణా, అక్రమంగా ఆయుధాలు అమ్మడం వంటి సంఘ విద్రోహ చర్యల ద్వారా పోగేసుకున్న అక్రమ సంపద అంతా గుప్తధనమే. ఏటా ప్రపంచవ్యాప్తంగా 600 కోట్ల బిలియన్ డాలర్ల గుప్తధనం పన్నులు చెల్లించకుండా విదేశాలకు వెళ్తుందని ఐఎంఎఫ్ ప్రకటించింది. ఇటువంటి వారంతా పన్నులు తక్కువగా ఉన్న దేశాలైన పనామా, దుబాయ్, జెర్సీ, బహమాస్, మారిషస్, హాంకాంగ్, సింగపూర్, మొనాకో, స్విట్జర్లాండ్, కేమన్ ఐల్యాండ్స్, యుకె వంటి చోట్ల గోప్యంగా ఆర్థిక లావాదేవీలను సాగిస్తున్నారు. ప్రపంచ దేశాల్లోని కుబేరులు, అత్యంత శక్తివంతమైన వ్యక్తులు పన్నులు ఎగవేసి తమ ధనాన్ని రహస్యంగా దాచిపెట్టుకోవడానికి లండన్ కీలకమైన కేంద్రంగా మారిపోయిందని 'పండోరా పత్రాలు' వెల్లడించాయి.

**పండోరా పేపర్స్ అంటే...**

తాజాగా14 గ్లోబల్ కార్పొరేట్ సర్వీసెస్ కంపెనీల నుంచి 1.19 కోట్ల ఫైల్స్ లీక్ అయ్యాయి. ప్రపంచ దేశాల్లో ప్రస్తుతం దేశాధ్యక్షులుగా, ప్రధానమంత్రులుగా, దేశాధిపతులుగా వివిధ పదవుల్లో ఉన్న 35 మంది ప్రపంచ నాయకులతో పాటు ప్రపంచ సెలబ్రిటీలు, వ్యాపార దిగ్గజాలు సహా కోటానుకోట్లకు పడగలెత్తిన 100 మంది విదేశాల్లో రహస్య యజమానులుగా చెలామణీ అవుతూ, హవాలా ధనంతో ఆస్తులను బ్రిటన్ చట్టాల ప్రకారం అధికారికంగా కొనుగోలు చేస్తున్నారు. ఈ వివరాల రహస్య పత్రాలను ఐసిఐజె బహిర్గతం చేయడం ప్రారంభించింది. ఇటీవలి కాలంలో ఇదే పెద్ద లీక్. జాబితాలో 91 దేశాలకు చెందినవారున్నారు. మనదేశానికి చెందినవారు 380 మంది ఉన్నారు. వీరిలో అత్యధికులు ఆర్థిక నేరగాళ్లు, మాజీ ఎంపీలు కావడం గమనార్హం. పన్నులు తక్కువగా ఉండి, ప్రైవసీ పరంగా గోప్యతను పాటించే దేశాల్లో డొల్ల కంపెనీలను ఏర్పాటు చేసి పన్నులు ఎగ్గొడుతున్న ఇండివిడ్యువల్స్ లేదా సంస్థలను గురించి పండోరా పేపర్స్ బయటపెట్టాయి.

కొంతమంది లీగల్‌గానే ఆఫ్‌షోర్ కంపెనీలను లేదా సంస్థలను ఏర్పాటు చేస్తున్నా, మరికొంత మంది పన్నులను ఎగ్గొట్టాలనే ఉద్దేశ్యంతోనే డొల్ల కంపెనీలను ఏర్పాటు చేశారు. ఆఫ్‌షోర్ కంపెనీల నుంచి తమ రియల్ ఐడెంటిటీని దాస్తున్నారు. క్రెడిటర్లు, ఇన్‌కమ్‌ట్యాక్స్ అధికారుల నుంచి తమ సంపదను దాచిపెడుతున్నారు. ఆరేళ్ల క్రితం పనామా పేపర్స్ 2016లో మోసాక్ ఫొన్సెకా అనే కార్పొరేటు సంస్థ 2 లక్షల 14 వేల డొల్ల కంపెనీలను ఏర్పాటు చేసి, వాటి ద్వారా ప్రపంచ గుప్తధనుల ధనం దాచిందని బహిర్గతం చేసింది. భారత్ నుండి 500 మంది పేర్లను అందులో వెల్లడించింది. 2017లో ప్యారడైజ్ పేపర్స్ డొల్ల కంపెనీలను నడిపే మూడు కార్పొరేట్ సంస్థల భాగోతాన్ని బయట పెట్టింది. అందులో 714 మంది భారత గుప్తధనుల చిట్టాను బయట పెట్టింది. ఇప్పుడు పండోరా పేపర్స్ ప్రపంచ వ్యాప్తంగా 14 అంతర్జాతీయ కార్పొరేట్ సంస్థలు 27 వేల డొల్ల కంపెనీలు, ట్రస్టుల్లో అక్రమ పెట్టుబడులు పెట్టారని వెల్లడించింది. ఇవి ఆయా దేశాలలోని

అక్రమార్కులు, పన్ను ఎగవేతదారులకు సేవలందిస్తున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా అత్యున్నత రాజకీయ నాయకులైన 336 మందికి విదేశాల్లో 956 కంపెనీలు ఉన్నాయి. వీటిలో మూడింట రెండు వంతుల కంపెనీలు బ్రిటీష్ వర్జిన్ ఐలాండ్స్‌లోనే ఉన్నాయని ఐసిఐజె బహిర్గతం చేసింది.

పండోరా పత్రాలను బట్టి ప్రపంచ వ్యాప్తంగా విదేశాల్లో దాచిన సొమ్ము మొత్తం విలువ కనీసం 5.6 ట్రిలియన్ డాలర్ల నుంచి అత్యధికంగా 32 ట్రిలియన్ డాలర్ల వరకూ ఉంటుందని ఐసిఐజె అంచనా వేసింది. పన్ను తక్కువ ఉన్న దేశాలకు తరలించే సంపద వల్ల ప్రపంచవ్యాప్తంగా ఆయా దేశాలకు ఏటా 600 బిలియన్ డాలర్ల (రూపాయల్లో 45 లక్షల కోట్లు) నష్టం వాటిల్లుతున్నట్లు అంచనా. మొత్తం 14 సోర్సుల నుంచి 64,06,119 పత్రాలు, 29,37,513 చిత్రాలు, 12,05,716 ఈమెయిల్స్, 4,67,405 స్ప్రెడ్‌షీట్లు, 8,86,923 ఇతర ఆధారాలను ఐసిఐజె బహిర్గతం చేసింది. ఈ డేటా మొత్తం 2.94 టెరాబైట్లు ఉంది. 2016లో విడుదలైన పనామా పేపర్ల డేటా 2.6 టెరాబైట్లు మాత్రమే. ఈ డేటా కూడా ఒకేఒక్క సోర్స్ నుంచి వచ్చింది. ఇక 2017లో ప్యారడైజ్ పేపర్లలో 1.4 టెరాబైట్ల డేటా బయటకు వచ్చింది. ఇది కూడా విదేశాల్లోని ఒక లా కంపెనీ నుంచి సంపాదించినదే. కానీ, ఈసారి 14 సోర్సుల నుంచి వివిధ మార్గాల్లో సమాచారాన్ని జాగ్రత్తగా సమీకరించారు. మొత్తం 27 వేల కంపెనీల్లోని 29 వేల మంది పన్ను ఎగవేతదారులను గుర్తించారు. ఈ డేటా మొత్తం 2.6 టైరాబైట్లు ఉంది. ఈ మొత్తం పనామా పేపర్లతో పోలిస్తే రెట్టింపు. ఈ సమాచారం ఇంగ్లీష్, స్పానిష్, రష్యన్, ఫ్రెంచి, అరబిక్, కొరియాన్ భాషల్లో ఉంది. భారత్ నుంచి ఆరుగురు రాజకీయ నాయకుల పేర్లు ఇందులో ఉన్నట్లు ఐసిఐజె వెబ్‌సైట్ పేర్కొంది.

ఫిన్సెన్ ఫైల్స్, ప్యారడైజ్ పేపర్స్, పనామా పేపర్స్, లక్స్‌లీక్స్ వంటి పేర్లతో గతంలో అనేక రహస్యపత్రాలు వేలకోట్ల రూపాయల కుంభకోణాలను బయట పెట్టాయి. ఇప్పుడు ఐసిఐజె మరింత భారీ సమాచారంతో కూడిన ఈ పండోరా బాక్స్ తెరిచి ప్రపంచాన్ని కుదిపేసింది. రోజులు గడిచే కొలది మరెన్ని పేర్లు బయటకు వస్తాయో, వాటి వెనుకనున్న వాస్తవాస్తవాలను భారత ప్రభుత్వం ఎలా నిగ్గుతేల్చుతుందో చూద్దాం! ఎవరు ఎంత దోచారు, దాచారు అన్నది అటుంచితే, ఎంత సంపాదించినా దాహం తీరని కుబేరులు తమ దేశానికి తిరిగి చెల్లించాల్సిన కనీస మొత్తాన్ని సైతం ఎగవేయడానికి నిస్సిగ్గుగా సిద్ధపడుతున్నారు. అందుకు వీలుగా ఒక అక్రమలావాదేవీల వ్యవస్థ ఒకటి ప్రతీరూపాయినీ అడ్డదారిలో కాపాడుకొస్తున్నది. ఈ నివేదికలో మన దేశంలో ఉన్న నల్ల కుబేరులు తక్కువేం కాదు. ఈ పరిశోధనలో పాల్గొన్న మన దేశానికి చెందిన ఇండియన్ ఎక్స్‌ప్రెస్... వారిలో 60 మంది చిట్టాను సంపాదించినట్లు పేర్కొంది. వారిలో ఆరుగురు మాజీ ఎంపీ లని వెల్లడించింది.

మనదేశం నుండి ఇండియన్ ఎక్స్‌ప్రెస్, బ్రిటన్ నుండి గార్డియన్ పత్రిక, బిబిసి సహా అంతర్జాతీయ స్థాయిలో పరిశోధనాత్మక జర్నలిజం బాధ్యతలు నిర్వర్తించేవారంతా ఒక ఉమ్మడి వ్యవస్థగా ఏర్పడి ఈ పత్రాలు బహిర్గతం చేశారు. బ్రిటన్‌లో బాహాటత్వ వాదులంతా ట్రాన్సరెన్సీ ఇంటర్నేషనల్ ప్రచార బృందం (టిఐసిజి)గా ఏర్పడ్డారు. ఈ టిఐసిజి బృందం విధాన సంచాలకుడు డంకన్ హేమ్స్ మాట్లాడుతూ, ఈ విధంగా ఐసిఐజె ద్వారా పండోరా పత్రాలు బహిర్గతం కావడం ఒక మేలుకొలుపు హెచ్చరికగా ప్రపంచ దేశాలకు దోహదం చేస్తుందని అన్నారు. ఇలా ఆస్తులు విదేశాల్లో కూడబెట్టిన వారంతా పన్నుల ఎగవేతదారులే. విదేశాల్లో కంపెనీలు ఏర్పాటు చేసుకుని హవాలా మార్గంలో వచ్చిన ధనంతో అక్కడే ఆస్తులు కొనుగోళ్ళు చేస్తూ, పన్నులు ఎగవేస్తూ, వేలకోట్ల రూపాయలు కూడబెట్టుకుంటున్నారు. ఈ విధంగా విదేశాల్లో అకౌంట్లు నిర్వహించేవారంతా ప్రపంచంలోని అనేక దేశాలలో నివసిస్తున్నారు. ఈ హవాలా పద్ధతుల ద్వారా లండన్ కేంద్రంగా ఈ కుభేరులు ఇంకా ఇంకా ఆస్తులు కూడబెడుతున్నారు.

**ప్రపంచ నేతల పేర్లు వెల్లడించిన పండోరా పత్రాలు:**

పండోరా పేపర్లలో జోర్డాన్ రాజు అబ్దుల్లా-2, అజర్‌బైజాన్ దేశాధ్యక్షుడు ఇల్హామ్ అలియేవ్, పాకిస్థాన్ ప్రధానమంత్రి ఇమ్రాన్‌ఖాన్ అనుచరులు కూడా ఉన్నారు. జోర్డాన్ రాజు అబ్దుల్లాకు అమెరికా, యుకె దేశాల్లో 10 కోట్ల డాలర్ల ఆస్తులు ఉన్నాయి. అజర్ బైజాన్‌కు చెందిన రాయల్ కుటుంబం సుమారు 400 మిలియన్ పౌండ్లతో ఆస్తులు కొనుగోలు చేసింది. చెక్ రిపబ్లిక్ ప్రధాని ఆండ్రేజ్ బాబీస్ రెండు ఫ్రెంచ్ విల్లాలను 12 మిలియన్ పౌండ్లకు కొనుగోలు చేశాడు. కెన్యా అధ్యక్షులు ఉరుహు కెన్యట్టా దశాబ్దకాలంగా విదేశాల్లో పెట్టుబడులు పెడుతున్నారు. పాకిస్తాన్ ప్రధానమంత్రి ఇమ్రాన్ ఖాన్ సన్నిహితులు, బంధువులు, కుటుంబ సభ్యులు, ఆయన కెబినేట్ మంత్రులకు కూడా కోట్ల డాలర్ల విలువైన ఆస్తులు ఉన్నాయి. ఉక్రెయిన్, ఈక్వెడార్ దేశాల అధ్యక్షులు, యూకే మాజీ ప్రధాని టోనీ బ్లెయిర్‌కు చెందిన రహస్య ఆస్తుల చిట్టా కూడా పండోరా పేపర్స్‌లో ఉన్నాయి. అమెరికా ఆర్థిక సేవల దిగ్గజం మోర్గాన్ స్టాన్లీ, అమెరికాలోని అతిపెద్ద న్యాయసేవల సంస్థ మెకెంజీ వంటి సంస్థల లావాదేవీల గురించి దీనిలో ప్రముఖంగా ప్రస్తావించారు. రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్‌కు మొనాకోలో విలువైన ఆస్తులున్నాయి. ఇలా చాలామంది సంపన్నుల రహస్య వ్యవహారాలు తమ దగ్గర ఉన్నాయని... వాటిన్నంటినీ బహిర్గతం చేస్తామని ఐసిఐజె పేర్కొంది. పైగా వీరందరు మారు పేర్లతో ఆర్థిక కార్యకలాపాలు చేస్తున్నారు. అలా కుబేరులు పన్నులు ఎగవేస్తున్నారు. లండన్ ఈ విషయంలో అగ్రస్థానంలో ఉంది.

**భారత్‌కు చెందిన పన్ను ఎగవేత ప్రముఖులు:**

పండోరా పేపర్స్ వెల్లడించిన పేర్లలో రిలయన్స్ ఎడిఏ గ్రూపు (అడాగ్) చైర్మన్ అనిల్ అంబానీ, ఆయన ప్రతినిధుల పేర్లు ఉన్నాయి. వీరికి జెర్సీ, బ్రిటీష్ వర్జిన్ ఐలాండ్స్ (బివిఐ), సైప్రస్ లలో కనీసం 18 ఆఫ్‌షోర్ కంపెనీలు కలిగి ఉండటం గమనార్హం. కాగా, గతేడాది ఫిబ్రవరిలో చైనాకు చెందిన మూడు ప్రభుత్వ నియంత్రిత బ్యాంకులతో వివాదం తలెత్తిన సమయంలో తన నెట్‌వర్త్ సున్నా అని లండన్‌కోర్టుకు అనిల్ అంబానీ పేర్కొన్న విషయం తెలిసిందే. ఐపియల్ కుంభకోణం చేసి పారిపోయిన లలిత్ మోడీ విదేశాల్లో దాచిన డబ్బుతో ఇప్పుడు పంజాబ్, రాజస్థాన్ ఐపిఎల్ టీమ్‌లను నడుపుతున్నాడు. ఇక పరారీలో ఉన్న పన్ను ఎగవేతదారు, ఆర్థిక నేరస్తుడు పంజాబ్ నేషనల్ బ్యాంక్‌ను నిండా ముంచి విదేశాలకు పారిపోయిన నీరవ్ మోడీ సోదరి పూర్వీ మోడీ పేరు పండోరా పేపర్‌లో ఉన్నది. ఆయన భారత్‌ను వీడటానికి నెల ముందు జనవరి 2018లో ఆయన సోదరి ఒక ట్రస్టును ఏర్పాటు చేశారు. బయోకాన్ వ్యవస్థాపకులు కిరణ్ మజుందర్ షా భర్త జాని మెకల్లామ్ మార్షల్ షా పేరు కూడా ఉన్నది. ఇన్‌సైడర్ ట్రేడింగ్ అభియోగాలపై సెబీ నిషేధాన్ని ఎదుర్కొంటున్న వ్యక్తితో కలిసి ఆయన ట్రస్టును నెలకొల్పారు.

బిజెపి రాజస్థాన్ మాజీ ముఖ్యమంత్రి వసుంధర రాజే తనయుడు ప్రస్తుత ఎంపీ దుష్యంత్‌సింగ్ తన భార్య పేరుతో పెట్టిన డొల్ల కంపెనీలు

బయటపడ్డాయి. ప్రముఖ క్రికెటర్ సచిన్ టెండూల్కర్ పేరు కూడా వినిపించింది. అయితే, విదేశాల్లో ఆయన పెట్టుబడులన్నీ చట్టబద్ధమైనవేననీ, పన్ను సంస్థలకు అన్ని వివరాలు సమర్పించారని స్పష్టం చేశారు. భారత బిలియనీర్లు గౌతమ్ అదానీ సోదరుడు వినోద్ శాంతిలాల్ షా అదానీ బ్రిటీష్ వర్జిన్ ఐలాండ్స్‌లో హైబిస్కస్ ఆర్‌ఈ హోల్డింగ్స్ లిమిటెడ్ అనే కంపెనీని 2018లో ఏర్పాటు చేశారు. ఇప్పటి పండోరా పేపర్లలోనే కాదు, 2016లో వెలువడిన పనామా పత్రాల్లోనూ ఆయన పేరు వినబడటం గమనార్హం. వీరితో పాటు కార్పొరేటు లాబీయిస్ట్ నీరా రాడియాకు రాక్స్‌బరీ ఎస్టేట్ లిమిటెడ్, ఎల్మాషే హోల్డింగ్స్ లిమిటెడ్ తదితర 12 కంపెనీలున్నాయని పండోరా పత్రాలు వెల్లడించాయి. ఆమె సోదరి కరుణ మీనన్, రాడియా సహాయకుడు జెహంగీర్ పోచా కూడా ట్రైడెంట్ ట్రస్టుతో కలిసి విదేశాల్లో కంపెనీలు పెట్టినట్లు తెలిపింది.

కాంగ్రెస్ నేత గాంధీ కుటుంబ సన్నిహితుడు కెప్టెన్ సతీశ్ శర్మ, 1995లో కేంద్ర మంత్రిగా ఉన్నప్పుడు న్యూజీలాండ్‌లో జాన్ జెగర్స్ పేరుతో ఒక ట్రస్టు స్థాపించారు. అందులో ఆయన భార్య, పిల్లలు, మనవలు సహా పది మంది కుటుంబసభ్యులు లబ్ధిదారులు. 2015లో ఆయన రాజ్యసభ సభ్యుడుగా ఉన్నప్పుడు న్యూజిలాండ్‌లోనే జేజెడ్-2 పేరుతో మరో ట్రస్టు స్థాపించి భారీ లావాదేవీలు నిర్వహించారు. ప్రముఖ బాలీవుడ్ నటుడు జాకీ ష్రాఫ్‌తో పాటు పలువురు పేర్లు ఇందులో ఉన్నాయి. వీరిలో అత్యధికంగా సిబిఐ, ఇడి కేసులు, ఆర్థిక నేరాల అభియోగాలను ఎదుర్కొంటున్న వారే ఎక్కువగా ఉన్నారు. అంతేగాదు వారు మోడీకి అత్యంత సన్నిహిత ఆశ్రిత పెట్టుబడిదారులే కావడం గమనించవల్సిన విషయం.

బ్యాంకులు ఇచ్చిన లక్షలాది కోట్ల రుణాలను ఎగవేస్తూ, ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్నులు ఎగవేస్తూ, తాము దివాళా తీసామని బుకాయిస్తూ తాము సంపాదించిన గుప్త ధనాన్ని మూటలు కట్టుకుంటున్నారు. ఇటువంటి గుప్త ధనాన్ని ఎటువంటి ఇబ్బంది లేకుండా చట్టానికి దొరకకుండా అత్యంత గోప్యంగా సురక్షితంగా దేశ సరిహద్దులు దాటించి పెట్టుబడులు పెడుతున్నారు. ఆ విధంగా పెట్టుబడులు పెట్టుకోవడానికి అవకాశం కల్పించే సంస్థలు అనేకం పుట్టుకొస్తున్నాయి. గతంలో అయితే నల్లకుబేరులు అందరూ తమ గుప్త ధనాన్ని స్విస్ బ్యాంకుల్లో దాచి పెడతారని అనుకునే వారు. కానీ, కాలక్రమంలో మార్పు సంభవించింది. ప్రధానంగా పనామా పేపర్ల లీకేజీ తరువాత స్విట్జర్లాండ్ కొంతవరకూ పారదర్శకంగా ఉండటానికి ప్రయత్నాలు ఆరంభించింది. ఫలితంగా స్విస్ బ్యాంకులో నల్లధనం నిల్వచేయడం సురక్షితం కాదనే ఆలోచనతో పన్ను ఎగవేతదారులు ధనాన్ని మరింత గోప్యంగా ఉండే దేశాలకు తరలించడానికి సిద్ధమయ్యారు.

**లండన్ కేంద్రంగా డొల్ల కంపెనీలు:**

రాజకీయ నాయకులు, ప్రభుత్వ పెద్దలు, మాజీలు, వ్యాపార దిగ్గజాలకు లండన్‌లోని అదంబర పూర్వకమైన, అత్యాధునికమైన వ్యాపార పర్యావరణ వ్యవస్థ ఎంతో దోహదకారిగా ఉంది. తమ ఆస్తుల నిర్వహణ సంస్థల సృష్టికి అనువుగా ఉంది. అత్యంత శక్తివంతమైన న్యాయవాద వ్యవస్థ అక్కడ ఉండటంతో పాటు బాగా వేళ్ళూనుకుని పాతుకుపోయిన అనుభవం గడించిన సంస్థలు ఉన్నాయి. 2019లో ఈ బాహాటత్వ బృందం చేసిన విశ్లేషణ ప్రకారం, ఇంగ్లాండ్, వేల్స్‌లలో ఇలా సుమారు 87 వేలకు పైగా రహస్య యజమానుల ఆస్తులు ఉన్నాయి. అవన్నీ మారుపేర్లున్న కంపెనీలతో రిజిస్టరై ఉన్నాయని పండోరా పత్రాల నివేదిక స్పష్టం చేసింది. వీరిలో 40 శాతం మంది లండన్‌లో మారుపేర్లతో చెలామణీలో ఉన్నారు. ఆ ఆస్తుల మొత్తం విలువ 100 బిలియన్ పౌండ్లు (135 బిలియన్ డాలర్లు, అంటే పది లక్షల కోట్ల రూపాయలు)గా నివేదిక అంచనా వేసింది.

బ్రిటన్ పార్లమెంటు ఉన్న వెస్ట్‌మినిస్టర్, కామ్‌డన్, కెన్సింగ్టన్, చెల్సియా వంటి ఎంతో పేరు ప్రఖ్యాతి చెందిన ఖరీదైన ప్రాంతాల్లో ఈ ఆస్తులు ఉన్నాయి. అనేక సంవత్సరాలుగా లండన్ ఆస్తుల మార్కెట్ ఈ విషయంలో ఎంతో మథన పడుతోంది. స్థానికేతర కుబేరులకు కేంద్రంగా మారిన ఈ ఆస్తులను రహస్యంగా కాపాడటంలో ఈ మార్కెట్ కీలకంగా ఉంది. నగరంలో గుండెకాయ వంటి ప్రాంతాల్లో స్థానికేతర ఆస్తులు ఉండటంతో ఈ మార్కెట్ కీర్తి ప్రతిష్టలు కూడా తరిగిపోతున్నాయి. ఉదాహరణకు ఇటీవలి కాలంలో రష్యాకు చెందిన పెద్దలు, రాజ్యాధిపతులు ఈ ప్రాంతంలో ఆస్తుల కొనుగోలు చేయడం బాగా పెరిగిందని నివేదిక పేర్కొంది. అనేక దశాబ్దాలుగా బ్రిటన్‌లోని అధికారులు విదేశీ పెట్టుబడులను, వారి సామర్థ్యాన్ని నియంత్రించేందుకు స్వల్ప ప్రయత్నాలు చేస్తున్నారు. అయితే పన్నుల ఎగవేతకు లండన్, బ్రిటన్‌లోని ప్రాంతాలు అయస్కాంతంలాగా పనిచేస్తున్నాయని, హవాలా కార్యకలాపాలకు, నేరస్తులకు నిలయాలుగా మారుతున్నాయని విమర్శకులు, ఆందోళన చెందుతున్నారు. పండోరా పత్రాలు బహిర్గతం కావడంతో బ్రిటన్‌లో దుమారం రేగింది. హవాలా ధనానికి, పన్ను ఎగవేతలకు వ్యతిరేకంగా బ్రిటన్‌లో గట్టి రక్షణ చర్యలు తీసుకోవాలని, దీనికి సంబంధించిన అన్ని మార్గాలనూ మూసివేయాలని బాహాటత్వాన్ని కోరుకునేవారంతా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నారు.

**పండోరా దండోరాపై భారత్ స్పందన:**

అన్ని దేశాలలోని ప్రభుత్వాల మాదిరిగానే పత్రికల్లో వచ్చిన సమాచారంతో స్పందించిన మన ఆర్థిక మంత్రిత్వ శాఖ వాటిపై బహు ఏజన్సీల గ్రూపు దర్యాప్తు చేస్తుందని, అటువంటి కేసుల్లో చట్టం ప్రకారం చర్యలుంటాయని ప్రకటించింది. ప్రత్యక్ష పన్నుల సెంట్రల్ బోర్డు ఛైర్మన్ నేతృత్వం వహించే ఈ గ్రూపులో ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్, ఫైనాన్షియల్ ఇంటెలిజెన్స్ యూనిట్, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. ఐసిఐజె, గతంలో హాంకాంగ్ -షాంఘై బ్యాంకింగ్ కార్పొరేషన్, పనామా పేపర్స్, ప్యారడైజ్ పేపర్స్ పేరుతో నల్లధనం లోగుట్టును బహిర్గతం చేసిన నేపథ్యంలో ప్రభుత్వం ఇప్పటికే 'నల్లధనం (వెల్లడించని విదేశీ ఆదాయం, ఆస్తులు) పన్ను చట్టం- 2015, పన్ను విధింపు' చట్టాన్ని ఆమోదించింది. పనామా, ప్యారడైజ్ పేపర్ల విషయంలో నిర్వహించిన దర్యాప్తుల్లో సెప్టెంబర్ 15 నాటికి రమారమీ రూ. 20,352 కోట్లు వెల్లడించని ఆస్తులను గుర్తించటం జరిగింది. హక్కుల సంస్థ ఆక్స్‌ఫాం ఇండియా తక్షణం చర్య తీసుకోవాలని అధికారులను కోరుతూ, టాక్స్ హెవెన్స్ (పన్ను రహిత దేశాలు)ను రద్దు చేయాలని కోరింది. ఈ గూడుపుఠాణీ ఖాతాల వల్ల ప్రపంచ దేశాలు ఏటా 427 బిలియన్ డాలర్లు (రూ. 32 లక్షల కోట్లు) ఆదాయం కోల్పోతున్నాయని తెలిపింది. ఎక్కువ నష్టపోతున్నది వర్ధమాన దేశాలే. ఈ స్వర్గాలు నేరాలను, అవినీతిని పెంచి పోషిస్తున్నాయని పేర్కొన్నది.

ఇవాళ దేశంలో అవినీతి గురించి మాట్లాడమంత హాస్యాస్పదం మరోకటి లేదు. రాజకీయాల్లో అవినీతి అర్హతగా మారింది. ప్రజాసేవ అర్థం మారిపోయి ప్రజల నోరు మూయించడమే పాలనగా మారింది. ప్రధాని నరేంద్రమోడీ 2014 ఎన్నికల్లో తనకు అధికారమిస్తే, విదేశాల్లో

కుబేరులు దొంగచాటుగా దాచుకున్న నల్లధనం వెనక్కి తెచ్చి పేదల బ్యాంకు ఖాతాలు ఒక్కొక్క దానిలో రూ.15 లక్షలు జమచేస్తానని చేసిన ఆకర్షణీయమైన వాగ్దానాన్ని ఆయన అధికారంలోకి వచ్చాక మరిచిపోయారు. విజయ్ మాల్యాను, నీరవ్ మోడీలను వెనక్కి తీసుకురావటమే ఇప్పటికి సాధ్యం కాలేదు. సంపన్నులను రక్షించే విదేశీ చట్టాలు వారికి పెట్టనికోటగా ఉంటాయి. పన్నుల బెడదలేని దేశాలైన పనామా, దుబాయి, మొనాకో, కేమన్ ఐలాండ్స్ మొదలైన వాటిలో ధనవంతుల గుప్తధనాన్ని దాచుకోవడంతో పాటు ఆస్తులు సమకూర్చుకోవడానికి డొల్ల కంపెనీలను సృష్టించారని ఐసిఐజె ప్రకటించింది. అందువల్ల ఏదైనా అంతర్జాతీయ చట్టాల పరిధిలో నడవాల్సిందే. రాజకీయ వేదికలపై ఘీంకారాలు చెల్లుబాటు కావు.

**మోడీ పాలనలో పెరిగిన అక్రమార్జనపరులు:**

మోడీ పాలనలో ప్రతి ఏటా బ్యాంకు రుణాలు, ప్రభుత్వానికి పన్నులు ఎగ్గొట్టి పారిపోతున్న వారి సంఖ్య పెరిగి పోతున్నందువల్లనే పనామా పత్రాల్లో వెలుగుచూసిన వ్యక్తుల పేర్లు పండోరా పత్రుల్లో మళ్లీ కన్పిస్తున్నాయి. పేర్లు బయటకొచ్చినా వారి నుండి పన్నులు రాబట్టలేకపోవడం మోడీ రాజకీయ దివాళాకోరుతనానికి నిదర్శనం. 2014 నుండి 2018 మధ్యకాలంలో మన దేశం నుండి 23 వేల మంది మిలియనీర్లు విదేశాలకు పారిపోయారని మోర్గాన్ స్టాన్లీ నివేదిక తెలిపింది. 2020 సంవత్సరంలో 5000 మంది దేశం నుండి పారిపోయినట్లు గ్లోబల్ వెల్తు మైగ్రేషన్ నివేదిక పేర్కొంది. భారత్ నుండి పారిపోయిన వారి వల్ల భారత్ ఏటా 427 బిలియన్ డాలర్ల (32 లక్షల కోట్లు) పన్ను నష్టపోతుందని ఆక్స్‌ఫామ్ ఇండియా తెలిపింది. కేంద్ర ప్రత్యక్ష పన్నుల విభాగం, ఇడి, ఫైనాన్షియల్ ఇంటిలిజెన్స్, రిజర్వ్‌బ్యాంక్ విభాగాలన్నీ బిజెపి ప్రభుత్వ ప్రత్యర్థుల మీదనే ప్రతాపం చూపుతున్నాయి. మోడీ సన్నిహితుల జోలికి వెళ్లకుండా ప్రేక్షక పాత్ర వహిస్తున్నాయి. విచిత్రమేమిటంటే అక్రమ సంపాదనదారులకే ప్రభుత్వం తిరిగి రుణాలు, పన్ను రాయితీలు ఇస్తోంది. ఫలితంగా భారత ఆర్థిక వ్యవస్థ తీవ్ర సంక్షోభం ఎదుర్కొంటుంది.

ప్రపంచంలో పేదలు, ధనికుల మధ్య ఆర్థిక వ్యత్యాసాలు విపరీతంగా పెరిగిపోతున్న దశలో అనేక దేశాల ఆదాయ సంపదలను హరిస్తున్న ఇటువంటి దొంగ ఖాతాల ఉదంతాలు ఇలా బయటపడడం అత్యంత విషాదం. ఒకవైపు మన పాలకులు భారతదేశం అతి వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఒకటని జబ్బలు చరుచుకుంటుండగా మరొకవైపు ధనిక, పేద ఆర్థిక వ్యత్యాసాలు పెరిగిపోయి పేదరికం గుట్టలు గుట్టలుగా దర్శనమివ్వడం ఆందోళనకరం. దేశంలోని 10 శాతం మంది చేతిలో 77 శాతం దేశ సంపద ఉండడం ఏ రకమైన అభివృద్ధో అర్థం కాదు. 2020లో ఉత్పత్తి అయిన దేశ సంపదలో 73 శాతం వరకు దేశ జనాభాలో 10 శాతంగా ఉన్న ధనికుల గుప్పెట్లో కేంద్రీకృతమైంది. అలాగే 67 మిలియన్ల మంది నిరుపేద భారతీయుల సంపద కేవలం 1 శాతం పెరిగింది. 2000 సంవత్సరంలో దేశంలో మహా కోటీశ్వరులు 9 మంది ఉండగా, 2021 నాటికి 237 మందికి చేరింది.

**ముగింపు:** సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు అమలు మొదలయ్యాక రాజకీయ పెద్దల అనుగ్రహంతో ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం విజృంభించి ఆర్థిక అక్రమాలు పెరిగి గుప్తధనం వట వృక్షంలా విస్తరించింది. 1991 ఆర్థిక సంస్కరణల తరువాత స్టాక్‌మార్కెట్ కుంభకోణాలు, బ్యాంక్ మోసాలు పెచ్చరిల్లాయి. హర్షద్ మెహతా, కేతన్ పరీఖ్, విజయ్ మాల్యా, సత్యం రామలింగరాజు, సహారా సుబ్రత రాయ్, నీరవ్ మోడీ, మెహుల్ చోక్సీలు పుట్టుకొచ్చారు. వీరిలో ఎవరికి శిక్షలు పడలేదు. ఆశ్రితులు దోచుకున్నది చాలదన్నట్టు ప్రభుత్వ ఆస్తులను సహితం వారికి దారాదత్తం చేసే మోడీ ప్రభుత్వ హయాంలో కట్టలు కట్టలు చార్జీషీట్లు నమోదు చేయడం తప్ప చేసింది ఏమిలేదు. ఏళ్ల తరబడి కేసులు కోర్టుల్లో నడుస్తూనే ఉంటాయి. నేరస్తులు దర్జాగా విదేశాలకు పారిపోయి విలాసవంతమైన జీవితాలు గడుపుతున్నారు. కొందరు అధికార పక్షంతో మిలాఖత్ అయి కేసుల నుంచి శిక్షలు లేకుండా బయటపడుతారు. సెంట్రల్ బోర్డ్ ఆఫ్ డైరెక్ట్ టాక్సెస్ (సిబిడిటి) దర్యాప్తు అయినా పండోరా పేపర్స్‌లోని భారతీయ ప్రముఖుల గుప్త ధన మూలాలను బయటకు తీసి, ఆ సంపదను దేశ ఖజానాకు జమ చేయగలిగితే అంతకంటే సంతోషం మరొకటి ఉండదు. అయితే బిజెపి ప్రభుత్వం ఆశ్రిత పెట్టుబడిదారుల పక్షంగా వ్యవహరిస్తుంది. ప్రజా ఉద్యమం ద్వారానే అవినీతిని పారద్రోలాలి. ఆపని పాలకవర్గాలు చేయవు. గుప్త ధనాన్ని వెలికితీసే లేదా నియంత్రించే ఆలోచన మోడీ ప్రభుత్వానికి లేదనేది అక్షర సత్యం.

నల్ల కుబేరులంతా తాము అక్రమంగా ఆర్జించిన సొమ్మును పన్నులు విధించని దేశాల్లో అత్యంత సంక్లిష్టమైన ట్రస్టులు, కంపెనీలలో దాచుకుంటున్నారు. ఒకవేళ దర్యాప్తు సంస్థలు వాటి దాకా చేరినా ఆ ట్రస్టులు, కంపెనీల అసలు యజమానులెవరో తెలుసుకోవడం దాదాపు అసాధ్యమే. ఎందుకంటే వ్యక్తులు లేదా సంస్థల పెట్టుబడులకు సంబంధించిన సమాచారాన్ని వెల్లడించడంలో ఆ దేశాల్లోని అధికారులు ఏ మాత్రం సహకరించరు. కాబట్టి పన్ను ఎగవేతదారు లేదా అక్రమ సంపాదన లేదా గుప్తధనం కలిగిన వ్యక్తులకు తమ సంపాదన గురించి ఎటువంటి ఆందోళన ఉండదు. అందుకే ఆ దేశాల్లో పెట్టుబడులు పెట్టడానికి వీరు ఉత్సాహం చూపిస్తున్నారు. పన్ను ఎగవేతదారులకు స్వర్గధామాలంటున్న దేశాల్లో ఉన్న చట్టాలు, నిబంధనల వల్ల ఎంతటి అక్రమాన్ని అయినా సక్రమం చేయగలిగే ఈ ప్రక్రియ నిజానికి యావత్ ప్రపంచానికీ అవమానకరం. అభ్యంతరకరమైనది, అనర్థకమైనది. అధికారంలో ఉన్నవారు ఆగ్రహంతో ఊగిపోతున్నట్లు కనిపించడం, ఆ తరువాత విచారణలు, దర్యాప్తుల పేరిట కాలం గడిచిపోవడంతో అంతా చల్లారిపోవచ్చు. ఈ కుదుపు తాత్కాలికమే. ఎప్పటిలాగానే ఇప్పుడూ చాలాదేశాలు దర్యాప్తును ఆదేశించాయి. అవినీతిని సహించేది లేదని పాలకులు భీకర ప్రతిజ్ఞలు చేస్తున్నారు.

మనదేశంలో కొల్లగొట్టిన మొత్తాన్నే విదేశాలకు మళ్లించి సూట్‌కేస్ కంపెనీల ద్వారా మళ్లీ తమ దేశీయ కంపెనీలకే తరలించిన వారు కళ్లముందు కనబడుతున్నా చర్యలు తీసుకునేందుకు ప్రభుత్వం సిద్ధంగా లేదు. ప్రభుత్వానికి అధికారం ప్రధానం ఆ అధికారాన్ని నిలబెట్టేందుకు దోహదం చేసే శక్తులు పనామా పేపర్లలో కనపడితేనేం, ప్యారడైజ్ పేపర్లలో కనబడితేనేం, పండోరా పేపర్లలో కనపడితేనేం, తేడా ఏముంటుంది? సిబిఐ, ఇడి లాంటి ఏజెన్సీలు ఏమీ చేయగల స్థితిలో లేవు. అవి ప్రభుత్వ జేబు సంస్థలుగా మారి స్వతంత్రతను కోల్పోయాయి. 2016లో పనామా పత్రాల్లో పేర్లు వెల్లడైన వారిపై చర్యలు తీసుకొని ప్రభుత్వం పండోరా పత్రాల్లో వెల్లడైన అక్రమార్జనపరులపై చర్యలు తీసుకుంటుందని ఆశించడం భ్రమే అవుతుంది. అవినీతి అంతానికి, స్వచ్ఛమైన ప్రజాహిత ప్రజాస్వామ్య విలువలతో కూడిన పాలన కొరకు వ్యవస్థ పరమైన మార్పులు ఒకటే పరిష్కారం.





# ఇక్కడ అందని ఊపిరి... యే సీమవనాల్లో చిక్కుకుపోయింది...?

కుప్పిలి పద్మ

FB మెమరీగా యిచ్చిన పోస్ట్ ని చూస్తోన్న వెంకట్ కళ్ళ ముందుకి అనేకానేక దృశ్యాలు విన్నవి కన్నవి.. చదివినవి.. గతమూ వర్తమానమూ కలగలిసిపోయి... యే అనుభవం యెవరదని చెప్పగలం?! ప్రపంచం అల్లకల్లోలంలో కొట్టుకుపోతున్నప్పుడూ అనుభవాలూ సామూహికమే కదా?!

I can't breath

అవును వూపిరాడ్డం లేదు. వొక జాతికో, వొక వర్గానికో, వొక సమూహానికో, వొక దేశానికో కాదు. యావత్తు ప్రపంచానికీ వూపిరాడ్డం లేదు. వొక పక్క ప్రపంచాన్ని గడగడలాడిస్తోన్న కరోనా వైరస్ వూపిరాడనీయడం లేదు. వొక్కొక్కర్నీ... సమూహాలుగా వూపిరాడనీయకుండా ప్రాణాల్ని కబళించేస్తూ ప్రాణాలు తీసేస్తుంది.

కులాల పేరిట, జాతుల పేరిట, జాతి వివక్షల పేరిట, వర్ణాల పేరిట చెలరేగిపోతున్న అమానుషత్వం అతిక్రూరంగా వూపిరి తీసేస్తోంది. కరోనా వైరస్ కన్నా యిది అత్యంత ప్రమాదకరమైనది. జాత్యహంకార వివక్షకు వ్యతిరేకంగా నెల రోజుల నుంచి 'మిన్నీ పోలీస్' నగరంలో జరిగిన జార్జ్ ఫ్లాయిడ్ హత్యకు వ్యతిరేకంగా అమెరికా యావత్తూ అట్టుడికి పోతుంది. తెల్లజాతి అహంకారాన్ని అనుభవించిన మిగతా జాతులందరూ 'కరోనా' భయాన్ని సైతం లెక్క చేయకుండా 'అన్ని ప్రధాన నగరాల్లోనూ' ప్రతీ రోజూ ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. త్వరలో అధ్యక్ష యెన్నికలు వుండటంతో అన్ని వర్గాల నుంచీ, అన్ని రంగాల్లోని ప్రముఖుల నుంచి, ప్రతిపక్ష పార్టీల నుండీ యీ వుద్యమానికి యెనలేని సానుభూతి వస్తోంది.

కె.వి.వి. వెంకట్ తన భార్య లత, పిల్లలు హర్ష, ఆమోదలతో కలిసి వీకెండ్ రోజుల్లో జరుగుతున్న ఆ ఆందోళనలో పాల్గొన్నాడు. కూతురు ఆమోద తెలివైన పిల్ల. అడాల్సెంట్ యేజ్‌లో వుండి యేది మంచి, యేది చెడు యిప్పుడిప్పుడే గ్రహిస్తోన్న గర్ల్. చదువుతున్న స్కూల్లో తన నల్లని చర్మపు రంగు వల్ల యెన్నిసార్లు 'బ్లాకీ'గా యేడ్పించబడిందో, రాడ్ చేయబడిందో గుర్తుచుకొని ఆ యాజిటేషన్‌లో బాగా యిన్వాల్వ్ అయిపోయింది. జార్జ్ వాషింగ్టన్ విగ్రహం దగ్గర మైక్‌లో మాట్లాడుతున్న చోటుకి వెళ్ళి మైక్ తీసుకొని ఆవేశంగా మాట్లాడటమే కాక తెలుగులో జాతి వివక్ష మీద యెప్పుడో విన్న పాటని గుర్తు చేసుకుంటూ పాడింది. పాట చివర్లో కన్నీళ్ళు పెట్టుకోవడం అందరి గుండెల్నీ మెలిపెట్టేసింది. వెంకట్ కూతురు దగ్గర కెళ్ళి పొదివి పట్టుకొని 'వి వాంట్ బ్రీత్' అని గట్టిగా స్లోగన్ యిచ్చాడు. అంతే చప్పట్లు, అరుపులతో ఆ ప్రాంతమంతా హోరెత్తి పోయింది. జనంలో నిలబడి వున్న లత, హర్షలను కూడా పిలిచి నలుగురు కలిసి నినాదాలు చేశారు.

యీ కార్యక్రమాన్నంతా టెలివిజన్లు, పత్రికలు బాగా కవర్ చేసినాయి. టాబ్లాయిడ్స్ అయితే ఆమోద పాట మీద, ఆ అమ్మాయి నిత్యం యెదుర్కొంటున్న వర్ణ వివక్ష మీద ఫ్రంట్ పేజీ ఆర్టికల్స్ రాశాయి.

వెంకట్ సెల్‌ఫోన్‌లో రికార్డు చేసిన ఆ ప్రోగ్రాం వీడియోని రైటప్‌తో ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేశాడు. తెలుగు ఫేస్‌బుక్ యాక్టివిస్ట్‌లలో మంచి స్పందన వచ్చింది. వేలాది లైక్‌లు, వందలాది కామెంట్స్ వచ్చాయి. యీ మధ్య కాలంలో వెంకట్ యెఫ్.బి. పోస్టింగ్స్‌లో యింతగా రెస్పాన్స్ వచ్చిన పోస్ట్ మరొకటి లేదు. స్ఫూర్తివంతంగా అనిపించింది. వీలైతే రేపు వీకెండ్‌లో మళ్ళీ యాజిటేషన్‌లో పాల్గొనాలి అనుకున్నాడు. ఫోన్‌లో యెవరి కామెంట్‌కో రెస్పాన్స్ యిస్తున్న వెంకట్ లత బెడ్ రూంలోకి రావడాన్ని చూసి ఫోన్ పక్కకి పెట్టేశాడు.

“యీ గొడవలు, యెక్స్‌పోజింగ్ మనకెందుకు వెంకూ? ఫర్‌దర్‌గా యేమైనా ప్రాబ్లమ్స్ వస్తే మన ఫ్యూచర్ యేమిటీ? పిల్లలు యిప్పుడిప్పుడే పెద్ద వాళ్ళమవుతున్నారు. మనం కూడా సెటిల్ అవడం మొదలుపెట్టాం. యీ సమయంలో మనకిది అవసరమా?” అడిగింది లత.

“యెఫ్.బి.లో చూడు. అంతా యెంత యిన్స్‌పైర్ అవుతున్నారో, యెంత రెస్పాన్స్ వచ్చిందో చూడు. మన ఆమోద యేంజెల్. పిల్లలు సమాజం గురించి ఆలోచించటం కంటే మనకేం కావాలి?!” అన్నాడు వెంకట్.

“నిన్న దాని యాంగర్‌నెస్ చూసి భయం వేసింది వెంకూ, యెక్కడ్నించో వచ్చి, యిక్కడ సెటిల్ అవుతున్న మనకు యిక్కడి వాళ్ళ గొడవలు అవసరమా?! అభ్యుదయాన్ని అణుచుకోలేకపోతే fbలో స్లోగన్స్ యివ్వు.. కానీ అక్కడ పాల్గోవొద్దు..” అంది లత.

“ఆమోదలో స్పష్టమవుతున్న యిండివిడ్యువాలిటీ యెంత

బావుందో... హర్షకి కూడా మెల్లగా అర్థం చేయించాలి" చెప్పాడు వెంకట్ ఆమె భయాలకి ప్రాముఖ్యం యివ్వకుండా.

వెంకట్‌ది ఆంధ్రప్రదేశ్ ప్రకాశం జిల్లాలోని మారుమూల ప్రాంతమైన మద్దిపూడి మండలంలో యేటి వొడ్డు గ్రామం. రోజూ ఆరుకిలోమీటర్ల దూరంలో వున్న పొదిలి వెళ్ళి పదవ తరగతి చదువుకున్నాడు. తాతల కాలం నుంచీ అందరూ రైతులే. పొగాకు పండితేనే వాళ్ళ బతుకులు అంతంత మాత్రం గడుస్తాయి. రాగి సంగటి, సజ్జ సంగటి తప్ప మరొకటి యెరుగరు. బాక్స్‌లో కూడా వొక రాగి సంగటి ముద్ద పెట్టుకొని స్కూల్‌కి వెళ్ళేవాడు. తండ్రికి వెంకట్‌ని చదివించడం యిష్టం లేదు. యింట్లోనే వుండి వ్యవసాయంలో చేదోడుగా వుంటే రెక్కసాయంగా వుంటాడని ఆయన అభిప్రాయం. తల్లి వరమ్మకి మాత్రం కొడుకు చదువుకోవాలని, తమలా మట్టి పిసుక్కొని బతక్కూడదని, యేదైనా వుద్యోగం చేసుకుంటూ కడుపులో చల్ల కదలకుండా బతకాలని కోరిక. కొడుక్కు యీసారి పొగాకు వేలం అయినాకయినా వొక సైకిల్ కొనిపెట్టమని భర్తని పోరుతుండేది. టెంత్ సెకండ్ క్లాసులో పాసయిన వెంకటేశ్వరుని మాలకొండ తీసుకెళ్ళి తలనీలాలిప్పించింది వరమ్మ. పాలు పొంగించి మాలకొండ వెంకటేశ్వర స్వామిని వేడుకుంది. తమ కొడుకుకి మంచి భవిష్యత్‌ని యివ్వాలని మొక్కుకుంది.

యిక చదివించేది లేదని భర్త అడ్డం తిరిగినా తన పుట్టింటి వాళ్ళు యిచ్చిన కొండ్రని కాస్తా అమ్మేసైనా కొడుకుని చదివిస్తానని గోలపెట్టింది. యిక తప్పక కొడుకుని ఒంగోలులోని జూనియర్ కాలేజీ హాస్టల్‌లో చేర్చి వచ్చాడు. ఆ రెండేళ్ళు శ్రద్ధగా చదివి, యెంసెట్ రాసి గుంటూరు యింజనీరింగ్ కాలేజీలో బిటెక్ చేసాడు. తన క్లాస్‌మెట్స్ చాలా మంది కెనడాలో యెంయెస్ చేయడానికి కోచింగ్ తీసుకుంటుంటే తానూ తీసుకున్నాడు. లక్కీగా కెనడాలో సీటు వచ్చింది. అయితే పది లక్షలు బ్యాంకు ష్యూరిటీ కావాల్సి వచ్చింది. తమకి అంత విలువ చేసే పొలం లేదు. సొంతానికి వున్నది నాలుగెకరాలు, కౌలుకి తీసుకున్నది ఆరెకరాల్లో పొగాకు, చౌకులు వేస్తే ధర వచ్చినప్పుడు మిగులు, లేకుంటే తరుగుగా వాళ్ళ బతుకు గడుస్తోంది. వెంకటేశ్వర్లకి కెనడాలో సీటు వచ్చింది అని తెలియగానే ఆ వూరి పెద్ద మనుషుల్లో వొకడైన మాలకొండయ్య ష్యూరిటీ పెట్టడానికి ముందుకొచ్చాడు. వాళ్ళది తమకంటే కాస్త పెద్ద కులం. అలాంటాయన ష్యూరిటీ పెట్టడం ఆశ్చర్యాన్ని కలిగించింది. కెనడాలో రెండు సంవత్సరాల చదువు పూర్తయ్యాక అమెరికా న్యూజెర్సీలో సాఫ్ట్ వేర్ జాబ్ సంపాదించుకొని తాను ఖర్చులకు సర్దుకుంటూ ప్రతీ నెలా తండ్రికి డబ్బు పంపేవాడు. ఆ డబ్బుతో అప్పులు తీర్చి, మరో నాలుగెకరాలు కొన్నాడు అతడి తండ్రి. యిక వ్యవసాయం మానేయండి, నష్టం తప్ప లాభం లేని దానికోసం యెందుకు తండ్లాట అని యెప్పుడు ఫోన్ చేసినా తండ్రికీ, తల్లికీ చెబుతుండేవాడు. యీలోగా తండ్రి మరణించాడని కబురొచ్చింది. అదే సమయంలో అతనికి ఆరోగ్యం బాగులేక వెళ్ళలేకపోయాడు. వెళ్ళలేనందుకు దుఃఖంతో కుమిలిపోయాడు వెంకట్. తర్వాత సెలవు పెట్టి, వర్క్ టు హోం వర్క్ చేస్తానని వొప్పందం చేసుకొని ఇండియాలోని తమ వూరుకొచ్చాడు.

వెంకటేశ్వర్లు కాస్త వెంకట్ అయి ప్రతీ దానికీ 'యా...యా' అంటున్న అతన్ని వూళ్ళో అతని వయస్సు పిల్లలంతా విస్మయంగా చూశారు. వాళ్ళంతా పెళ్ళిళ్ళు చేసుకొని పొగాకు, బ్యార్నీలు అంటూ కిందా మీద పడుతున్నారు. వరమ్మని తనతో పాటు అమెరికా వచ్చేయమన్నాడు వెంకట్.

'నాల్గు బేర్నీల పంటని వదిలి యెలా వస్తానయ్యా?' అంటూ రావడానికి వరమ్మ వొప్పుకోలేదు.

యింతలో వో రోజు మాలకొండయ్య వచ్చి వెంకట్‌ని, వరమ్మని వెంట బెట్టుకొని తనింటికి తీసుకెళ్ళాడు. మంచం పర్చి కూర్చోమన్నాడు. వెంకట్ కూర్చున్నాడు. వరమ్మ పెద్దోళ్ళ మంచం మీద కూర్చోకూడదని పక్కనున్న అరుగు మీద కూర్చుంది.

"అబ్బాయి వెంకటేశ్వర్లూ... మీ నాయన దినకర్మలకి రాలేకపోయావు. యేడాది తిరక్కముందే, పెళ్ళయినా చేసుకుంటే మీ నాయనకి వైతరణి దాటే అవకాశం వస్తుంది. కనుక నా మాటిని పెళ్ళి చేసుకో"మని చెప్పాడు. వరమ్మ "నేను కూడా అదే పోరు పెడుతుంటినన్నా, యినటంలే. నువ్వయినా గట్టిగా చెప్పు" అంది.

"యిప్పటికెప్పుడు పెళ్ళంటే మాటలా మామా, తగ్గ పిల్ల దొరకాలి, యెనకాముందు చూసుకోవాలి కదా" అన్నాడు వెంకట్.

"అదె జెప్తున్నా, మా స్వర్ణమ్మ ఒంగోలులో బిటెక్ చదువుతుంది. నీకు తెల్సుకదా? నీకిష్టమైతే మీ యిద్దరికి పెళ్ళి చేస్తా" చెప్పాడు మాలకొండయ్య.

అరుగు మీద కూర్చొన్న వరమ్మ టక్కున లేచి నిలబడింది. వెంకట్ మంచం మీద యెగిరిపడ్డారు. యిప్పటి దాకా తమ వూళ్ళో తమ రెండు కులాల మధ్య కంచం పొత్తే తప్ప, పెళ్ళి పొత్తు లేదు. అలాంటిది పెళ్ళి అంటున్నాడంటే పెద్దాయన అనుకునేంతలో ముందే అనుకున్నట్టు మాలకొండయ్య భార్య భూలక్ష్మమ్మ, కూతురు స్వర్ణలతకే చీరకట్టి టీ తీసుకొని బయటకొచ్చింది. స్వర్ణలతని చూడగానే వెంకట్ నోరు తెరిచేశాడు. మాలకొండయ్యకి పరిస్థితి అర్థమై అందరి నోళ్ళని తీపిచేశాడు.

"మరి వూళ్ళో..." అని యేదో అనబోయాడు.

"అదంతా నేజ్జూసుకుంటా నాకు వొక కొడుకు, కూతురు. యిద్దరికీ సమంగా ఆస్తి పంచిస్తా. నా మాటకు తిరుగుండదు. కాదంటే పత్రాలు యిప్పుడే రాసిస్తా. అవునంటే వచ్చే శనివారం మాలకొండలో పెళ్ళి. యేర్పాట్లన్నీ నేజ్జూసుకుంటా" వూపిరి తిరగనియ్యలేదు మాలకొండయ్య.

అనుకున్నట్టే వెంకటేశ్వర్లు (యు.యెస్.యె.)కీ, స్వర్ణలత (బి.టెక్ సెకండ్ యియర్)కి మాలకొండలో అత్యంత ఘనంగా పెళ్ళయిపోయింది. బిటెక్ పూర్తి చేయగానే స్వర్ణలతని తీసుకొని అమెరికా వచ్చేశాడు వెంకట్. లత కూడా యెం.యెస్. చేసి జాబ్‌లో చేరింది. యిద్దరూ జాబ్స్‌లో కుదుట పడ్డాక ఆమోద పుట్టింది. ఆమోద కాన్పుకి మాలకొండయ్య దంపతులిద్దరూ వచ్చి వున్నారు. ఆరు నెలల తర్వాత వాళ్ళు వెళ్ళాక వరమ్మ వచ్చి ఆరు నెలలు వుంది. ఆమోదని అమ్మమ్మ, తాతయ్య, నానమ్మలు పెంచి పెద్ద చేశారు. తమ వూరు యేటొడ్డులో యిల్లు కడదామనుకున్నాడు వెంకట్. దాన్ని వారించి వున్న పెంకుటింటినే కాస్త బాగు చేయించి పొదిలి - దర్శి మధ్య నీటి వసతి వున్న మాగాణి పొలాల్ని కొనిపెట్టాడు మాలకొండయ్య.

ఆమోద స్కూల్ కెళ్ళే వయసు వచ్చేనాటికి హర్ష పుట్టాడు. అమ్మమ్మ, నాయనమ్మలకి ఆరు నెలల డ్యూటీ తప్పలేదు. యీలోగా లత తమ్ముడు కూడా చదువుల కోసమని కెనడా వచ్చేశాడు. వరమ్మ యిక్కడున్న సమయంలో మాలకొండయ్య చనిపోయాడు. ఆ సమయానికి కెనడాలో చదువుకుంటున్న లత తమ్ముడితో సహా అందరూ యిండియా వెళ్ళి వచ్చారు. మాలకొండయ్య యింటిని తెల్సిన స్కూల్ మాస్టర్‌కి అద్దెకిచ్చేసి, తమ పొలాన్ని, తన మామ పొలాల్ని, బేర్నీలనీ వూళ్ళో

తెలిసిన రైతుకి కౌలుకిచ్చేసి ముందుగా అత్తని వెంట బెట్టుకొని వచ్చేశారు. ఆరు నెలలుండి ఆమె వెళ్ళాక వరమ్మ వచ్చి పిల్లలిద్దర్నీ చూసుకునేది. ఆమోదని స్కూల్ బస్ యెక్కించడం, తిరిగి తీసుకురావడం నుంచి, హర్షకు కావాల్సినవి యేర్పాటు చేయడం దాకా పిల్లల పెంపకమంతా అమ్మమ్మ, నానమ్మలే చూసుకునేవారు. వీళ్ళిద్దరూ చెరో కారు వేసుకొని, చేరో వైపు వెళ్ళి రాత్రికెప్పుడో యిల్లు చేరి, అమ్మో, అత్తో వండింది తిని పడుకునే వాళ్ళు. కెనడాలో సెటిల్ అయిన లత తమ్ముడు నల్గొండకి చెందిన తన క్లాస్‌మేట్ అమ్మాయినే పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళకి కూడా వొక మగపిల్లాడు పుట్టడంతో భూలక్ష్మమ్మకి యిక యిండియా వెళ్ళే అవకాశం దొరకలేదు. అమెరికాలో ఆరు నెలలు, కెనడాలో ఆరు నెలల పిల్లల పెంపకం డ్యూటీలే సరిపోయాయి.

గత యేడాది జనవరిలో కౌలు డబ్బులు తీసుకొస్తానని వరమ్మ గొడవ చేయడం, వీసా కూడా ముగుస్తుండటంతో తెల్సిన ఫ్యామిలీ ఇండియా వెళ్తుంటే వాళ్ళకు తోడుగా వరమ్మని పంపించేశాడు. భూలక్ష్మమ్మని రమ్మని కబురు చేశారు.

యీలోపు కరోనా వైరస్ విజృంభించడంతో ప్రపంచ వ్యాప్తంగా లాక్‌డౌన్‌లు మొదలయిపోయాయి. యెక్కడి వాళ్ళు అక్కడ చిక్కుకు పోయారు. అమెరికా, కెనడాల్లో కూడా లాక్‌డౌన్ విధించడంతో వర్క్ టు హోంలు ప్రారంభమయ్యాయి. దాంతో భూలక్ష్మమ్మ రాకపోయినా పెద్దగా సమస్య కాలేదు. యీలోగా జార్జ్ ఫ్లాయిడ్‌ని పోలీస్ ఆఫీసర్ మోకాలితో మెడ మీద తొక్కి చంపడంతో అమెరికా వ్యాప్తంగా పెద్ద యెత్తున జాత్యంహకార వ్యతిరేక ఆందోళనలు చెలరేగాయి. వర్క్ టు హోంలో వున్న ప్రసాద్, లతలు పిల్లల్ని తీసుకొని ఆ ప్రదర్శనలో పాల్గొన్నారు.

లాక్‌డౌన్ ఫస్ట్ వేవ్ అయింది. ప్రపంచం కొద్దిగా తెరుచుకొంది. ఇండియా నుంచి పూర్తి స్థాయి ఫ్లయిట్స్ మొదలు కాకపోవడంతో వరమ్మ రావడం వాయిదా పడుతూ వస్తుంది. భార్యాభర్తలే వొకరు వుదయం, మరొకరు సాయంత్రం పిల్లల్ని పికప్ చేసుకోవడం ప్రారంభించారు. కానీ అది రోజు రోజుకీ కష్టంగా మారుతుంది. వరమ్మని యెలాగైనా తీసుకొచ్చేసేందుకు వెంకట్ ప్రయత్నాలు ప్రారంభించాడు. యింతలో రెండో వేవ్ మొదలయింది. వూహించని విధంగా రోజూ మనుష్యులు వుక్కిరిబిక్కిరై ప్రాణాలు పోతూనే వున్నాయి. ఆక్సిజన్ వుత్పత్తికి, రవాణాకి అధిక ప్రాముఖ్యత యిస్తూ పరిగెడుతోన్న వొక్కో ప్రాంతంకి చేరుకునే సమయానికి ఆక్సిజన్ లేక ప్రాణాలు అల్లాడిపోతున్నాయి. వెంటిలేటర్స్ కోసం, బెడ్స్ కోసం తట్టని ఫోన్ నెంబర్ లేదు. పోస్ట్ చెయ్యని సోషల్ మీడియా లేదు.

వొక రోజు అర్ధరాత్రి నిద్రపోతుండగా వెంకట్ సెల్ రింగయింది. లేచి వెంటనే ఫోన్ లిఫ్ట్ చేశాడు. అది వరమ్మ ఫోన్. మాట్లాడుతుంది మాత్రం ఆ వూళ్ళో వుండే నారాయణ రెడ్డి ట్రాక్టర్ డ్రైవర్. వరమ్మకి కరోనా వచ్చిందని, శ్వాస పీల్చుకోలేకపోతుందని, వెంటనే ఒంగోలు తీసుకెళ్ళాలని. అయితే ఒంగోలులో గానీ, పొదిలిలో కానీ యే ఆసుపత్రిలోనూ ఆక్సిజన్ లేదని కరోనా పేషంట్లని చేర్చుకోవడం లేదని చెప్పాడు. ఆక్సిజన్ దొరక్కపోతే వరమ్మకు తెల్లారడం కష్టమేనని చెప్పాడు. వెంకట్ ఫోన్ మాటలకు మెలకువ వచ్చిన లత కూడా ఆందోళనగా వినసాగింది.

"ఆక్సిజన్‌ను తాను యెలాగైనా యేర్పాటు చేస్తానని, అమ్మని కాస్త కనిపెట్టి చూడమని" చెప్పి ఫోన్ పెట్టేశాడు. లతకి విషయం చెప్పాడు.

వొక నిమిషం ఆలోచించిన వెంకట్ కి హైదరాబాద్‌లోని కొందరు "యెఫ్.బి." మిత్రులు వొక వాట్సఫ్ గ్రూప్‌ని యేర్పాటు చేసి ఆక్సిజన్, మెడికల్ యెయిడ్, ఫుడ్ లాంటివి యేర్పాటు చేయడం గుర్తొచ్చింది. వెంటనే ఆ గ్రూప్‌లో పోస్ట్ చేశాడు. అలా మరిన్ని ఫ్లాట్ ఫారంస్‌లో పోస్ట్ చేసాడు.

ఆ రాత్రి వేళ విశాల్ అనే అబ్బాయి స్పందించి "యేమి హెల్ప్ కావాలి" అని మెస్సేజ్ చేసాడు.

విశాల్‌కి డీటెయిల్స్ చెప్పి తమ వూరిలో వున్న తన అమ్మగారికి వొక ఆక్సిజన్ సిలండర్ చేరేలా చెయ్యగలరాని మెస్సేజ్ చేసాడు.

విశాల్ ప్రయత్నిస్తాను అని మెసేజ్ చేసాడు.

ఒంగోలులో వున్న వొక యాక్టివిస్ట్ మిత్రురాలు చిత్రలేఖకి ఫోన్ చేసి విషయం చెప్పాడు విశాల్.

"ఒంగోలులోనే కాదు, జిల్లా వ్యాప్తంగా యెక్కడా ఆక్సిజన్ దొరకడం లేదు. జిల్లాలోని కరోనా పేషెంట్లని గుంటూరులోని జి.జి.హెచ్.కి పంపుతున్నారు, అయినా డి.యెం. అండ్ యెచ్.వో.ని అడిగి చూస్తా"అని చెప్పింది. అన్నట్టుగానే చిత్రలేఖ ఫోన్ ద్వారా పలువురిని సంప్రదించింది. "యెక్కడా దొరకటం లేదు ఆక్సిజన్. అయినా ప్రయత్నం చేద్దాం" అంది చిత్రలేఖ.

చిత్రలేఖ యీ పనిని యెవరు చెయ్యగలరు అని ఆలోచించిందో క్షణం.

ఆమెకి జర్నలిస్ట్ శ్రీధర్ తట్టారు.

శ్రీధర్‌కి ఫోన్ చేసి విషయం చెప్పింది.

"ఆక్సిజన్ సిలెండర్ దొరకటం కష్టం. అయినా ప్రయత్నం చేస్తాను" అన్నాడతను.

శ్రీధర్ ప్రయత్నం చేస్తూ పొదిలిలో వున్న స్నేహితుడు రిపోర్టర్ గోపాలంకి చెప్పాడు.

దాదాపు రెండు గంటల తరువాత ఫోన్ చేసి "పొదిలి లో దొరికే అవకాశం లేదు. ఒంగోల్లో డొమస్టిక్ సిలెండర్స్ యిచ్చే వాళ్ళ దగ్గర ఖాళీ ఆక్సిజెన్ సిలెండర్స్ వున్నాయి. ఆ ఖాళీ సిలెండర్‌ని తీసుకొని వెళ్ళి ఫిల్ చేయించుకోవచ్చు" అన్నాడు గోపాల్.

"అంతా బానే వుంది కానీ ఆ ఖాళీ సిలెండర్ దగ్గరకి వెళ్ళి అక్కడ నుంచి ఆ ఫిల్లింగ్ పెర్సన్ దగ్గరకి వెళ్ళి ఫిల్ చేసేవారు యెవరు" అన్నాడు శ్రీధర్.

"నువ్వే" అన్నాడు గోపాలం.

"నేనా.. ?! అన్నాడు నీరసంగా శ్రీధర్.

"మరేం అనుకుంటున్నావు!? యెక్కడెక్కడ నుండో వో కాల్ చేసి ఆక్సిజన్నో, హాస్పిటల్లో వో బెడ్ యిలా హెల్ప్ అడుగుతారు. యిప్పటి పరిస్థితుల్లో యీ సహాయం చెయ్యటం అన్నది చాల పెద్ద సమస్య. మనసున్నా సరే శరీరం కదలాలి కదా బయటకి. మా ఆవిడ చాల గట్టిగా చెప్పేసింది బయటకు వెళితే యింక బయటే వుండమని. మెష్ కూడా లేదురా.. గ్రిల్ రూమ్.. కరోనా యేమో కానీ డెంగ్యూ వస్తుందిరా. యీ లాక్ డౌన్‌లో పని లేదని వుద్యోగమూ పీకేసి యింటికి పంపేసారు కదరా.. యింట్లో వాళ్ళ మాట వినాల్సిందే ప్రస్తుతం. మా నాన్న చెపుతూనే వున్నాడు గవర్నమెంట్ వుద్యోగం చూసుకోరా బతకలేక జర్నలిస్ట్ వుద్యోగమూరా అని. విన్నానా?! లేదు.. మా ఆవిడ ఆయన మాట వింది. నేనిప్పుడు ఆవిడ మాట వినాలి.."

"ఆపరా బాబు.. నే చూసుకుంటాను... యింట్లో యిలానే నాన్ స్టాప్‌గా మాటాడితే నిన్ను గ్రిల్ రూమ్‌లో వెయ్యటం తప్పదురా"

నవ్వుతూ అన్నాడు శ్రీధర్.

"యిల్లు కదలకుండా వున్న యీ జీవితమూ బాగుందిరా. యేమి మిస్ అవుతున్నట్టు లేదు. యిల్లు కదలకుండానే హాయిగా టీవీ, ఫేస్ బుక్, సినిమాలు చూసుకొంటూ శుభ్రంగా బతుకుతున్నాను. నన్ను వదిలెయ్రా.. అయినా యిలా వొకొక్కరం యెంతమందికి చెయ్యగలుగుతాం?! యిప్పుడు కాకపోతే యింకెప్పుడు బాధ్యత పడతాంరా బాధ్యత పడాల్సిన వాళ్ళు.?! పిట్టల్ల రాలిపోయే వరకూ మేల్కోర్రా.. ?! సరే నాకు తెల్సిన సోర్స్ చెప్పేసాను. నేనూ హెల్ప్ చేసానూ అని పోస్ట్ పెట్టుకోడానికి తప్పా నిజానికి నేను చేసింది యేముందిరా?! నిలదీయ్యాల్సిన వాళ్ళని నిలదీస్తూ వొక్క అక్షరం కూడా రాయని జర్నలిస్ట్ని" అన్నాడు గోపాలం.

శ్రీధర్కి గోపాలం పరిస్థితికి దిగులేసింది. గోపాలం అన్నిటి నుంచి దూరంగా జరుగుతున్నాడు. తరచూ మాటాడుతుండాలి అతనితో అనుకున్నాడు శ్రీధర్.

శ్రీధర్ తెలిసిన ఆటో డ్రైవర్ బద్రికి ఫోన్ చేసి విషయం వివరించాడు.

బద్రీ ఖాళీ సిలెండర్ తీసుకొని, అక్కడ నుంచి ఆక్సిజన్ నింపే చోటకి వెళ్ళాడు.

యీ లోగా బద్రికి డబ్బుల్ని ఫోన్ పే చేసాడు శ్రీధర్.

బద్రి ఆక్సిజన్ నింపే చోటుకి వెళ్ళేసరికి అక్కడ పెద్ద క్యూ వుంది. కాసేపు నిలబడి యిక్కడ యెక్కువ సేపు వుంటే తనకేమైనా వస్తుందేమోనని భయం వేసి శ్రీధర్కి ఫోన్ చేసి పరిస్థితి చెప్పాడు.

"బద్రీ, ఆక్సిజన్ ఆ పల్లెకి పంపటం చాల ముఖ్యం. త్వరగా పంపాలి కూడా. నువ్వు ఆ ఆక్సిజన్ అతని పేరు, ఫోన్ నెంబర్ తెలుసుకొని వెంటనే పంపు. అతనికి యెవరితోనైనా కాల్ చేయిస్తాను" అన్నాడు శ్రీధర్.

వో అరగంట తరువాత ఆ డీలర్ దుకాణంలో పనిచేసే వాళు ్ళ శ్రీధర్ చేయించిన ఫోన్ వల్ల లైన్ ని పట్టించుకోకుండా బద్రీ తెచ్చిన ఆక్సిజన్ సిలెండర్ నింపారు.

బద్రీకి ఆ సిలెండర్ ని పంపించాల్సిన అడ్రస్ యిచ్చాడు శ్రీధర్.

కరోనా పేషెంట్ అనగానే ఆ పల్లెకి వెళ్ళడానికి యెవ్వరూ ముందుకు రాలేదు.

చిత్రలేఖకి ఫోన్ చేసి శ్రీధర్ పరిస్థితిని వివరించి "పొదిలి వరకు ట్రాలీ ఆటోలో సిలెండర్ పంపిస్తాను. వరమ్మ గారి వూరి నుంచి యెవరైనా యేదైనా వెహికల్లో తీసుకెళ్ళాలి" అని చెప్పాడు.

చిత్రలేఖ విశాల్కి కాల్ చేసి శ్రీధర్ చెప్పిన విషయాన్ని చెప్పింది.

విశాల్ వెంటనే వెంకట్కు ఫోన్ చేసి విషయం చెప్పాడు.

ఆ సిలెండర్ని మెయిన్ రోడ్డు మీద ఆ పల్లెకి తిరగాల్సిన చోటు వరకూ చేరవేస్తే అక్కడ నుంచి తన తల్లిగారి వూరి వాళ్ళు పట్టుకొని వెళ్ళే యేర్పాటు చేస్తానని వెంకట్ చెప్పాడు.

సిలెండర్ కి అమర్చే ట్యూబ్ మిగిలిన పరికరాలు కూడా పంపమని వెంకట్ విశాల్కి చెప్పాడు.

వాటిని యేర్పాటు చేసి ఆ సిలెండర్ ని పంపాలని విశాల్ చిత్రలేఖ కి చెప్పాడు.

చిత్రలేఖ యీ మొత్తాన్ని శ్రీధర్ కి వివరించింది.

వెంకట్ తన వూరిలోని నారాయణ రెడ్డి కి ఫోన్ చేసి మెయిన్ రోడ్డు వరకూ మనిషిని పంపే యేర్పాటు చెయ్యమని కోరాడు.

"మంచి పని చేస్తున్నావయ్యా" అని నారాయణ రెడ్డి వెంకట్ని మెచ్చుకున్నాడు.

వెంకట్ రిక్వెస్ట్ చేయడంతో తమ ట్రాక్టర్ని డ్రైవర్ శివయ్యకిచ్చి పొదిలి పోయి గ్యాసు బండ తెమ్మని చెబుతానని హామీ యిచ్చాడు.

తమ వూరి అల్లుడు వాళ్ళ అమ్మకి ఆక్సిజన్ సిలెండర్ పంపుతున్నాడు అని తెలిసినా వొక్కరూ పరామర్శించడానికి రాలేదు.

నారాయణ రెడ్డి డ్రైవర్ శివయ్యని పిలిచి "ట్రాక్టర్ తీసుకెళ్ళి ఆక్సిజన్ సిలిండర్ రోడ్డు పక్కగా ఆటోలో వుంటుంది. దాన్ని వరమ్మ యింటికి తీసుకొని వెళ్ళు" అని చెప్పాడు.

ట్రాక్టర్ ఆ గతుకుల రోడ్డులో పడతా లేస్తా పొదిలి వెళ్ళి, పొదిలిలో వున్న పెద్ద సిలెండర్ని ట్రక్కులో వేసుకొని దాన్ని వరమ్మ యింటి ముందు దింపారు.

అక్కడ ఆక్సిజన్ పెట్టటం వచ్చిన వారు లేరనే విషయాన్ని వెంకట్కు ఫోన్ చేసి చెప్పాడు నారాయణ రెడ్డి.

తల పట్టుకున్న వెంకట్ మళ్ళీ విశాల్ కి ఫోన్ చేసి "అక్కడ యెవ్వరికీ ఆక్సిజన్ పెట్టటం రాదు" అని చెప్పాడు.

విశాల్ చిత్రలేఖకి ఫోన్ చేసి అదే విషయాన్ని చెప్పాడు.

శ్రీధర్కి చిత్రలేఖ ఆ విషయాన్ని చెప్పి "ఆక్సిజన్ పెట్టటం వచ్చిన వాళ్ళు యెవరినైనా చూసి పంపిస్తారా ప్లీజ్" అని అడిగింది.

శ్రీధర్ యేమాత్రం విసుక్కోకుండా పొదిలిలో వున్న గోపాలంకి మళ్ళీ ఫోన్ చేసి విషయం చెప్పాడు.

తనకు తెలిసిన ల్యాబ్ అసిస్టెంట్ ని యేటొడ్డున వూరికి వెళ్ళమని రిక్వెస్ట్ చేసాడు గోపాలం.

బండి మీద యేటొడ్డున వూరికి ల్యాబ్ అసిస్టెంట్ బయలుదేరి వరమ్మ యింటి ముందు ఆగాడు. తీసుకోగలిగినన్ని జాగ్రత్తలు తీసుకొని ల్యాబ్ అసిస్టెంట్ వరమ్మ యింట్లోకి వెళ్ళాడు.

వరమ్మ వూపిరి తీసుకోడానికి పడుతోన్న కష్టాన్ని చూస్తూ దూరంగా నిస్సహాయంగా నిలబడి వున్న శివయ్య కనిపించాడు. అతని పక్కనే ఆక్సిజన్ సిలెండర్.

వరమ్మ తన ఆఖరి శ్వాస కాబోతున్న వూపిరిని గట్టిగా పీల్చి ప్రాణాన్ని వీలైనంత గట్టిగా పట్టుకొంది.

శివయ్య, ల్యాబ్ అసిస్టెంట్ అన్నీ త్వరత్వరగా అమర్చారు.

ఆమె కొద్దిగా తనంత తాను శ్వాసించటానికి ప్రయత్నం చేస్తోన్నా ఆ ప్రయత్నం సాగటం లేదు.

"వెంటిలేటర్ కావాలి వెంటనే" అని ల్యాబ్ అసిస్టెంట్ గోపాలం కి కాల్ చేసాడు.

గోపాలం శ్రీధర్ కి కాల్ చేసి విషయం చెప్పాడు.

"సిలెండర్ పెట్టటం వచ్చిన వాళ్ళే లేని పల్లెలో వెంటిలేటర్ యెక్కడ దొరుకుతుంది?! మీకు వీలైనంతగా హెల్ప్ చెయ్యండి. అంబులెన్స్ యేమైనా దొరుకుతుందేమో చూడండి, యీ ఆక్సిజన్ సిలెండర్తో ఆమెని త్వరగా యెక్కడికైనా షిఫ్ట్ చెయ్యడానికి వీలవుతుందేమో చూడండి" అన్నాడు శ్రీధర్.

"ఛా.. యేమి జీవితాలు.. సమస్య వొస్తే తప్పా మన అభివృద్ధి యేమిటో అర్థం కాదు. పేరా మెడికల్ వాళ్ళు కూడా చాల వూళ్ళలో లేరు. వొక్కోరోజు గడుస్తుంటే మన అభివృద్ధి యెంత డొల్లో తెలుస్తుంది. ప్రపంచమంతా యీ పేండమిక్కి రెడీగా లేదు. మొదటి వేవ్లోఆక్సిజెన్ యిబ్బందులు లేవు. యీ సెకండ్ వేవ్లో ఆక్సిజన్ కావాల్సి వచ్చినప్పుడు

(మిగితాది 25వ పేజీలో...)

# గ్లోబల్ హిందుత్వను కూల్చివేద్దాం




ఇండియాలో హిందుత్వ ఫాసిజంపై అమెరికాలో ఏర్పాటు చేసిన ఒక సదస్సు అనేక విధాలుగా చర్చనీయాంశం అయింది. Dismantling Global Hindutva పేరుతో సెప్టెంబర్‌లో ఒక ఆన్‌లైన్ అధ్యయన సదస్సు జరగబోతోందన్న విషయం బైటికి రాగానే నిర్వాహకుల మీద, సదస్సులో పాల్గొనబోయే వక్తల మీద హిందూ అతివాదులు విరుచుకపడ్డారు. సోషల్ మీడియాలో వారిపై వేధింపులు, చంపేస్తామని బెదిరింపులు వెల్లువెత్తాయి. హార్వర్డ్, స్టాన్‌ఫర్డ్, ప్రిన్స్‌టన్ వంటి ప్రతిష్టాత్మక యూనివర్సిటీలతో పాటు 53 యూనివర్సిటీల నుండి వివిధ శాఖల ప్రొఫెసర్లు, వేరువేరు సామాజిక కార్యకర్తల బృందాలు, హక్కుల సంఘాలు కలిసి ఒక విస్తృత వేదికగా ఈ సదస్సు ఏర్పాట్లు మొదలైనంతనే దీనిని జరగనివ్వొద్దని, ఇందులో పాల్గొనబోయేవారిపై చర్యలు తీసుకొమ్మని లక్షాలాది ఈమెయిల్స్ ఆయా యూనివర్సిటీలకు, అధికార్లకు పంపారంటే హిందుత్వ ఫాసిస్టులకు ఎన్‌ఆర్‌ఐల్లో ఎంత పెద్ద మాఫియా ఉందో అర్థమవుతుంది. అయితే అంతే శక్తివంతంగా నిర్వాహకులు యూనివర్సిటీల్లో అకెడెమిక్ స్వేచ్ఛను కాపాడుకుందాం అనే నినాదంతో పెద్ద ఎత్తున మద్దతు కూడగట్టారు. సెప్టెంబర్ 10-12 తేదీల్లో సదస్సు విజయవంతంగా జరిగింది. ఆసక్తికరమైన చర్చలు చోటుచేసుకున్నాయి. దాని సంక్షిప్త నివేదికను అక్టోబర్ అరుణతారలో ప్రచురించాం. ఇప్పుడు మాకు లభ్యమైన ఈ మూడు ప్రసంగవ్యాసాలను సంక్షిప్తంచేసి ప్రచురిస్తున్నాం.

## 'సనాతన ధర్మం' నుండి 'సంఘ్ పరివార్' వరకు రాజకీయ హిందుత్వ పరిణామ క్రమం

### మీనా కందస్వామి

హిందుత్వ నిర్మాణంలోని మౌలిక అంశాలు ఏమిటి? దీనికి సంబంధించి రకరకాల దృక్పథాలు వుండి తీరుతాయి. అయితే దాని చుట్టూ అల్లుకున్న మార్మికతను తొలగించి, దాని అసలు స్వరూపాన్ని అర్థం చేసుకోవాలంటే, దాని నిర్మాణంలో, తాత్వికతలో, దైనందిన ఆచరణలో అంతర్లీనంగా వున్న, రెండు ప్రాథమిక అసమానతలను గమనించాలి. అవి : కుల అణచివేత, మహిళల అణచివేత. ఈ విషయాన్ని నేను ఒక మేధావిగా చెప్పడంలేదు. మహాత్మా జ్యోతిబా పూలే, విప్లవకారుడైన డా॥అంబేద్కర్, పెరియార్, ఈ మధ్యకాలంలో తిరుమావలవన్‌లు స్త్రీవాద, కుల నిర్మూలనా సంప్రదాయంలో భాగంగా చెప్తున్నారు. వీళ్ళందరూ హిందూ సామాజిక వ్యవస్థను లేదా హిందుత్వను కుల అసమానత, పురుష దురహంకారం అనే రెండు అంశాల మేళవింపుగా అర్థం చేసుకున్నారు.

దీన్ని మనం గ్లోబల్ హిందుత్వ అని ఎందుకు పిలుస్తున్నాం? హిందుత్వ, తనను ప్రభావితం చేసిన ఇటాలియన్ ఫాసిస్టులు, జర్మన్ నాజీలు, ఈ మధ్యకాలంలో డొనాల్డ్ ట్రంప్‌ల నుండి అనేకానేక అంశాలను స్వీకరించింది. సనాతన ధర్మంతో ప్రారంభమై, అక్కడి నుండి బ్రాహ్మణవాదంగా, హిందుత్వగా, విశాలమైన సంఘ్‌పరివార్‌గా అది చారిత్రకంగా పరిణామం చెందింది. జన్మరీత్యా అసమానత అనేది సనాతన ధర్మానికి మూలాధారమైన భావన. సనాతన ధర్మం నుండి రూపొందిన కుల తాత్వికత, పురుషాధిక్యతలను బ్రాహ్మణవాదం పేరుతో పిలుస్తున్నారు. ఒక నిర్దిష్టమైన ప్రజాసమూహం వైదికమతాన్ని ఎత్తిపడుతూ దాని భావజాలాన్ని బలపరుస్తోంది. బౌద్ధం, జైనంలాంటి మతాలు దైవిక మతాచార్యులు అనే భావనను వ్యతిరేకిస్తూ బ్రాహ్మణవాదానికి వ్యతిరేకంగా బయల్దేరాయి కాబట్టే హిందుత్వ శక్తులు వాటిని నాస్తిక మతాలుగా పిలుస్తున్నాయి. అయితే జనాభాలో మైనారిటీగా వున్న ఒక సమూహం తన ఆధిపత్యాన్ని కాపాడుకోవాలంటే ప్రజలందరినీ

సంస్కృతిపరంగానూ ఆధ్యాత్మికంగానూ ఒక విశాలమైన గొడుగు కిందకు తీసుకురావడం తప్పనిసరి. 'హిందూ' నిర్మాణం ఇది జరగడానికి అవకాశాన్ని కలిగించింది. అదే సమయంలో కుల పిరమిడ్‌లో అత్యున్నత స్థానంలో వున్న వ్యక్తులకు రక్షణను భద్రతను కూడా కలిగించింది.

ఆంతరంగిక శత్రువులను సృష్టించుకోవడం హిందుత్వకు ఎందుకు ప్రధాన అవసరంగా మారిందన్నది ప్రశ్న. ప్రపంచవ్యాప్తంగా ఇస్లాం వ్యతిరేక శక్తులతో అది ఎలా అలీనం కాగలిగింది? కాంగ్రెస్ పార్టీ బ్రిటీష్ వలసవాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్నప్పుడు, శత్రువు భౌతికంగా కనపడ్డాడు. అయితే సామ్రాజ్యవాదంలో శత్రువు భౌతికంగా ఉనికిలో వుండదు. ఉదారవాదం, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ వంటివి దేశాలమీద బలవంతంగా రుద్దబడతాయి. సామ్రాజ్యవాద దేశాలు మిగిలిన దేశాల విదేశాంగ విధానాన్ని, ఆర్థిక వాణిజ్య విధానాలను నిర్దేశిస్తాయి. పెట్టుబడిదారీ విధానం కారణంగా ఎంతో లాభం పొందుతున్న హిందుత్వ ఈ అంశాల గురించి మాట్లాడడానికి ఇష్టపడడం లేదు. హిందుత్వ నయా ఉదారవాదంతో అంటకాగుతుంది. అందర్నీ కలుపుకుపోయే జాతీయవాదాన్ని అది అప్రస్తుతం చేస్తుంది. ఒక ఆంతరంగిక శత్రువును- కొన్ని సందర్భాలలో ముస్లింలు కావచ్చు, మరికొన్ని సందర్భాలలో క్రైస్తవులు కావచ్చు- సృష్టించుకోవడమే దానికి ప్రధానం.

హిందువులను సమీకరించడం దాని వ్యూహం. అందుకోసమే అది మైనారిటీ సెంటిమెంట్‌ను ఉపయోగించుకుంటుంది. బ్రాహ్మణ-బ్రాహ్మణేతర, సవర్ణులు- దళితులు, బహుజనులు, ఆదివాసీల మధ్య వైరుధ్యం అనే అంశాన్ని వెనక్కి నెడుతోంది. హిందువులను ఒకే సమూహంగా సమీకరించడం ద్వారా, హిందుత్వ కారణంగా అత్యధిక ప్రయోజనం పొందే కొద్దిమంది శిష్టులైన బ్రాహ్మణులకు రక్షణ లభిస్తుంది. ముస్లింలు, క్రైస్తవులు కాకుండా భారతదేశంలో నివసిస్తున్న వారందర్నీ 'హిందూ' గొడుగు కిందకు తీసుకురావడానికి దానికి అభ్యంతరం లేదు. హిందూయిజానికి వ్యతిరేకంగా ప్రారంభమైన రాడికల్ మతాలన్నీ హిందూయిజంలో భాగమైపోయాయి. గ్రామదేవతలను అది తనలో సంలీనం చేసుకొన్నది. ఇలాంటి కుటిల ఎత్తుగడల ద్వారా బ్రాహ్మణులకు చెందిన, బ్రాహ్మణ ఆధిపత్యాన్ని ప్రకటించిన మతం, అత్యధిక ప్రజల మతంగా రూపొందేటట్లు చేయడానికి సంఘ్‌పరివార్ కృషి చేస్తోంది.

హిందూ మెజారిటీ జాతీయవాదానికి కులం పునాదిగా ఎందుకు తయారైంది? హిందూ మెజారిటీ జాతీయవాదాన్ని అభివృద్ధి చేసి, వ్యవస్థీకరించడానికి కుల ఉన్మాదం ప్రాథమిక అవసరం. సామాజిక న్యాయం అనే డిమాండ్‌తోపాటు, ప్రజలు భాష, తెగ, మతం వంటి అంశాల ఆధారంగా సమీకరించబడుతుంటే, దాని ఫలితంగా వ్యక్తిగతమైన, నిర్దిష్టమైన కుల అస్తిత్వాలు నీరుగారిపోతాయి. ఏ కులానికి ఆ కులం స్వతంత్రంగా కుల ఆధారంగా సంఘటితం కావాలని సంఘ్‌పరివార్ కోరుకుంటుంది. దీని మూలంగా కుల భిన్నత్వాలు తీవ్రమవుతాయి. కులం ఆధారంగా ప్రజలు విభజించబడతారు. అలాంటి పరిస్థితుల్లో వాళ్ళను హిందూ అస్తిత్వం కింద సంఘటితం చేయడం తేలిక అవుతుంది.

అందుకే ఒక స్త్రీవాదిగానూ, కుల వ్యతిరేక కార్యకర్తగానూ నేను కుల నిర్మూలన, స్త్రీ వాదాలు పరస్పరం పెనవేసుకుపోయాయని వాదిస్తాను. వాటికి మాత్రమే హిందుత్వను నిజంగా కూలగొట్టే శక్తి వుందని భావిస్తాను. కుల సెంటిమెంట్ ఎక్కడ అభివృద్ధి చెందుతుందో అక్కడ పురుష దురహంకారం బలపడుతుంది. కుల వ్యవస్థను కొనసాగించడానికి ఈ అణచివేత ముఖ్యం. అదేవిధంగా స్త్రీవాదులైన మహిళలు, విముక్త మహిళలు, స్వతంత్రంగా వుండే మహిళలు కులం తమపై మోపిన అణచివేతను తిరస్కరిస్తారు. ఈ మధ్యకాలంలో మనుస్మృతి గురించి తమిళనాడులో జరిగిన వివాదం హిందుత్వ శక్తులు ఎందుకు దానిని ఎత్తిపట్టాలని చూస్తాయో బహిర్గతం చేసింది. భాజపాను మళ్ళీ అధికారంలోకి తీసుకురావడం మాత్రమే హిందుత్వ లక్ష్యం కాదు. హిందూ మెజారిటీ జాతీయవాదాన్ని నిర్మాణం చేయడమనే ఒక రాజకీయ లబ్ధికోసమే అది హిందువులను సమీకరిస్తోంది. అలాంటి జాతీయవాదం మాత్రమే మైనారిటీల పట్ల ద్వేషాన్ని, మహిళల అణచివేతను, కుల అసమానతలను, దోపిడీ దౌర్జన్యాలను కొనసాగించడానికి ఉపయోగపడుతుంది.

హిందుత్వకు వ్యతిరేకంగా జరిగే ఈ విప్లవాత్మక పోరాటంలో అభ్యుదయ మేధావుల కర్తవ్యం ఏమిటి? ప్రతిదాన్నీ తాను దిగమింగి తనలో కలిపివేసుకునే హిందుత్వ ధోరణిని ప్రతిఘటించడమే మేధావుల కర్తవ్యం. ప్రతి చర్చనీయాంశాన్ని తనకు అనుకూలంగా మార్చుకోవడంలో సంఘ్‌పరివార్ విజయాన్ని సాధించగలిగింది. 'వలసానంతర' అనే భావనను ఒక రబ్బరులాగా అది ఎంతగా సాగదీసిందంటే చాలామంది సంఘీయులు- కులం బ్రిటీష్ సృష్టి అనీ, వలసవాద సామ్రాజ్య ఉత్పత్తి అని గర్వంగా చెప్పుకొంటారు.

వలసవాద విద్యావిధానాన్ని తిరస్కరించాలని, స్వదేశీ జ్ఞానాన్ని తిరిగి పునరుద్ధరించాలని సంఘ్‌పరివార్ ఇచ్చే పిలుపులు కుటిలమైనవి. వాళ్లే ఇతర దేశాలకు వలసపోవడానికి ముందు పీటీన నిలబడతారు. ఆయా దేశాల్లో తాము మైనారటీలమని చెప్పుకుంటూ భారతదేశంలో జరిగే కుల దాడులు, స్త్రీలపై జరిగే అత్యాచారాల సంస్కృతి వంటి అంశాలపట్ల వచ్చే విమర్శను అణచివేయడానికి ప్రయత్నిస్తారు. ఇప్పుడు వాళ్లు ఒక కొత్త పదాన్ని కనిపెట్టారు. అదే 'హిందూ ఫోబియా' అంటే హిందూ వ్యతిరేకత.

గ్లోబల్ హిందుత్వను కూలదోయాలనే లక్ష్యంతో ఈ సమావేశాన్ని నిర్వహిస్తున్న వ్యక్తుల, సంస్థల ధైర్యం అసమానమైనది. ఈ యుద్ధం నిరంతరం కొనసాగుతూనే వుండాలి. చివరగా నేను చెప్పదలచుకున్నదేమిటంటే హిందుత్వ ఉనికిలో వున్నంతకాలం కుల వ్యవస్థ, మహిళల అణచివేత కొనసాగుతూనే వుంటాయి. అందుచేత కులాన్ని నిర్మూలించకుండా మహిళల విముక్తిని సాధించకుండా పెట్టుబడిదారీ విధానాన్ని దృఢంగా సవాల్ చేయకుండా హిందుత్వను కూల్చలేం.

డా॥ అంబేద్కర్ అభిప్రాయాలను తిరుమవలవన్ 'హిందుత్వను వేళ్ళతో పెకిలించండి' అనే పుస్తక రూపంలో ప్రచురించారు. దాన్ని నేను అనువదించాను. అందులో ఆయన ఇలా అన్నారు. "విప్లవకారుడైన అంబేద్కర్ హిందుత్వకు వ్యతిరేకంగా అనేక కోణాల నుండి దాడిని ప్రారంభించారు. ఆయన రచనలను, ఉపన్యాసాలను ఒక వాక్యంలో సంక్షిప్తం చేస్తే అది ఇలా వుంటుంది: మనం హిందుత్వను వేళ్ళతో సహా పెకిలించాలి, మనం సమానత్వాన్ని సృష్టించాలి. హిందుత్వ సమానత్వానికి వ్యతిరేకం. అది ప్రజాస్వామ్యానికి వ్యతిరేకం. అందుకే మనం హిందుత్వను వ్యతిరేకించాలి."

(మీనా కందస్వామి చెన్నైకి చెందిన ప్రముఖ రచయిత్రి, సామాజిక కార్యకర్త, దళిత, స్త్రీవాద ఆలోచనాపరురాలు)

## నా హిందూయిజాన్ని వీధుల్లోకి తీసుకురావల్సిన అవసరం వుందని నేనెందుకు అనుకుంటున్నాను?

సునీత విశ్వనాథ్

రెండు మూడు సంవత్సరాల క్రితం ప్రొఫెసర్ రాజమోహన్ గాంధీ మహారాష్ట్రలోని పంచగనిలో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అందులో కోపోద్రిక్తుడైన ఒక యువకుడు నన్ను ఇలా సవాల్ చేశాడు. "మీ హిందూయిజాన్ని మీ ఇంట్లోనే వుంచుకోండి. దాన్ని వీధుల్లోకి తేవాల్సిన అవసరం మీకెందుకు వచ్చింది?" ఆ యువకుడు ఒక మితవాద హిందువై వుండవచ్చు. కులాన్ని, హిందుత్వను వ్యతిరేకించే అభ్యుదయకర హిందూ అస్తిత్వాన్ని గురించి నేను చేసిన ప్రసంగం అతన్ని గాయపరిచి వుండవచ్చు. లేదా అతడు ఒక లౌకికవాది అయిన భారతీయుడై వుండవచ్చు. నేను ఒక హిందువునని బహిరంగంగా చెప్పుకున్న కారణంగా నాలో కులతత్వం, మెజారిటీవాదం వుండి వుందని అతను అనుకొనివుండవచ్చు.

దానికి నా ప్రతిస్పందన : నేను హిందువును. సీతను, రాముడుని ప్రేమిస్తాను. అయితే "జై శ్రీరామ్" అనేది హంతకుల నినాదంగా మారింది. నా విశ్వాసాన్ని నా హృదయంలోనే వుంచుకోవాలని నేను కోరుకుంటాను. అయితే వాళ్లు వీధుల్లోకి వచ్చారు కాబట్టి నేను కూడా నా విశ్వాసాన్ని వీధుల్లోకి తేవాల్సిన అవసరం కలిగింది. అలా చేయని పక్షంలో నాకున్న ఒకే ఒక ప్రత్యామ్నాయం నా హిందూ అస్తిత్వాన్ని త్యజించడం. నేనలా చేస్తే ఆ హంతకులు విజయం సాధించినట్లే.

లోగడ, స్వామి అగ్నివేష్ మధురైలో ఒక సర్వమత సమ్మేళనాన్ని నిర్వహించారు. అందులో పాల్గొన్నవాళ్లు హిందూయిజం అనేది నిజంగా ఉనికిలో వుందా, అది మతమేనా అని చర్చించుకుంటున్నారు. విసుగువుట్టిన నేను ఇలా అన్నాను. "హిందూయిజం ఉనికిలో వుందా లేదా అని మనం చర్చించుకుంటూ వున్న సమయంలోనే, మనం ప్రేమిస్తున్న మన దేశాన్ని వాళ్లు హిందూ రాష్ట్రంగా మార్చివేస్తున్నారు".

హిందూయిజం అంతా హిందుత్వ కాదు. కాని హిందుత్వ ఖచ్చితంగా హిందూయిజానికి ఒక వ్యక్తీకరణ. హిందుత్వ వ్యవస్థాపకులు ఆధ్యాత్మిక వాదులు కారు. కాని వాళ్లు రాజకీయ చింతనాపరులు. అయితే వర్తమానంలో హిందుత్వను అంటిపెట్టుకున్నవాళ్లు హిందూ పరిధిలోనే పనిచేస్తారు. ఇదే హిందుత్వకు ప్రాణవాయువు.

హిందుత్వ తలెత్తడానికి పూర్వం హిందూయిజానికి వున్న ఘనతను తిరిగి తవ్వి తీయడానికి మేం ప్రయత్నించడం లేదు. ఇంతకుముందు వక్తలు సూచించినట్లుగా హిందూత్వ హిందూ సాంప్రదాయంలోని కులతత్వం, పితృస్వామ్యాలచేత ప్రభావితం చేయబడింది. అంతేగాక ఇరవయ్యో శతాబ్దపు యూరోపియన్ ఫాసిజం కూడా దాన్ని ప్రభావితం చేసింది.

డా॥అనంతానంద రామ్‌బచన్ చెప్పినట్లు "హిందువుగా జీవించడమంటే అర్థం తోటి మానవులను కించపరచడం కాదు". 1936లో డా॥అంబేద్కర్ ఒక ప్రసంగంలో ఇలా అన్నారు. "హిందువులు వాళ్ల మతానికి ఒక కొత్త సైద్ధాంతిక పునాదిని అందించాలి. ఆ పునాది స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలకు- ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజాస్వామ్యానికి- అనుగుణంగా వుండాలి." కాని ఒక్క మత నాయకుడు కూడా అంబేద్కర్ విసిరిన సవాల్‌ను సీరియస్‌గా పట్టించుకోలేదు. కాని ప్రస్తుతం హిందుత్వను ఓడించడం కోసం మనం అంబేద్కర్ విసిరిన సవాల్‌ను స్వీకరించాలి. కులాన్ని నిర్మూలించకుండా హిందుత్వను ఓడించలేం. కుల వ్యతిరేక కార్యకర్తలు చాలామంది నన్ను తరచుగా అడిగే ప్రశ్న ఒకటి వుంది. "కులాన్ని సృష్టించి నిరంతరం దాన్ని కొనసాగిస్తున్న మతం, సామాజిక న్యాయానికి ఎలా పునాది అవగలుగుతుంది?" నా మతంలో నా కమ్యూనిటీలో వున్న కుల, లైంగిక అన్యాయాలు నన్ను ఎప్పుడూ తీవ్రంగా బాధిస్తుంటాయి.

నేను విశ్వసించిన మత సంప్రదాయం నాలో మానవులందరూ ఒకటే, మనందరిలోనూ భగవంతుడు వున్నాడు అనే నమ్మకాన్ని కలిగించింది. దాని మూలంగానే నేను విముక్తం కాగలిగాను. మన సొంత నమ్మకాలకు, అభిప్రాయాలకు వ్యతిరేకంగా వున్నవాటిని పరిశీలించడానికి మనం ఎప్పుడూ సిద్ధంగా వుండాలి. "ప్రతివాళ్లని ప్రశ్నించు, ఎవ్వరినీ గుడ్డిగా అనుసరించవద్దు"అని బ్రహ్మచారి షరణ్ హిందూయిజాన్ని నిర్వచించారు.

అమెరికాలో రెండు అభ్యుదయకర కుల వ్యతిరేక హిందూసంస్థలున్నాయి. ఒకటి సాధన. రెండవది మానవహక్కులకోసం హిందువులు. (Hindus for Human Rights) ఈ రెండో సంస్థ కులాన్ని, హిందుత్వను వ్యతిరేకిస్తుంది. భారతదేశంలో మానవహక్కుల పరిరక్షణకోసం, మత స్వేచ్ఛకోసం తన గళాన్ని అందిస్తోంది. ఇంతవరకు హిందుత్వ అనుకూల సంస్థలు తమ గుత్తాధిపత్యం కింద వుంచుకున్న వేదికలమీదకు మేం కూడా వెళ్ళి సర్వమత సమ్మేళనంలో పాల్గొంటున్నాం. దళిత హక్కుల సంఘాలతో, పోరాటాలతో మా సంఘాలకు మిత్రత్వం వున్నది. 2019 సెప్టెంబర్‌లో హూస్టన్‌లో హౌడీ మోడీ సమావేశానికి నిరసనగా ఇతరులతో కలిసి మేము ప్రదర్శనలు చేస్తున్నప్పుడు నాతోపాటు ఎంతో మంది ముస్లింలు కూడా అందులో భాగస్వాములు కావడం నాకెంతో గౌరవాన్ని కలిగించింది. అదే సమయంలో అక్కడ ఒక్క హిందువుకూడా లేకపోవడం నాకు చాలా బాధకలిగించింది. అయినా నేను వుండాల్సిన చోటే వున్నానని గుర్తించాను. నన్ను నేను హిందువుగా పిలుచుకోవాలంటే ప్రపంచవ్యాప్తంగా అన్ని రకాల అన్యాయాలకి- నిర్దిష్టంగా హిందువులు అమలుపరిచే అన్యాయానికి- వ్యతిరేకంగా పోరాడటం తప్పనిసరని నేను గుర్తిస్తున్నాను.

శతాబ్దాలుగా కొనసాగుతున్న కుల అణచివేత కారణంగా మన మత సంప్రదాయాలు ఆ అణచివేతకు గురైన ప్రజల మనస్సుల్లో ఎంతటి విద్వేషాన్ని కలిగించాయో మనం అర్థం చేసుకోవాలి. వాళ్లతో చర్చించడం, వాళ్లను ఒప్పించడం కాదు మనం చేయాల్సింది. మన సంప్రదాయాల్ని సంస్కరించుకోవడం కోసం మనం తీవ్రంగా ప్రయత్నించాలి. మన విముక్తి మన సంఘటిత శక్తిలోనే వుంది.

(సునీత విశ్వనాథ్ హిందూస్ ఫర్ హ్యూమన్ రైట్స్, అమెరికా సంస్థకు సహ వ్యవస్థాపకులు.)

## హిందూయిజం అంతా హిందుత్వ కాదు కాని హిందుత్వ నిజానికి హిందూయిజమే

షానా సిప్పి, శైలజా కృష్ణమూర్తి

మేం కార్యకర్తలం, పరిశోధకులం. ఖచ్చితంగా మాలాంటి వాళ్లనే హిందూ మితవాదులు విమర్శిస్తుంటారు. స్త్రీవాద విమర్శనాత్మక

హిందూ అధ్యయనాల కలెక్టివ్ (Feminist Critical Hindu Studies Collective) సభ్యులంగా మేం 'హిందూయిజం' అనబడే మతం ఎలా నిర్మాణమైందో పరిశీలించడానికి కట్టుబడి వున్నాం. హిందూ వారసత్వానికి చెందిన సవర్ణ మహిళలుగానూ, మత అధ్యయనాల పరిశోధకులుగానూ మేం రాస్తుంటాం. గ్లోబల్ హిందుత్వను అర్థం చేసుకోవడంలో మా మననంలో మాటను మీ అందరితో పంచుకోవాలనుకుంటున్నాం.

ప్రపంచాన్ని అర్థం చేసుకునే మేథో దృక్పథాన్ని రూపొందించడంలో వలసవాదం, జాత్యహంకారవాదం నిర్వహించిన పాత్ర గురించిన ఎరుక మాకు వున్నది. జ్ఞానం ఎన్నడూ తటస్థంగా వుండదని మాకు తెలుసు.

హిందూయిజం హిందుత్వతో ఎలా లోతుగా పెనవేసుకుపోయిందో మాకు తెలుసు. 'హిందుత్వ హిందూయిజం కాదు' అనే మాటను ఈ సమావేశంలో అనేక పర్యాయాలు మేం విన్నాం. హిందూయిజం అంతా హిందుత్వ కాకపోయినప్పటికీ, హిందుత్వ నిజానికి హిందూయిజమే అని మేం నొక్కి చెప్పదలచుకున్నాం. హిందుత్వ అనేది గూఢ రూపంలో వున్న హిందూయిజం అని, అది చాలా శక్తివంతమైందని, దాన్ని ప్రచారం చేసేవాళ్లకు వాగ్ధాటి వుందని మనం గుర్తించాలి. హిందుత్వ, హిందూయిజం భిన్నమైనవని మనం భావించకూడదు. హిందుత్వ 'హిందూయిజం' ముసుగులో పేరులేకుండా కొనసాగుతోంది. అందుకే హిందూయిజం గురించి పరిశోధన చేసేవాళ్ళం, హిందూ సమూహాలలో నివసించేవాళ్లం, హిందూ సాంప్రదాయంలోని ఏయే అంశాలను 'హిందుత్వ హిందూయిజం' తనలో కలిపి వేసుకుందన్న దానిమీద లోతుగా అధ్యయనం చేయాలి.

'హిందుత్వ' అంటే సంస్కృతంలో కేవలం హిందువుగా జీవించడం అనిమాత్రమే అర్థమని వాదించే హిందువులు మాటల గారడీకి లోనవుతున్నారు. స్థల కాలాలను బట్టి పదాలకు అర్థాలు మారుతాయని వాళ్ళు గుర్తించాలి. హిందుత్వ అంటే హిందువుగా జీవించడమే అని చెప్పేవాళ్లు తమ రాజకీయాలను ముసుగుచాటున దాస్తున్నారు. వాళు చారిత్రక, రాజకీయ వాస్తవాలను పక్కనబెట్టి కేవలం మాటల వ్యుత్పత్తి అర్థాల గురించి మాత్రమే చెప్తున్నారు.

మత సంప్రదాయాలకు తప్పనిసరైన లక్షణాలు వుంటాయని మేం అనుకోవడం లేదు. అవి తమంతట తాముగా పనిచేస్తాయని కూడా, మత సంబంధిత అకడమిక్ పరిశోధనాకారులుగా మేం భావించడం లేదు. విశ్వవ్యాప్తంగా హిందూయిజాన్ని నెలకొల్పడమే హిందుత్వ నిర్దిష్ట లక్ష్యం. అది ఏ సందర్భంలోనైనా హిందూయిజం నుండి శక్తిని పొందుతుంది. కాబట్టి హిందువులుగా గుర్తింపు కోరుతున్నవాళ్లు లేదా హిందూయిజాన్ని ఆచరిస్తున్నవాళ్లు ఏదో ఒక రకంగా దానితో సంబంధంలో వున్నట్టే.

ప్రజలు జాతి గుర్తింపుతోపాటు మత గుర్తింపును కూడా కోరుకోవడం 'లౌకిక' ప్రజాస్వామ్యాల్లో సర్వసాధారణమైపోయింది. పౌర సమాజంలో, బహుళ సాంస్కృతిక వాతావరణంలో పనిచేయడానికి ఇలాంటి గుర్తింపు రాజకీయాలు ఒక మార్గంగా రూపొందాయి. హిందూ గుర్తింపును కలిగివుండడం భారతదేశంలో ఒకరకంగా వుంటే, బ్రిటన్, కెనడా, అమెరికా లేదా ట్రినిడాడ్‌లలో మరొకరకంగా వుంటుంది. అయితే వివిధ ప్రాంతాలమధ్య, సంస్కృతుల మధ్య వుండే భిన్నత్వాలను అధిగమిస్తూ ఒక సమష్టి హిందూ గుర్తింపు వుండాలనే భావన హిందూత్వకు సేవచేయడానికే ఉపయోగపడుతుంది. హిందూ అనే ఒక వ్యక్తిగత గుర్తింపు భావన ఈ మధ్యకాలంలో వలసవాదం, జాతీయవాదాల ఫలితంగా రూపొందించబడింది.

హిందుత్వం చెప్తున్న హిందూయిజం చాలా దురాశతో కూడుకున్నది. ప్రపంచవ్యాప్తంగా వున్న మిగిలిన అన్ని హిందూయిజాలని తన కౌగిలిలోకి తెచ్చుకోవాలని అది కోరుకుంటుంది. దీన్ని సాధించే క్రమంలో హిందుత్వ నాయకులు చెప్తున్న మాటలు వాస్తవాన్ని చిన్నబుచ్చుతున్నాయి. అది కేవలం హిందువులను మాత్రమేకాక ఇతర 'ధార్మిక మతాలకు' చెందినవారిని, సిక్కు జైనం, బౌద్ధ, దళిత క్రైస్తవులను కూడా తనలో కలుపుకోవడానికి ప్రయత్నిస్తున్నది. అది కులాన్ని పట్టించుకోనట్టు నటిస్తూ ఒక్కో సందర్భంలో ఒక్కోరకంగా మాట్లాడుతోంది.

హిందువులు, హిందూ జీవన విధానం ప్రమాదానికి గురవుతున్నాయని లేదా 'హిందూ ఫోబియా' అమలులో వుందని మాట్లాడుతున్న కాలంలో హిందుత్వ సంస్థలు మత సెంటిమెంట్లను, ఉద్రేకాలను వాడుకుంటున్నాయి. భయాన్ని రేకెత్తించడం ఒక సాధనం. తమ మతం, కుటుంబ సంప్రదాయాలు, పవిత్ర స్థలాలు, మత వారసత్వం ప్రమాదంలో పడ్డాయనే భావనను తిరిగి తిరిగి ప్రచారం చేయడం ద్వారా, ప్రజలు వాటిని కాపాడుకోవడానికి రంగంలోకి దూకుతారు. ఇలాంటి భయాన్ని రెచ్చగొట్టటానికి హిందుత్వ నాయకులు 'ఇతరుల'ను గుర్తించడం అవసరం. ఈ 'ఇతరులు' ఎవరు అనేది సందర్భాన్ని బట్టి మారుతుంది. ఈ సమావేశం నేపథ్యంలో 'ఇతరులు' అంటే అకడమిక్ మేధావులు. వాళ్ళ రోజువారి ఆచరణలో 'ఇతరులు' అంటే ముస్లింలు, దళితులు.

మత చిహ్నాలు, భాష, మత సంప్రదాయాలు వంటి మత ప్రచారానికి పనికివచ్చే సాధనాలన్నింటిని హిందుత్వ సంస్థలు ఎప్పటినుండో వాడుకుంటున్నాయని మాకు తెలుసు. హిందుత్వ శక్తులు చేసే హింసను మతం పేరిట, దేవుడిని పేరిట, పవిత్ర గ్రంథాల పేరిట ప్రచారం చేస్తే ఇతర హింసా రూపాలకు లేని న్యాయబద్ధత దానికి లభిస్తుంది.

హిందువులుగా గుర్తింపు పొందేవారు హిందుత్వను ఖండించాలంటే ఈ రకమైన రూపంలో వుండే హిందూయిజాన్ని ఖండించాలి. ఒకే మత గ్రంథంలోని అంశాలు ప్రేమకు పిలుపునిస్తున్నాయని ఒక సమూహం అనుకుంటుంటే అదే అంశాల ఆధారంగా మరో బృందం ద్వేషాన్ని ఎలా రెచ్చగొట్టగలుగుతుందో వీళు విమర్శనాత్మకంగా విశ్లేషించుకోగలగాలి. అంతేకాదు అణచివేతను, ప్రధాన స్రవంతి నుంచి దూరంగా నెట్టివేయడాన్ని, హింసను ప్రేరేపించడానికి చారిత్రకంగా ఉపయోగపడుతున్న కుల ఆధిపత్య సంప్రదాయానికి సంబంధించిన అన్ని అంశాలను వీళ్ళు తిరస్కరించాలి.

హిందుత్వ హిందూయిజం యొక్క ఒక రూపం అని మేమంటే మమ్మల్ని హిందూ ద్వేషులని నిందిస్తూ , సామాజిక మాధ్యమాల్లో మా మీద దాడులు చేస్తూ మమ్మల్ని చంపివేస్తామని బెదిరిస్తున్నారు. ఇలా చేస్తున్నారంటే అర్థం వాళ్ళ అభిప్రాయంలో హిందువులు అంటే తాము కోరుకుంటున్న తరహా ఆచరణలో వున్నవారు మాత్రమే. అదే హిందూయిజం.

హిందుత్వను నిజంగా సవాల్ చేయదలచుకుంటే మనం ముందుగా హిందుత్వ నిజానికి హిందూయిజమే అనే దాన్ని అంగీకరించి తీరాలి. హిందూయిజం విలక్షణమైనదేమీ కాదు. దాదాపుగా అన్ని

(మిగిలినది 49వ పేజీలో...)

# తెలుగు నవల వెనుక ఓ ప్రపంచం ఉంది

## అల్లం రాజయ్య ఇంటర్వ్యూ (రెండవ భాగం)

(గత సంచిక తర్వాత)

ప్రశ్న. 4. యూరప్‌లో పారిశ్రామిక విప్లవం - నవల అభివృద్ధికి మూలమైతే; భారతదేశంలో సామాజిక పరిణామక్రమం-నవల పరిణామం ఎలా ఉంది?

జ: భారతదేశంలో సామాజిక పరిణామక్రమం అంటే - భారతదేశ రాజకీయార్థిక, సామాజిక, తాత్వికంగా అర్థం చేసుకోవడం ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల ఘర్షణ-ప్రజా వర్గపోరాటాల నేపథ్యంలో అధ్యయనం చేయడం - అంటే భారతదేశ చరిత్రను గతితార్కికంగా అధ్యయనం చేయడం.

యేనాన్ క్యాడర్ల సభలో అధ్యయన పద్ధతుల గురించి చెప్తూ మావో "కొంత మంది పార్టీ సభ్యులు, సానుభూతి పరులు చరిత్ర అధ్యయనంలో పనిచేస్తున్నప్పటికి - గత వంద సంవత్సరాల చరిత్ర గానివ్వండి, పురాతన చరిత్రగానివ్వండి మన పార్టీ సభ్యులు అయోమయంలో ఉన్నారు" అంటాడు.

అలాంటి అయోమయం భారత చరిత్ర గురించి - పరిణామ క్రమం గురించి నేటిదాకా బూర్జువా పార్టీల్లో, కమ్యూనిస్టు పార్టీల్లో, మేధావులల్లో - ముఖ్యంగా రచయితలల్లో రకరకాలుగా కొనసాగుతోంది. ఇప్పటిదాకా ప్రతి భూర్జువా పార్టీ చరిత్రను తన కనుకూలంగా మార్చి ప్రచారం చేస్తోంది. ఈ కారణం చేతనే భారతదేశంలో నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమం దీర్ఘకాలిక ప్రజాయుద్ధంగా పరిణమించింది.

భారత చరిత్ర అనేక విద్రోహాలకు, విధ్వంసాలకు లోనయ్యింది. మూడు వేల సంవత్సరాల క్రితం భారతదేశంలోకి వచ్చి స్థిరపడిన ఆర్యులు అంతకు ముందటి చరిత్రను తుడిచిపెట్టి - వక్రీకరించి - పుక్కిటి పూరాణాలు ఇతిహాసాలు రాశారు. ఆ తరువాత బలపడిన బ్రాహ్మణీయ భూస్వామ్యం ప్రజల పోరాట చరిత్రను వక్రీకరించి - పురాణాలను మార్చుతూ కాలానుగుణంగా కొత్త వ్యాఖ్యానాలు చేరుస్తూ - తొలి భౌతికవాదులైన భౌద్ధం - చార్వాకం మీద తాము జరిపిన హింసాత్మక దాడిని కప్పిపుచ్చుకుంటున్నారు. అది నిరంతరాయంగా కాలానుగుణంగా ప్రక్షిప్తాల రూపంలో కొనసాగుతోంది. పదో శతాబ్దం నుండి భారతదేశంలో రాజ్యాధికారం స్థిరపర్చుకున్న ముస్లింలు, మొగలులు - ఇంచుమించు అదేపని చేశారు. ఇంగ్లీషువారు చరిత్రను ధ్వంసం చేయడమే కాదు - పూర్తిగా తమకనుకూలంగా వక్రీకరించారు. బ్రిటిష్ వారి ప్రభావానికిలోనైన తొలి సంస్కరణవాదులు - అదే ధోరణి అనుసరించారు... ఇప్పటిదాకా రకరకాల రూపాలల్లో - కొత్త భాషలో - పాలక వర్గాలు చరిత్రను వక్రీకరిస్తూనే ఉన్నారు...

ఈ ధోరణి ప్రజా పోరాటాలల్లో కూడా ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే ఉన్నది. అయితే - నిరంతరం కొనసాగుతున్న ప్రజాపోరాటాల ఆచరణ, అధ్యయనం-కొనసాగుతున్న తరుణంలో -ప్రజా పోరాటాలకు-ముఖ్యంగా ప్రజల గురించి రాసే రచయితలకు సరైన దృక్పథం లేకపోతే - టాల్‌స్టాయి లాగా ఉత్పత్తి శక్తుల దైన్యం మాత్రమే చిత్రించి స్వీయాత్మక ధోరణికి లోనై - వ్యక్తి వాదులుగా - చివరకు మతంలో కూరుకుపోయి నీరసపడుతారు.

భారతదేశంలో వచ్చిన నవలల తీరుతెన్నులు అర్థంకావాలంటే భారతదేశ గతి తార్కిక చరిత్ర అర్థం కావాలి.

మూడు దశలుగా చూడవచ్చు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్లాసీ యుద్ధం తరువాత నుండి 1857 వరకు భారతదేశం ఫ్యూడల్ సమాజం.

బ్రిటిష్ వారి ఆక్రమణ నుండి అధికార మార్పిడి ఆగస్టు 15, 1947 దాకా వలస సమాజం.

అప్పటి నుండి నేటిదాకా అర్థఫ్యూడల్ అర్థవలస సమాజం.

1757 నాటికి యూరప్‌లో పారిశ్రామిక విప్లవం కొనసాగుతున్న దశలో - ఈస్టిండియా కంపెనీ మసాల దినుసులు, నూలు, పట్టు వస్త్రాలు, లోహవస్తువులు-యూరప్‌కు తీసుకవెళ్లి అమ్మి డబ్బు సంపాదించడం, భారతదేశంలోని వస్తువులపై పంటలపై గుత్త వ్యాపారం చేసి లాభం పొందాలనేది ఆశయం. ఆ వస్తువులకు యూరప్‌లో గిరాకి ఉంది. అయితే ప్రతిగా భారతదేశానికి ఇవ్వదగిన వస్తువులేవి ఇంగ్లాండ్ దగ్గర లేవు. ఆఫ్రికా బానిసలను అమెరికా వలస దేశాలల్లో అమ్మగా వచ్చిన వెండి బంగారం మార్పిడితో ఈ వ్యాపారం తొలిదశలో జరిగేది. భారతదేశంలోని వెనుకబడిన భూస్వామిక పరిస్థితులను చూసి చౌకగా - ఏమియివ్వకుండా సంపాదించే మార్గాలు వెతికారు. 1760 నాటికి అనగా మూడు సంవత్సరాలు వెండి, బంగారం యివ్వకుండా అనేక కుట్రలు కుతంత్రాలతో వ్యాపారం చేశారు.

కేవలం పదిహేడు వందల డాలర్లతో భారతదేశానికి ప్రయాణం కట్టిన ఈస్టిండియా కంపెనీ ఇలాంటి అంతులేని దోపిడి పునాదిపైనే 18వ శతాబ్ది చివరలో ఇంగ్లాండ్ పారిశ్రామిక దేశంగా నిలదొక్కుకున్నది.

అప్పటికే ఇంగ్లాండ్‌లో భూస్వామ్య సమాజం చివరలో - తీవ్రమైన భూస్వామ్య పీడనకు వ్యతిరేకంగా రైతాంగం పెద్దఎత్తున తిరుగుబాట్లు చేశారు. ఫలితంగా భూస్వామ్యం పునాదులు కదిలిపోయాయి. ఈ పరిస్థితుల్లో అప్పటికే ఏర్పడిఉన్న బూర్జువా వర్గం ఖచ్చితమైన భూస్వామ్య వ్యతిరేక వైఖరి తీసుకున్నది. ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం వహించింది. ఫలితంగా బ్రిటన్‌లో పెట్టుబడిదారి సమాజం ఏర్పడింది.

ఫలితంగా ఉత్పత్తి సంబంధాలల్లో మార్పులు చోటుచేసుకొని ఉత్పత్తి శక్తుల వికాసం మూడు దశల గుండా జరిగింది. మొదటి దశ సరళ, సహకార దశ విడివిడిగా ఉన్న కార్మికులను ఒక దగ్గర చేర్చింది. ఈ మార్పు రెండవ దశ కార్ఖానా ఉత్పత్తికి దారితీసింది. కార్మికుల నైపుణ్యం గణనీయంగా ఈ మార్పు పెంచింది. ఇక మూడో దశ అయిన యంత్ర ఉత్పత్తికి దారితీసింది. ఉత్పత్తి శక్తుల వికాసంతో ఉ

త్పత్తి గణనీయంగా పెరిగింది. శాస్త్రీయ విజ్ఞానం పెరిగింది. ఫలితంగా అమ్మకపు సరుకుల ఉత్పత్తి పెరిగి మార్కెటు విస్తరణకు దారితీసింది.

ఈ విధంగా భూర్జువా వర్గం చారిత్రికంగా ఒక విప్లవాత్మకమైన పాత్ర పోషించింది. భూస్వామ్య, పితృస్వామ్య సెంటిమెంటల్ సంబంధాలు పోయాయి. కొందరు పుట్టుకతోనే అధికులమనే భూస్వామ్య భావనలను నాశనంచేసి మనిషికి మనిషికి మధ్య ఉన్నది - స్వప్రయోజనం, డబ్బు లావాదేవీలేనని నిరూపించింది. మత పారవశ్యాన్ని, వీరుల సాహసాలను, ప్రశాంత జీవితాల 'నేను ముఖ్యం' వంటి భావాలకు కాలం చెల్లింది. వ్యక్తుల మధ్య సంబంధాలను వస్తు మార్పిడి సంబంధాలుగా మార్చింది. ఉత్పత్తి శక్తుల్లో, ఉత్పత్తి సంబంధాలల్లో పాత భూస్వామిక భావజాలంలో విప్లవాత్మకమైన మార్పులు తేవడం వలన పెట్టుబడిదారి సమాజం నిలదొక్కుకున్నది. పారిశ్రామిక విప్లవం ఫలితంగా, బ్రిటన్‌లో గ్రామీణ లక్షణాలు రూపుమాసి పట్టణాల సంఖ్య పెరిగింది.

ఒక బలీయమైన పారిశ్రామిక వర్గం బ్రిటన్‌లో ఏర్పడడంతో 1857 నాటికి బ్రిటిష్‌వాళ్లు భారతదేశం మీద పూర్తిగా పట్టు సాధించారు. భారతదేశంలో పరిపాలనా నిర్వహణపైన, విధానాలపైన ముఖ్యమైన ప్రభావం పడ్డది. ఈ వర్గం అంతవరకు ఈస్టిండియా గుత్త వ్యాపారం మీద పారిశ్రామిక వర్గం దాడిచేసింది...

ఫలితంగా లాభాలు వ్యాపారం నుంచికాక సరుకుల ఉత్పత్తి కావడంచేత - ఇండియా నుండి అంతవరకు దిగుమతి చేసుకుంటున్న వస్తువుల దిగుమతి ఆగిపోయి - ముడి సరుకుల దిగుమతికి మారింది.

భారతదేశంలో మొగలుల కాలం నుండి అభివృద్ధి చెందిన దేశీయ పరిశ్రమలు దెబ్బతిన్నాయి.

భారతదేశంలో ఏదేశంలో లేని విధంగా కుల వ్యవస్థ అతి పురాతనమైనది అభివృద్ధి నిరోధకమైంది - హింసాత్మకమైంది. భారతదేశంలో జరిగిన అనేక పోరాటాలు - దండయాత్రలు - పరిణామాలల్లో కూడ కులం తన స్వరూపాన్ని మార్చుకుంటూ కొనసాగుతూ వస్తున్నది. ఆరు కూలాచారాలు - 1) పుట్టుకతో కులం, 2) పుట్టుకతో కుల వృత్తి, 3) పుట్టిన కులంలోనే కంచం పొత్తు, 4) పుట్టిన కులంలోనే మంచం పొత్తు, 5) కుల పంచాయితీలు, 6) కులవెలి లాంటి కుల కట్టుబాట్లు అన్నికాల మార్పుల్లోను కొనసాగుతూవచ్చాయి.

♦ కుల వ్యవస్థ శ్రమ విభజనేకాదు, శ్రామికుల విభజన చేసింది. ఈ విధంగా కులం ప్రపంచంలో ఎక్కడ లేని విధంగా వర్గ ఉత్పత్తి సంబంధాల్ని విభజించే విప్లవ ప్రతిఘాతుక, ప్రతిబంధక పాత్ర వహించింది.

♦ సంపదను, శ్రమను కులాల వారిగా విభజించి - శ్రామికులైన శూద్రులకు, దళితులకు సంపద లేకుండా చేసింది. శ్రమ దోపిడిలో లభించే అధనపు విలువను - అగ్రకులాలు కొల్లగొట్టాయి.

♦ పితృస్వామిక సమాజం మూలకంగా - జనాభాలో సగభాగమైన మహిళల పట్ల అత్యంత క్రూరంగా హింసాత్మకంగా వ్యవహరించి వారికి ఆస్తి హక్కులో భాగంలేకుండా చేసింది.

♦ ఉత్పాదనా వస్తువుల కులాల వారి అసమాన పంపిణీ మూలకంగా అగ్ర కులాలకు లాభం, కింది కులాల వారికి నష్టం కలిగించింది, ఫలితంగా శ్రామికులైన కింది కులాలకు పెట్టుబడి సమకూరలేదు.

♦ ఇలాంటి నికృష్టమైన దోపిడి పీడనకు నిలయాలుగా - అభివృద్ధి నిరోధకంగా భారతీయ గ్రామాలు మహిళలు దళితులు, వృత్తి పనివారి కాన్‌సంట్రేషన్ క్యాంపులుగా గ్రామాలలో చిన్న చిన్న మార్పులతో, సంస్కరణలతో కొనసాగుతున్నాయి.

♦ విరుద్ధ శక్తుల మధ్య ఐక్యత, పోరాటం నిచ్చెన మెట్ల కుల వ్యవస్థ నియంత్రించి ప్రతిష్టంభనకు లోను కావడంతో పాటు పరిమాణాత్మకమార్పు గుణాత్మక మార్పుగా పరిణమించకుండా నిరోధించింది. అంతర్గత సంఘర్షణాత్మక కులాల మధ్య పోరాటాలు వర్గ పోరాటాలు గతితార్కిక క్రమానంతటిని దీర్ఘకాలం ప్రతిష్టంభనకు గురిచేసింది.

♦ ఉత్పత్తి విధానం ద్వారా కలిగిన హేతుబద్ధ జ్ఞానాన్ని - ప్రజలు సమిష్టి ఆచరణ ద్వారా అభివృద్ధి చేసుకునే ఐక్యత, ఘర్షణ నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ - కుల - ఉపకుల వ్యవస్థ అడ్డంకిగా పరిణమించింది... ఇలాంటి జ్ఞానాన్ని పూర్వపక్షంచేసి - హింసాత్మకంగా అణచివేసి - భావవాద పుక్కిటి పురాణాలు పెద్దఎత్తున ప్రచారం చేసుకోవడం - సమస్త సంపదలు హస్తగతం చేసుకోవడం - శూద్రులు, పంచములు, మహిళలు ఆస్తి, సంపదలు కలిగి ఉండడం పాపంగా బ్రాహ్మణీయ భూస్వామ్యం ప్రచారం చేసి అణచివేత ద్వారా ఆధిపత్యం కలిగిఉన్నది.

♦ ఇలాంటి భూస్వామ్య వ్యవస్థకు లొంగని ఆదివాసీ సమాజాల మీద, అనేక స్థానిక తెగలను అణచివేయడం, సామ్రాజ్యంగా విస్తరించడం - వేద కాలం నుండి - జరుగుతూవస్తున్నదే - లొంగని వారిని, ఓడిపోయిన వారి సమస్త సంపదలు హస్తగతం చేసుకోవడం - హీన కింది కులంలో చేర్చడం - భారతీయ బ్రాహ్మణీయ భూస్వామ్యం అనుసరించింది.

♦ లోకాయతులు, చార్వాకులు, బౌద్ధులు బ్రాహ్మణీయ కుల సమాజాన్ని వ్యతిరేకించారు - ఉత్పత్తి, పంపిణీ కుల ప్రాతిపదికగా కాకుండా అందరికి చెందాలని పోరాడారు. వీరిని అత్యంత క్రూరంగా హింసాత్మకంగా అణచివేశారు. బౌద్ధులుగా అణచివేతకు గురైన వాళ్లంతా అప్పటికి రైతులు, చేతివృత్తుల వాళ్లు, దళితులు - వేలాది మంది ఆదివాసీ ప్రాంతాలకు పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు... బ్రాహ్మణీయ భూస్వామ్యం - హిందూ మతాన్ని కుల ప్రాతిపదికగా పకడ్బందీగా తయారుచేసింది. ముఖ్యంగా గ్రామాలల్లో భూమిపైన అధికారం రైతులకు లేకుండా - రకరకాల పద్ధతుల ద్వారా ఆ హక్కు అగ్రకులాలైన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులకు చెందే విధంగా అమలుచేశారు. బౌద్ధం విదేశాలకు తరలిపోయింది...

అగ్రకులాలకు - కింది కులాలకు సంధానకర్తగా - అగ్రకులాలకు నమ్మిన బంట్లుగా - కుల గురువులను సుమారు తొమ్మిదవ శతాబ్దం వరకు ఏర్పాటు చేశారు.

♦ ప్రపంచ వ్యాప్తంగా శ్రమ విభజన, సంపద విభజన వర్గ ప్రాతిపదికన జరిగితే కుల ప్రాతిపదికన భారతదేశంలో బలవంతంగా, హింసాత్మకంగా జరుపడం మూలకంగా - అలాంటి నిర్మాణ రూపాలైన గ్రామాలు - అందులో నివసించే ప్రజలు నిరుపేదలుగానే మిగిలిపోయారు. గ్రామంలోని ఉత్పత్తి మొత్తం అగ్రకులాలు రకరకాలుగా హస్తగతం చేసుకున్నారు.

♦ వర్గ ప్రాతిపదికగా శ్రమ, సంపద విభజన జరగకపోవడం వలన - కుల ప్రాతిపదికగా జరగడంవలన, వృత్తిపనివారు అత్యంత

నిరుపేదలుగా, వెట్టి పనివారుగా ఉండటం మూలకంగా - యూరప్‌లోలాగా పెట్టుబడికి మూలమైన అదనపు విలువ - సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి - జరుగలేదు.

♦ ఉత్పత్తి ప్రక్రియలో ఏర్పడే మానవ సంబంధాలు అంతకన్నా ఉన్నత రూపం తీసుకొని సమిష్టి సంబంధాలుగా- గతితార్కిక జ్ఞానంతో ఎదిగి అత్యంత క్రూరమైన భూస్వామ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు చేయలేదు. ఉత్పత్తి శక్తుల అతి పురాతన తిరుగుబాటు వ్యక్తరూపం నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలో - వారిలో వారు కుమ్ములాడుకునే అంతర్గత ఘర్షణలకే పరిమితమయ్యాయి. ఫలితంగా ఘర్షణ వర్గపోరాటంగా ఉన్నత రూపం తీసుకోవాల్సిన గుణం కోల్పోయి, విధ్వంసకర, వినాశకర గ్రామీణ యుద్ధరంగంగా గ్రామాలు మారిపోయాయి.

♦ గ్రామం బ్రాహ్మణీయ భూస్వామ్యపు రాజ్య వ్యవస్థకు ప్రాథమిక యూనిట్‌గా మారిపోయింది... గ్రామంలోని శ్రామికుల ఉత్పత్తి సొంతం కొల్లగొట్టిన రాజ్యం సోమరిపోతుగా - భావవాదంతో అంతర్జాతీయ సమాజంలో లాగా ఘర్షణలలో - విజ్ఞాన శాస్త్రంలో - ఆరితేరలేదు... అందుకే అనేక దండయాత్రలకు లోనుకావడమేకాకుండా - గ్రామ వ్యవస్థ మీద పట్టుకోల్పోకుండానే - ఇతర గెలిచిన రాజులతో కలిసిపోయే ద్వంద ప్రవృత్తి బ్రాహ్మణీయ భూస్వామ్యానికి అలవడింది.

♦ కర్మ సిద్ధాంతంలో - గ్రామ సమాజం - పునర్జన్మ స్వకృతం వలన గ్రామంలో కులాల స్థితి ఏర్పడిందనీ - సమాజ నీతికి లొంగిఉండాలని - పుట్టిన కులాన్ని బట్టి పనులు చేయాలనీ కుల నియమ నిబంధనలు పాటించాలని - చేసిన పనులబట్టీ వచ్చే జన్మలో కుల స్థితి ఉంటుందని, నమ్మబలికారు... తీవ్రమైన దోపిడి, హింసలు చేస్తున్న అగ్రకులం పనులన్ని దైవ కృపగా - సంకల్పంగా చిత్రించారు... తీవ్రమైన అంతర్గత శిక్షలతో - గ్రామం ఒక నికృష్ట యూనిట్‌గా మిగిలిపోయింది.

♦ భారతదేశం మీద దండయాత్రలు చేసి ఆక్రమించుకున్న ముస్లింలు - మొగలులకు - ఇది సుళువైన రాజకీయ వ్యవస్థగా - అతి పురాతన వ్యవస్థగా - ఏకాకి యూనిట్లుగా ఉన్న గ్రామాలు - తమ అధికారానికి ముప్పుతెచ్చేవిగా కన్పించలేదు. గ్రామాలను - కులాన్ని యథాతథంగా ఆమోదించారు. బ్రాహ్మణీయ గురువులు, బ్రాహ్మలు వాళ్ల సంస్థానాలల్లో ఉన్నత పదవులు చేపట్టారు. అక్బర్ లాంటి వాళ్లు అతి పురాతన గ్రామీణ వ్యవస్థను కదిలించి ప్రాథమిక పెట్టుబడిదారి ఉత్పత్తిని చేపట్టకపోతే ప్రమాదమని గ్రహించి - భూమి హక్కు, సర్వే - పరిశ్రమలు - విద్య లాంటి విషయాల్లో సంస్కరణలు ప్రవేశపెట్టారు... ఫలితంగా తీవ్రమైన ఘర్షణలు ఆరంభమయ్యాయి.

అప్పటికే - పన్నెండవ శతాబ్దం నుండి యూరప్‌లో పోరాడుతున్న రైతాంగం - చేతి వృత్తులవారు గణనీయ శక్తిగా ఎదిగే క్రమం - భారతీయ భూస్వామ్యంలో రకరకాల భయ ప్రకంపనాలు రేకెత్తించింది..,

అనేక కారణాలతో భారతదేశంలోని గ్రామాలల్లోని. శ్రామిక వర్గం - ప్రపంచ శ్రామిక శక్తులకన్నా అనైక్యంగా అశాస్త్రీయంగా వెనుకబడి ఉన్నది. వ్యాపారం కోసం బ్రిటిష్ వారు భారతదేశంలో ప్రవేశించే నాటికన్నా ముందు పరిస్థితి.

మొదటిదశ బ్రిటిష్ వారి ప్రవేశం, సిపాయి తిరుగుబాటు కన్నా ముందు పరిస్థితులు:

భారతదేశంలో అమల్లో ఉన్న రకరకాల సాంప్రదాయిక భూమి వ్యవస్థల స్థానంలో - జమిందారీ, రైత్వారీ విధానాలు బ్రిటిష్ వారు ప్రవేశపెట్టారు. భూమిపైన స్వంత ఆస్తి హక్కు అనే ఒక కొత్త రూపాన్ని సృష్టించారు. ఈ కొత్త సృష్టివలన వచ్చే లాభం రైతుకు చేరకుండా చేశారు. ఇప్పుడు భూమిని అమ్ముకోవచ్చు, బదిలీచేయవచ్చు -తాకట్టుపెట్టవచ్చు, ప్రభుత్వ నికర రెవెన్యూ వసూలు కోసం ఈ నిబంధనలు - రెవెన్యూ చెల్లించలేక రైతులు భూములు అమ్ముకున్నారు. అదికూడ అదివరకే రెవెన్యూ వసూలు, పరిపాలన సంబంధిత శాఖలల్లో ఉన్న అగ్రకులాలకు - కొద్ది మంది శూద్రులకు భూమి హక్కు వచ్చింది. క్రమంగా వీళ్లు అగ్రకులంగా మారిపోయారు. రెడ్డి, వెలమ లాంటి వాళ్లు.

భూమిని అమ్ముకునే, కొనుక్కునే సరుకుగా మార్చడం ద్వారా దేశంలోని వ్యవసాయిక వ్యవస్థలో ఒక ప్రాథమిక మార్పు జరిగింది. భారతదేశ అతి పురాతన గ్రామాల నిలకడ, స్వయం ప్రతిపత్తి దెబ్బతిన్నాయి. పాలన గ్రామీణ సమాజం కట్టడం కూలిపోయింది. దళితులు, మహిళలు భూమిలేని వాళ్లుగా మిగిలిపోయారు.

బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన శాశ్వత జమీందారీ శాసనం, వలననూ, రైత్వారీ విధానం వలననూ అప్పటివరకు గ్రామ ఉమ్మడి సొత్తుగా ఉన్న సాగుభూమి క్రమక్రమంగా పన్నులు వసూలు చేసే అగ్రకుల జమీందార్లకూ, వడ్డీ వ్యాపారుల చేతుల్లోకి పోయింది. కోట్లాది మంది రైతులు ఉపాధి పోయి గ్రామీణ అదనపు జనాభాగామారిపోయి వ్యవసాయరంగం సంక్షోభంలోపడింది. కుల ప్రాతిపదికగా ఉత్పత్తి వనరులైన భూమి పరికరాలు అగ్రకులాల చేతుల్లోకిపోయాయి. పితృసామ్యం వలన వ్యవసాయంలో ఉన్న ఎక్కువ మంది మహిళలకు భూమి దక్కలేదు.

మహిళల పట్ల సాంఘీక దురాచారాలు రద్దుచేస్తూ చట్టాలు తెచ్చారుకాని - వారు రైతులైనా కూడా భూమి హక్కు కల్పించలేదు... అగ్రకులాల మేధావులు వీటికి పొంగిపోయారు. శిస్తు వసూలుదారులు అప్పటి దాకా గ్రామీణ అధికారులుగా ఉన్నవారు మాయోపాయాలతో భూములు ఆక్రమించి - వ్యవసాయ కుటుంబాలైన రెడ్డి, వెలమ లాంటి వారు అగ్రకులాలుగా అవతారమెత్తారు.

వ్యవసాయంపై ఆధారపడి బతికే గ్రామీణ చేతివృత్తులు - వ్యవసాయ సంక్షోభం వలన ఒడిదుడుకులకులోనై - బ్రిటిష్ సరుకుల దాటికి కుప్పకూలాయి. నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలోని అగ్రకులాలకు రకరకాలుగా భూమిదక్కింది... దళితులు మరింత పేదవాళ్లుగానే మారారు.

ఈ విధంగా బ్రాహ్మణీయ కుల వ్యవస్థ బ్రిటిష్ వారితో కలిసిపోయి విస్తరించి కొత్తరూపు సంతరించుకున్నది. అతిప్రధానమైన చేనేత పరిశ్రమ దెబ్బతిని - అప్పటికే వ్యవసాయం దెబ్బతిని కూలీలుగా మారిన వారికి తోడయ్యారు. బతుకు తెరువుకోసం ఒక ఊరి నుండి మరొక ఊరికి వలసలు పోయారు. దీని మీద పన్ను విధించారు. క్రమంగా గ్రామాలు ఖాళీ అయి పట్టణాలు పెరగడం ఆరంభమయింది. కనీస జీవన అవసరాలు తీరని వాళ్లు లక్షలాది మంది కరువు వాతబడి మరణించారు.

సైన్య సహకార విధానం కింద 1853 జూలై నాటికి సుమారు స్వదేశీ సంస్థానాలు బ్రిటిష్ వారికి మిత్రుల హెూదాపోయి - రకరకాల షరుతుల కింద ప్రభుత్వ ఆశ్రితులుగా మారారు. 1848-54 అనేక

స్వతంత్ర సంస్థానాలను బలత్కారంగా బ్రిటిష్ వారు కలిపేసుకున్నారు.

1833లో భారతీయ న్యాయ చట్టాన్ని క్రోడీకరించి - మెకాలే అధ్యక్షతన - ఒక సంఘం - భారత చట్టాలుగా - భారతీయ ప్రజలను తమకనుకూలురుగా మార్చుకోవడానికి పాశ్చాత్యతరహా సివిల్, క్రిమినల్ చట్టాలు తెచ్చారు. అవి ఇప్పటికి కొద్ది మార్పులతో కొనసాగుతున్నాయి. క్రైస్తవ మతాన్ని - పెద్ద ఎత్తున ప్రచారం చేశారు.

దాదాపు ఒక వంద సంవత్సరాల నుండి భారతదేశంలోని అంతర్గత వైరుధ్యాల ఆసరాతో - ఒక్కొక్క ముక్క జయిస్తూ వచ్చారు. భారతదేశంలోని అన్ని రకాల ప్రజల్లో అసంతృప్తి, ద్వేషం పెరిగింది...

అప్పటికే ఉత్పత్తి శక్తులు భరించజాలని భారతదేశ ఫ్యూడలిజం మీద - ఆ తరువాత బ్రిటిష్ వారితో పోరాడుతూనే ఉన్నారు. ముఖ్యంగా కొన్ని సంస్థానాలు - ఆదివాసీ తెగలు నిరంతరం ఈ పోరాటాలలో అసంతృప్తిగా ఉన్నారు.

1816 నుండి 1832 దాకా కచ్ తిరుగుబాటు, 1831 కోల్ తిరుగుబాటు, చోటా నాగపూర్ 1855 బీహార్ బెంగాల్ సంతాల్ తిరుగుబాటు లాంటివి అనేకం నిరంతరం జరుగుతూనే ఉన్నాయి.

మొదటి అఫ్ఘన్ యుద్ధం (1838-42) పంజాబు యుద్ధం (1845-49) క్రిమియా యుద్ధం (1854-56) బ్రిటిష్ ప్రభుత్వాన్ని తుదముట్టించాయి. బ్రిటిష్ వాళ్లు అంతిమ విజయం సాధించినా - ఏకమై పోరాడితే - బ్రిటిష్ వారి ఓటమి ఖాయమని - భావించారు.

పైగా బ్రిటిష్ సైన్యం మూడు లక్షల పదకొండు వేలలో, రెండు లక్షల అరువై ఆరు వేల భారతీయ సైనికులు - సైనికులు, సుబేదారి స్థాయిదాకా పనిచేస్తున్నారు. బ్రిటిష్ సైనికులకన్నా - అధికారులకన్నా ఎన్నోరెట్లు తక్కువ జీతాలు - భారతీయ సైనికులకివ్వడం తీవ్ర అసంతృప్తికి కారణమైంది. సైనికులలో ఎక్కువ భాగం కింది కులాల వాళ్లు. కుల వివక్షత సైన్యంలోను ఉండేది.

1857లో ఉత్తర, మధ్య భారతదేశంలో ఒక ప్రచండమైన ప్రజా తిరుగుబాటు ఆరంభమై బ్రిటిష్ పాలనను దాదాపు ఊడ్చిపారేసింది. మొదటి సిపాయి తిరుగుబాటుగా మొదలై -విశాల భూభాగంలో ప్రజానీకంలో కలిసింది. లక్షలాది రైతాంగం, వృత్తి పనివారు, సిపాయిలు ఏడాది పైగా వీరోచితంగా పోరాడారు.

1857 తిరుగుబాటు ఢిల్లీ, కాన్పూరు, లక్నో, బెరెల్లీ, ఝాన్సీ, బీహార్, ఆరా ప్రధాన కేంద్రాలు -

ఢిల్లీ చక్రవర్తి బహదూర్‌షా దుర్బల వ్యక్తిత్వం, ముసలితనం, నాయకత్వ లక్షణాలు లేకపోవడం - అతని రాణి జీనత్‌మహల్ కొడుకులు అధికారం కోసం కుట్రలు చేసి బ్రిటిష్ వారితో కలిశారు. కాన్పూర్‌లో నానాసాహెబ్ మొదట బ్రిటిష్ వాళ్లను తరిమేసి పీష్వాగా ప్రకటించుకున్నాడు. అతనికి విధేయుడైన తాంతియాతోపే, గెరిల్లా యుద్ధంలో చనిపోయాడు - ఆయన హజిముల్లా పొరపాట్ల వలన - దుర్గం బ్రిటిష్‌వారి వశమయింది. లక్నో తిరుగుబాటుకు అయోధ్య బేగం నాయకత్వం వహించి - బ్రిటిష్ ముట్టడిని తిప్పికొట్టారు. ఝాన్సీ లక్ష్మీబాయి వీరోచితంగా పోరాడి, గ్వాలియర్ స్వాధీనం చేసుకున్నది. జూన్ 17 1850లో యుద్ధరంగంలో మరణించింది. ఓడిపోయిన గ్వాలియర్ రాజు సింధియా ఆగ్రాలో ఇంగ్లీషు వాళ్లతో చేరిపోయాడు. అనేక విధాల కష్టనష్టాలు చూసిన జగదీశ్‌పూర్ జమీందార్ కున్వర్‌సింగ్ బీహార్‌లో సిపాయి తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. నానాసాహెబ్‌తో కలిసి భీకర పోరాటం జరిపి యుద్ధంలో గాయపడి - తన గ్రామంలో ఏప్రిల్ 27, 1858లో చనిపోయారు.

మద్రాసుకు చెందిన మౌల్వీ అస్మదుల్లా - మద్రాసులో తిరుగుబాటు ప్రేరేపించి ఉత్తరాధికి సాగిపోయి ఫైజాబాద్‌లో యుద్ధంలో చేరాడు. అయోధ్యలో తర్వాత రోహిల్‌ఖండ్‌లో యుద్ధంలో పాల్గొన్నారు. ద్రోహి మోసంతో చంపాడు.

తిరుగుబాటు ఒక సువిశాల ప్రాంతమంతా పాకినా, జనసామాన్యంలో ఆశలు రేకెత్తించినా - దేశమంతా విస్తరించలేదు. అన్ని తరగతులను, కులాలను, వర్గాలను ఆకట్టుకోలేదు.

పిరికివాళ్లయిన స్వదేశీ సంస్థానాధీశులు, పెద్ద జమిందారులు తిరుగుబాటులో చేరలేదు, గ్వాలియర్ సింధియా, ఇండోర్ హెూల్కర్, హైదరాబాద్ నిజాం, జోద్‌పూర్ రాజా, మరి కొందరు రాజుపుత్ర రాజులు, బోపాల్ నవాబు పాటియాలా నాబాజీంద్, కాశ్మీర్ రాజులు, నేపాల్ రాణులు అనేక మంది బ్రిటిష్ వాళ్లకు క్రియాశీల సహకారం అందించారు. మొత్తంగా నూటికొక్కడు కూడా ఈ తిరుగుబాటులో చేరలేదు. బొంబాయి, బెంగాల్, పశ్చిమ పంజాబ్ రాష్ట్ర ప్రజలు తిరుగుబాటు పట్ల అనుకూలంగా ఉన్నా అందులో పాల్గొనలేదు - జమీలు కోల్పోయిన జమీందార్లు తప్ప - సంపన్నులు - మధ్యతరగతి తిరుగుబాటుకు వ్యతికంగా ఉన్నారు.

గ్రామాలల్లో రైతాంగం వడ్డీ వ్యాపారుల మీద దాడులు చేశారు. గనుక - వారు శత్రువులుగా మిగిలిపోయారు. వ్యాపారస్తులు తిరుగుబాటుదార్ల పన్నులు - వగైరా మూలకంగా క్రమంగా దూరమయ్యారు.

బెంగాల్ జమిందార్లు బ్రిటిష్ విశ్వాస పాత్రులు. బీహార్ రైతాంగం - బీహార్ జమీందార్ల మీద పోరాడటంతో బెంగాలీ జమీందార్లు భయపడ్డారు. బొంబాయి, కలకత్తా, మద్రాసు పెద్ద వ్యాపారస్తులంతా బ్రిటిష్ వారిని బలపరిచారు. అప్పటికే బ్రిటిష్ వర్తకులతో వీరందరికి సంబంధాలు ఏర్పడ్డాయి.

అప్పటికే యూరప్ పరిణామాల పట్ల వ్యామోహం పెంచుకున్న విద్యావంతులు - తిరుగుబాటును సమర్థించలేదు. మూఢనమ్మకాలు, సంస్కరణలపట్ల తిరుగుబాటుదారుల భూస్వామిక చర్యలు గమనించి - విద్యావంతులు - దూరమయ్యారు.

తిరుగుబాటుదార్లకు ఆధునిక ఆయుధాల కొరత ఉన్నది. నిర్మాణపరమైన లోపం, క్రమశిక్షణ లోపం కేంద్రీకృత నాయకత్వం, అధికారం కైవసం చేసుకున్న తర్వాత చేపట్టవల్సిన పురోగామి చర్యల దృష్టి - ఒక నూతన ప్రగతిశీల కార్యక్రమం లేనందువలన అభివృద్ధి నిరోధకులైన రాజులు, జమీందార్లు వివిధ స్థాయిల్లో నాయకత్వం వహించడానికి వీలుచిక్కింది.

అయితే భారతదేశం వివిధ ప్రాంతాల, భాషల, జాతుల, మతాల, కులాల సమారోహం - సమిష్టి ప్రయోజనాల స్పృహ - ముఖ్యంగా యూరవ్‌లో జరుగుతున్న - జరిగిన పారిశ్రామిక విప్లవానికి సంబంధించిన అవగాహనతో ఎదిగిన జాతీయ బూర్జువా వర్గం - నాయకత్వం వహించగల్గిన స్థితిలో లేకపోవడం - వీటన్నిటి సమారోహంగా - అంతిమంగా 1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం ప్రధానంగా ఫ్యూడల్ వర్గాల నాయకత్వం మూలకంగా ఓడిపోయింది. అయితే భారతదేశంలో ప్రజానీకాన్ని ఒక దగ్గరకు తీసుకరావడంలోనూ తామంత ఒకే దేశస్థులం అనే స్పృహ గల్గించడంలో చెప్పుకోదగ్గ పాత్ర నిర్వహించింది.

గుప్తుల కాలంలో ఆరంభమైన బ్రాహ్మణీయ భూస్వామ్యం, మొఘలులకాలంలో అంతకన్నా ఎక్కువగా, బ్రిటీష్ పరిపాలన కాలంలో బలం పుంజుకున్నది. వృత్తివనివారు యూరవ్‌లోలాగా భూస్వామ్యంలోనుండి పుట్టి పెరిగే అవకాశాలు సంపద కుల ప్రాతిపదికన పంపకం జరగడం వలన చీకటి ఖండాలలాంటి గ్రామాలు అనేక అంతర్గత వైరుధ్యాలతో వందల యేండ్లు ఎదుగుబొదుగు లేకుండా ఉండటం వలన -వృత్తిపనివారి జీవితం అత్యంత దుర్భరంగా సాగింది. యూరవ్‌లోలాగా పెట్టుబడిదారులుగా ఎదిగే అవకాశం లేకుండా పోయింది. మొఘలులు ఆ తరువాత యూరప్‌లో పారిశ్రామిక విప్లవం స్పూర్తితో కొంతమంది సంస్థానాదీశులు అలాంటి ప్రయత్నం చేసేలోగా - వలస పెట్టుబడి ప్రవేశించింది. వలస పెట్టుబడి జాతీయ పెట్టుబడిదార్ల అభివృద్ధిని నిరోధించింది. భూసామ్యం మరింత బలపడింది. 1858 తర్వాత భారతతేశం బ్రిటన్‌కు వలసగా మారి అర్ధవలస, అర్ధభూసామ్య లక్షణాలతో మరింత విధ్వంసకరంగా సాగింది.

రెండవదశ 1858 నుండి 1947 వరకు వలస సమాజంలో బ్రిటీష్ రాజ్యవిస్తరణ అడవినుండి సంపద, రెవెన్యూ, అటవీ సంపదలైన కలప ఇనుపఖనిజం లాంటివి అవసరమయ్యాయి, తమ పరిపాలన సుస్థిర పరుచుకునే క్రమంలో అడువుల గుండా దారులుపడ్డాయి. బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన వాణిజ్యపంటలు విస్తరించినా కూడా భూస్వాములు సరుకుల అమ్మకానికి షావుకార్లు ప్రవేశించారు. ఆదివాసీ ప్రాంతాలకు విస్తరించారు. ఈవిధంగా భూసామ్య దోపిడి, వడ్డీవ్యాపారుల దొపిడి ఆదివాసులను పీడించాయి. బ్రిటీష్‌వారు తమ పరిపాలన విస్తరించడానికి రెవెన్యూ, అటవీ చట్టాలు తెచ్చారు. స్వంత ఆస్తికి సంబంధించిన చట్టాలు భావజాలం ఆదివాసుల ఉమ్మడి జీవన విధానంలో కల్లోలం రేపాయి.

అంతేకాకుండా భారతదేశవ్యాప్తంగా ఆదివాసీ రాజ్యాలు ఈశాన్య రాష్ట్రాలల్లో, సంతాల్, నాగా, మధ్య భారతంలో గోండు, ఒరిస్సా లాంటి చోట్ల సవర ఆదివాసీ రాజ్యాలు అప్పటికే బ్రిటీష్ వారితో పోరాడుతున్నాయి. మొత్తంగా అదివాసీ ప్రాంతాల మీద బ్రిటీష్ వలస పాలనకు వ్యతిరేకంగా ఆదివాసీ తిరుగుబాట్లు దేశవ్యాప్తంగా ఉధృతమయ్యాయి. అన్ని ప్రజాపోరాటాలను వక్రీకరించినట్టుగానే ఆదివాసీ పోరాటాలను వక్రీకరించడం కూడా చెయ్యకుండా, రికార్డులు లేకండా బ్రిటీష్ వలస పాలన తుడిచేసింది.

సిపాయి తిరుగుబాటు ఆదీవాసీ ప్రాంతాలకు విస్తరించి నిలదొక్కుకోవాలనే ప్రయత్నంలో భాగంగా తాంతీయతోపే తన సైన్యంతో గోండు రాజ్యంలోకి ప్రవేశించాడు. అతనితో కలిసి అసిఫాబాద్ నిర్మల్ ప్రాంతాల్లో బ్రిటీష్ సైన్యంతో తలపడిన రాంజీగోండును నిర్మల్‌లో అతని అనుచరులతో పాటు బహిరంగంగా మర్రిచెట్టుకు 1860లో ఉరితీశారు.

1899 -1900 లో చోటానాగపూర్‌లో ప్రాంతంలో ముండార్ బీర్సా ముండా నాయకత్వంలో తిరుగుబాటు చేశారు. 1917లో మణిపూర్‌లో లూడో కుకీల తిరుగుబాటు, 1914లో చోటా నాగపూర్ ఓరాన్ల తిరుగుబాటు, బస్తర్‌లో హల్బా తిరుగుబాటు (1774-79) భూపాలపట్నం పోరాటం (1795) పరాల్‌కోట్ తిరుగుబాటు (1825), తీరాపూర్ తిరుగుబాటు (1842-54), మెరియా తిరుగుబాటు (1842-53), మహన్‌ముక్తి సంగ్రామం (1856-57), కోయల తిరుగుబాటు (1859), మురియా తిరుగుబాటు (1876), రాణీ తిరుగుబాటు (1878-1882), గుండాదూర్ నాయకత్వంలో జరిగిన భూంకాల్ తొరుగుబాటు, (1910) నుండి నేటి దాకా ఆదివాసులు స్వంత ఆస్తి కేంద్రంగాగల దోపిడి పీడన రాజ్యంతో పోరాడుతూనే ఉన్నారు.

మీడ్నాపూర్, దక్షిణబీహార్, చోటానాగపూర్, బరిల్లా చువార్లు, హోన్, కోలులు, సంతాలులు, ఖసీలు, తిరుగుబాట్లు చేశారు. మధ్యభారతంలోని భిల్లులు, ఔరంగాబాద్ సహ్యాద్రి, పర్వతాలల్లోని కోలీలు తిరుగుబాట్లు చేశారు. రాజాస్థాన్‌లోని బాన్సువాడ, దుంగాపూర్, సంత్ రాజ్యాల్లోని భిల్లులు గోవిందగురు నాయకత్వంలో పోరాడారు. 1879-80 లల్లో రంపచోడవరం, కొండరెడ్లు, కోయలు, తిరుగుబాటు చేశారు. 1922లో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో గెరిల్లా యుద్ధం ఆరంభమైనది. 1913లో నల్లమల చెంచులు తిరుగుబాటుకు సమాయత్తమయ్యారు.

1940 లో జల్-జంగల్-జమీన్ నినాదంతో ఆసిఫాబాద్ ప్రాంతంలో కొమురంభీం నాయకత్వంలో నిజాం రాజుకు వ్యతిరేతంగా సాయుధ పోరాటం జరిగింది. జోడెన్‌ఘూట్‌లో నిజాం సైన్యం భీంను కాల్చేశారు.

భారతదేశంలో ఆర్యుల ప్రవేశంనుండి ఆదివాసులు యుద్ధరంగంలోనే ఉన్నారు. భారతదేశంలో బ్రాహ్మణీయ భూస్వామ్యం తమ రాజ్యవిస్తరణను అపారమైన ఆదివాసీ పంట భూములును ఆక్రమించడానికి, విస్తరించడానికి అడవులను మైదానాలుగా మార్చారు. ఆదివాసులు అన్ని సమాజలల్లో ఈ దురాక్రమణను ప్రతిఘటిస్తూనే ఉన్నారు.

భారతదేశంలో నిరంతరాయంగా పోరాడుతున్న ఆదివాసుల రాజకీయ, ఆర్థిక, పోరాట చరిత్రను అన్ని సమాజాలు వక్రీకరించాయి. భూసామ్యం పురాణాలల్లో ఆదివాసులను రాక్షసులుగా చిత్రిస్తే, బ్రిటీష్‌వాళ్లు ఆదివాసులను దొంగలుగా చిత్రించారు. అలాంటి పురాణాలు, సాహిత్యం విరివిగా రచించి ప్రచారం చేశారు.

ఇదేకాలంలో దేశవ్యాప్తంగా అనేక రైతాంగ తినుగుబాట్లు జరిగాయి.

సన్యాసి తిరుగుబాటు (1763-1800), చునార్ తిరుగుబాటు (1760-1772), నీలి మందు పంటలకు వ్యతిరేకంగా బెంగాల్‌లో (1859-1860) కౌలు రైతు ఉద్యమాలు పాబ్నా, బోగ్రా, డాకా (1872-76), పూనా, అహ్మదాబాద్‌లో-మలబారు మోప్లా తిరుగుబాటు (1836-1885), తెబాగా (1946), తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం (1946-51).

భారతదేశంలో పారిశ్రామ పెట్టుబడిదారీ విధానం పశ్చిమ యూరప్ దేశాలల్లోలాగా పరిశ్రమల సహజ పరిణామ క్రమంలో ఏర్పడలేదు. వలస పాలనలో అక్కడక్కడ తలెత్తిన స్వదేశీ పెట్టుబడిదారీ తన సాంకేంతిక పరిజ్ఞానంతో సహా వలస పెట్టుబడి కింద నలిగిపోయింది. బ్రిటీష్ సామాజ్యవాద ప్రయోజనాల కోసం అక్కడి ఫ్యాక్టరీ పరిశ్రమ తగినంత ప్రజలల్లో సాంకేతిక పరిజ్ఞానం లేకుండానే ఇక్కడ మోపారు. పెట్టెబడిదారి వ్యవస్థ సహజ పరిణామం కాక దిగుమతి చేయబడినది. భారతదేశంలోని వర్గవైరుధ్యాల లాంటి వైరుధ్యాలతో రూపొందినది కాదు.

భారతదేశంలో మూడుదశలుగా పెట్టుబడి విస్తరించింది. 1850 నుండి మెదటి ప్రపంచం యుద్ధం 1918 వరకు మెదటి దశ. 1918

నుండి 1947 వరకు రెండవదశ. 1947 వరువాత మూడోదశ...

మొదటి దశకాలంలో భారతదేశ పెట్టుబడిదారుల యాజమాన్యం కింద జౌళి, ఇనుము, ఉక్కు పరిశ్రమలుండేవి. 19వ శతాబ్దం తొలిదశలో బొంబాయి, అహ్మదాబాదు, కలకత్తాలలో పరిశ్రమలు స్థాపించిన బ్రిటిష్ వారికి బ్రోకర్లుగా, మధ్యవర్తులుగా, అటు రాజరిక ప్రభువులలో బ్రిటిష్ పెట్టుబడిదారులతో సంబంధాలు గలవాళ్లు, దళారులుగా బ్రిటిష్ వారితో చేరిపోయారు. ద్వారకానాథ్ టాటా, బిర్లా గోయెంకా, బంగర్లు, బజారియా, జేటియా, దాల్మియా లాంటివాళ్లు, సూరత్‌మల్, శ్రీరాం చెట్టియార్లు -చైనా లాంటి చోట్లకు నల్లమందు వ్యాపారం చేసి డబ్బు సంపాదించారు. భారతదేశంలో విపరీలమైన వడ్డీలు గుంజిన వడ్డీ వ్యాపారులు, నల్లమందు వ్యాపారులు భూస్వామ్య వర్గానికి, అటు బ్రిటిష్ సామ్రాజ్యానికి మధ్యవర్తులుగా పనిచేసిన వాళ్లు దళారులుగా -బ్రిటిష్ పెట్టుబడిదారులతో కలిసి బడా పెట్టుబడిదారులుగా భారతదేశంలో -1947 వరకు నిలదొక్కుకున్నారు.

మొదటి ప్రపంచయుద్ధంలో భారతదేశంలో పరిశ్రమలు పుంజుకున్నాయి. మొదట బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి దేశీయ స్వతంత్ర పెట్టుబడిదారి అభివృద్ధికి వైరుధ్యం ఉండేది. రెండవది, భారతదేశంలో అభివృద్ధి అయిన పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంతో తీవ్రంగా కొట్లాడకుండా దళారీగా అభివృద్ధి చెందింది. మూడు, బ్రిటిష్ పెట్టుబడిదారులకు -దళారీ పెట్టుబడిదారులకు యాజమాన్యం, నిర్వహణ, లాభాల పంపకంలో తగాదాలు ఏర్పాడ్డాకూడా-అలాంటి సంఘర్షణలు సర్దుబాటు చేసుకునేవారు...

దళారి పెట్టుబడిలో - సంస్థానాధీశుల మదుపు ఉండేది. స్వభావంలోనే ఇది యూరప్‌లో లాగా -వృత్తి పనివారి నుండి కాక-అగ్రకుల భూస్వామ్యంతో కలెగల్సిపోయిన పెట్టుబడి -అంతిమంగా -ప్రజలకు, ప్రజాపోరాటాలకు వ్యతిరేక వైఖరి తీసుకున్నది.

వైరుధ్యం అప్రధానం సామాజ్యవాదంతో సహకారం దళారీ పెట్టుబడిదారుల ప్రధాన లక్ష్యం.

యూరప్‌లో జరిగిన పారిశ్రామిక విప్లవం నేపథ్యంలో-కార్మిక వర్గం ఒక ప్రజాస్వామిక శక్తిగా ఎదగడం మొదలయ్యింది. దాని రూపకల్పన 1847 మొదటి కమ్యూనిస్టు లీగ్ లండన్‌లో రహస్యంగా ఏర్పడడంతో ఆరంభమయ్యింది. 1848 ఫిబ్రవరిలో ప్రకటించిన మార్క్స్, ఎంగెల్స్ రచన, కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక ప్రపంచంలో చరిత్రని వర్గపోరాటాల చరిత్రగా విశ్లేషించింది. అన్ని రకాల దోపిడి, పీడనను తుదముట్టించి భూస్వామ్యం, బూర్జువా రాజ్యం స్థానే కార్మిక కర్షక రాజ్యాధికారం సాధించడానికి ప్రపంచ కార్మికులకు ప్రణాళిక పిలుపునిచ్చింది.

ఈ స్ఫూర్తితో ప్యారీస్‌లో 1871 అధికారం చేజిక్కించుకున్న కమ్యునార్డులు-72 రోజులు అధికారంలో ఉండి, మునుపెన్నడు లేని విధంగా ప్రజలకు హక్కులు కల్పించారు. దోపిడిదార్ల రూపాలన్నిటిని రద్దు చేశారు. స్టాండింగ్ అర్మీ రద్దు చేసి, ప్రజామిలీషియా చర్చి పెత్తనాన్ని తగ్గించారు. వడ్డీవ్యాపారం రద్దు చేశారు. రైతులకు భూమి, కార్మికులకు పనిముట్లు, ప్రజలందరికీ పని కల్పించాలని చట్టాలు చేశారు.

కార్మికవర్గపు ఆచరణాత్మక శక్తిని ప్రపంచం గుర్తించి -పీడనకు దోపిడికి గురయ్యే ప్రజలు స్ఫూర్తి పొందితే -ప్రపంచవ్యాప్తంగా దోపిడిదారులు ఈ కొత్త కార్మికవర్గ శక్తిని రూపుమాపడానికి సిద్ధపడ్డారు. బూర్జువాల తరపున జనరల్ డీ గానీ-ఫెట్-ఫ్రెంచి విప్లవానికి ద్రోహం చేసి నాయకత్వం వహిస్తున్న 30 వేలమంది కార్మికులను కాల్చి చంపారు. 45 వేల మందిని బంధించారు. 15 వేలమందిని ఉరి వేశారు. చాలా మందిని ప్రవాసం పంపారు. కమ్యూనిస్టులు స్విట్జర్లాండ్, ఇంగ్లాడ్ పారిపోయారు.

ఆతరువాత 1905లో రష్యాలో బూర్జువా విప్లవం జరిగింది. కార్మిక, కర్షక వర్గ పోరాటంలో లెనిన్ నాయకత్వంలో శ్రామికవర్గం 1917లో రాజ్యాధికారం సాధించింది.

అన్ని రకాల స్వంతాస్తిని రద్దుచేసి- ప్రజాకమ్యూన్లకు పూర్తి అధికారులు ఇవ్వడం జరిగింది. భూస్వాములు పెట్టుబడిదారులను అన్నిరకాలుగా తుడిచిపెట్టారు.

భారతదేశంలో దళారీ పెట్టుబడిదారులు ఈ పరిణామాలన్నింటిని గమనిస్తూనే ఉన్నారు... అందుకే భారతదేశంలో ప్రజలకుతో నిరంతరం శత్రువైఖరే ప్రదర్శించారు... వలన పెట్టుబడికి, భూస్వామ్యానికి లొంగిపోయారు.

భారతదేశంపు మధ్యతరగతి అభివృద్ధితోను, కార్యాచరణ ప్రారంభంతోను, ఒక ఇంగ్లీషు ఉద్యోగి హ్యూమ్ చొరవతోను, పర్యవేక్షణతోను, 1885 డిశంబర్ 28నాడు బొంబాయిలో జాతీయ కాంగ్రెస్ ఏర్పడింది. కాంగ్రెను బయటికి ఎన్ని చెప్పినా వలసపాలనలో దోపిడి పీడనలు హెచ్చి, మరొకవైపు ప్రపంచవ్యాప్తంగా ప్రజావిప్లవాలు చెలరేగుతున్న దశలో భారతదేశంలో క్రమంగా పెరుగుతున్న ప్రజాపోరాట శక్తులను, బ్రిటిష్ వలస పాలన రక్షించేందుకు -వారి కపట పెట్టుబడిదారి భావాలను కలిగి భారతదేశ బ్రాహ్మణీయ భూస్వామిక భావవాద అశాస్త్రీయ ప్రచారంతో ప్రజాప్రమేయం తగ్గించే ఎత్తుగడతో కాంగ్రెసు ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం వైస్రాయితో ముందుగానే ఏర్పాటు చేసిన ప్రణాళిక ప్రకారం ఏర్పడింది.

1873 లో భారతదేశంలో బ్రహ్మణీయ స్వభావం గురించి పూలే గులాంగిరి పుస్తకం రాశారు. కులవ్యవస్థను రద్దు చేయవల్సిందిగా బ్రిటిష్ గవర్నర్‌కు లేఖ రాశారు.

దాదాపు ఇదే కాలంలో కేరళలో నారాయణ గురు శూద్రులకు దేవాలయాలు ఏర్పాటు చేసి కులం అడగవద్దు, చెప్పవద్దు అని ప్రచారం చేశారు.

కాంగ్రెసు జాతీయోద్యమంలో చేపట్టిన పోరాటాన్ని అయిదు దశలుగా చూడవచ్చు.

**మొదటి దశ (1905-1910)**- అప్పటికి కాంగ్రెసు అధ్యక్షుడైన రమేశ్ చంద్రదత్తు -హఠాత్తుగా వచ్చే మార్పులు -విప్లవాలు అక్కరలేదు. భారతవ్యవసాయం పరిశ్రమల పక్షంగా మంత్రి సభలలోను, వైశ్రాయి కార్యవర్గంలోను కొందరు భారత సభ్యులుండాలని ఆశపడ్డారు. అంటే భూస్వాములకు దళారీ పెట్టుబడిదారులకు పరిపాలనలో భాగసామ్యం. తర్వాత అధ్యక్షుడు దాదాబాయి నౌరోజీ విద్యావంతులును బ్రిటిష్ వారు తమలో కలుపుకుపోవాలన్నాను. 1906 ఢాకాలో జిన్నా, ఆఘాఖాన్, నవాబ్ వజీర్ ఉల్‌ముల్క్ లాంటి ముస్లిం జమీందార్లు, పెట్టుబడిదారులు కలిసి ముస్లిం లీగ్ ఏర్పాటు చేశారు. ఈ సంస్థ ముస్లిం రైతాంగాన్ని మత ప్రాతిపదికగా వేరుచేయడానికి ప్రయత్నించింది.

1906 నాటికి కింగ్రెన్‌లో అతివివాదుల బృందం -1)మొదటిసారిగా 'స్వారాజ్యం' గురించి మాట్లాడి బ్రిటిష్ సామాజ్యంలో ఉంటూ స్వపరిపాలన 2)విదేశీ వస్తు బహిష్కరణ 3) స్వదేశీ ఉద్యమం

ఆరంభం 4) జాతీయ విద్య - సంవత్సరం తరువాత గోఖలే నాయకత్వంలోని మితవాదులకు, తిలక్ నాయకత్వంలోని అతివాదులకు చీలిక, బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధం తీవ్రతరం చేసేంది. 1908లో బెంగాల్‌లోని ముజఫర్‌పూర్ కుట్ర కేసులో ఖుదీరాం బోసును ఉ రితీశారు. తిలక్ మీద కేసుపెట్టి ఆరేండ్లు శిక్షవేశారు. నిరసిస్తూ బొంబాయి కార్మికులు వేలాది మంది రాజకీయలు సమ్మెకు దిగారు. సైనిక దాడులు జరుపగా అనేక మంది కార్మికులు చనిపోయారు.

20-11-1916 లో ఉత్తరదక్షిణ ప్రాంతాల మధ్య వైరుధ్యం -కాంగ్రెసును నమ్మక దక్షిణ భారతదేశంలోని అగ్రకుల జమీందారులు. బడా భూస్వాములు కలిసి జస్టిస్ పార్టీ మద్రాసులో ఏర్పాటు చేశారు. నటేశ్ మురళీధర్, త్యాగరాయ శెట్టి, పానగల్ రాజా, బొబ్బిలి అరకోట్ మొదలగువారు.

బెంగాల్ పంజాబ్ లాంటి బోట్ల రైతాంగం పెద్దఎత్తున ఆందోళనకు దాగారు. బ్రిటిష్ వారు కాంగ్రెస్‌లోని అతివాదులను అణచివేస్తూ మితవాదులతో జతకట్టారు.

**రెండవదశ 1919-1922 వరకు**- 1914-1918 వరకు మొదటి ప్రపంచ యుద్ధం జరిగింది. ప్రపంచాన్ని పెట్టుబడిదారులు పంచుకోవడానికి జరిగిన యుద్ధం అది. ఇంగ్లండు, ఫ్రాన్సు, జపాన్ అమెరికాలు ఒక పక్షం- జర్మనీ, ఆస్ట్రియా, హంగరి, టర్కీ మరో పక్షం. రష్యాలో సామ్రాజ్యంవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండి నినాదంతో కార్మిక వర్గ పార్టీ నాయకత్వంలో కార్మిక కర్షక రాజ్యం 1917లో ఏర్పడింది... పారీస్ కమ్యూన్ తరువాత కార్మికవర్గం పాత భూస్వామిక పెట్టుబడిదారి వ్యవస్థ కన్నా భిన్నమైన -శ్రామికవర్గ నియంతృత్వంలో తొలి సోషలిస్టు పురోగామి సమాజం ఆవిర్భవించింది.

కాంగ్రెసులోని మితవాదులతో గాంధీ చేరిపోయి బ్రిటిష్ వారికి మరింత దగ్గరయ్యారు. యుద్ధంలో బ్రిటిష్ వారి తరపున పోరాడారు. ఈ కాలంలో గ్రామీణ ప్రాంతాల నుండి బలవంతంగా రైతాంగం నుండి సుమూరు పది లక్షల మందిని సైన్యంలో చేర్చుకున్నారు. బైటి దేశాలకు తరలించారు. సుమారు లక్ష మంది యుద్ధంలో చనిపోయారు. అద్దూపద్దూ లేకుండా దేశమంతా ఊడ్చి ఆహారపదార్థాలు, ముడిసరుకులు ఇంగ్లండ్ తరలించారు. దేశవ్యాప్తంగా కొరత ఏర్పడింది. ప్రజలు బతకడం కోసం -కొరతను సృష్టించి అమ్మే షాపులపైన దాడులు చేశారు. అరెస్టులు, కాల్పులు... కాన్పూర్, జమాల్‌పూర్, కలకత్తా, జమ్‌షెడ్‌పూర్, షోలాపూర్ లాహెూర్, మద్రాసు నగరాల్లో సమ్మెలు జరిగాయి. పదిహేను లక్షల కార్మికులు పాల్గొన్నారు.

యుద్ధం ముగిసిన తరువాత, ఫ్లూ జ్వరాలతో కోటి నలభైలక్షల మంది చనిపోయారు. 1919లో రౌలట్ చట్టం -విచారణ లేకుండా జైలుల్లో పెట్టడం ఈచట్టం తెచ్చారు. రౌలట్ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ఏప్రిల్ నెలలో దేశమంతా హర్తాల్లు జరిగాయి. సమ్మెలు ఉ ధృతమయ్యాయి.

జలియన్‌వాలాబాగ్ దురంతం (13.04.1919) ఈకాలంలో అమృత్‌సర్‌లో జరిగింది. సుమారు 1200 మంది పోలీసు కాల్పుల్లో మరణించారు. 3600 తీవ్రంగా గాయపడ్డారు. 1920 సెప్టెంబరులో కాంగ్రెస్ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం చేపట్టింది. లెజిస్లేటర్లు, కోర్టులు, విద్యాసంస్థల బహిష్కరణ, నూలు వడకడం, పన్నుల నిరికరణ -ఇది కాంగ్రెసు కుట్ర పూరితమైన ఎత్తుగడ. కోపోద్రిక్తులైన అశేశ పీడిత ప్రజానీకం, రైతాంగాన్ని కార్మికులను పోరాటాల నుండి విడదీయడం, మొద్దుబార్చడం.

1921లో కేరళమలబార్‌లోని మోప్లా రైతుల తిరుగుబాటు ఉధృతమై కొత్త పోరాటాలు రూపాలు - భూస్వాముల ఇండ్ల మిద దాడి చేయడం, టెలిగ్రాఫ్ తీగలు కత్తిరించడం -రైలు పట్టాల తొలిగింపు, పోలీసుస్టేషన్లు పోస్టాఫీసులు, బ్యాంకులు లూటీ చేయడం చేశారు.

గాంధీ వ్యతిరేకంచాడు. రైతులు భూస్వాములకు లోబడి ఉ ండాలని కోరారు. బ్రిటాష్ వారు రాజభక్తిని కల్గించడానికి వేల్స్ యువరాజు భారతదేశంలో పర్యటించడం ఏర్పాటు చేశారు.

1922 ఆగష్టులో గోదావరి, విశాఖపట్నం అటవీ ప్రాంతాల్లో రంప సబ్ డివిజన్‌లో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో ఆదివాసీల తిరుగుబాటు జరిగింది. చింతపల్లి, కృష్ణదేవీపట్నం, రాజఒమ్మంగి పోలీస్‌స్టేషన్ల మీద దాడి చేసి మందుగుండు, తుపాకులు స్వాధీనం చేసుకొని సాయుధ పోరాటం ఆరంభించారు.

మే7, 1924 నాడు ఈస్టు కోస్టు పోలిసులు ఒక ఇన్‌ఫార్మర్ సహాయంతో సీతారామరాజును పట్టకొని కాల్చిచంపి ఎన్‌కౌంటర్ కట్టుకథ చేప్పారు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చొరవతో తాష్కెంట్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ 17.10.1920లో ఏర్పడి 1921 లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో గుర్తించబడినది. ఈ ఉద్యమాన్ని మొగ్గలోనే తుంచేయాలని బ్రిటీషు ప్రభుత్వం ముజఫర్ అహమ్మద్, ఎస్.ఎ.దాంగే షౌకత్ ఉస్మానీ, నళినీ భూషన్‌దాస్ గుప్తాలను కమూనిస్టు భావాలను ప్రచారం చేస్తున్నారని నిర్భంధించి 1924 కౌన్పూర్ కుట్ర కేసు పెట్టింది. అప్పటికే రకరకాల పేర్లతో బాంబే, మద్రాసు, పంజాబ్, బెంగాల్, పెషావర్, మీరట్, కాన్‌పూర్ ప్రాంతాల్లో పనిచేస్తున్న కమ్యూనిస్టు ప్రతినిధులతో 26.12.1925 కాన్పూర్‌లో కమ్యూనిస్టు మహసభ జరిపారు. యస్.వి.ఘాటేను కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

1919లో కాంగ్రెసు ట్రేడ్ యూనియన్ స్థాపించాలనుకొని 1920లో ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఎఐటియుసి) స్థాపించింది.

కమ్యూనిస్టు పార్టీ మిగతా అన్ని రాజకీయ పార్టీల యూనియన్‌గా స్థాపించిన ఎఐటియుసి భారత కార్మికరంగంలో పనిచేయనారంభించింది. 1924లో దేశవ్యాప్తంగా 167 యూనియన్లకు రెండు లక్షల ఇరువై మూడు వేల కార్మికులు సభ్యత్వం కలిగి ఉ న్నారు. కమ్యూనిస్టులు కూడా ఇందులోనే పనిచేశారు.

27.09.1925 హిందుత్వ పార్టీగా నాగపూర్‌లో కె.బి.హెగ్డేవార్ నాయకత్వంలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ఏర్పడింది. ముస్లిం లీగ్‌తోపాటు ఆర్‌ఎస్‌ఎస్ మత విశ్వాసాలతో పనిచేయనారంభించాయి. హిందూ అగ్రకుల భూస్వాములు, సంస్థానాధీశులు, దళారీ పెట్టుబడిదారులు - కార్మికవర్గ రాజకీయాలు, రైతాంగంలో, కార్మికుల్లో కిందికులాలు సమైక్యం కాకుండా చీలదీసే ప్రణాళికలతో దేశవ్యాప్తంగా ఒక మిలిటెంట్ సంస్థను -అవసరమైతే బ్రిటీష్ వారి పక్షాన చేరి కార్మికుల మీద, రైతుల మీద దాడి చేసే సాయుధ కార్యకర్తలను మత, కుల ప్రాతిపదికగా తయారుచేయడం, విప్లవోద్యమాలను నిరోధించడం లక్ష్యంగా పనిచేశారు.

ఈ కాలంలో అనేక ప్రజాఉద్యమాలు జరిగినా వాటిని ఒక సిద్ధాంత ప్రాతిపదికగా ఐక్యపరిచే నాయకత్వం లేక అనేక ఎదురుదెబ్బలు తిన్నాయి.

ఇదే సమయంలో జర్మనీ జియాజూ తీర ప్రాంతం మీద జపానుకు అధికారం బదలాయించడాన్ని వ్యతిరేకిస్తూ చైనాలో విద్యార్థులు యువకులు లక్షలాది మంది బీజింగ్‌లో 1919 మే 4 నాడు ప్రదర్శన నిర్వహించారు. పాత భూస్వామిక వలసవాద వ్యవస్థను వ్యతిరేకించే ప్రదర్శన ఇది. ఇది క్రమంగా పాత భూస్వామిక వ్యవస్థ మీద తిరుగుబాటు సాంస్కృతిక ఉద్యమంగా మారింది. లూషన్ లాంటి రచయితలు, ఉదారవాదులు, క్రిష్టియన్స్ లాంటివాళ్లు పాల్గొన్నా రాడికల్ మార్క్సిస్టులు నాయకత్వం వహించారు. కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ చొరవతో జులై ఒకటి 1921 నాడు కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. జులై 23, 1921 మహాసభ జరుపుకొని స్థిరపడినది. మావో, చౌఎన్‌లై, డుక్సియు లాంటివాళ్లు దీని ఏర్పాటులో ప్రముఖ పాత్ర వహించారు.

1927లో భారతీయులకు పార్లమెంటరీ ప్రజాసామ్యం సరిపోతుందా అనే విషయం పరిశీలించడానికి వచ్చిన సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా వేలసంఖ్యలో ప్రజలు "సైమన్ కమీషన్ గో బ్యాగ్" అంటూ ప్రదర్శనలు చేశారు.

దాదాపు భారతదేశంలోని అన్ని కార్మికుల సంఘాలు ఎఐటియుసి కిందనే పనిచేశాయి. వామపక్షాలు కూడా ఇందులోనే పనిచేశాయి.

20.03.1929లో దేశవ్యాప్తంగా 31 మంది కమ్యూనిస్టు ఉద్యమ నాయకులను అరెస్టు చేసి మీరట్ కుట్రకేసుగా బ్రిటిష్ ప్రభుత్వం నమోదు చేసింది.

అంబేద్కర్ మహారాష్ట్రలో అంటరానివాళ్లను ఏకంచేశారు. 1923లో చెరువునీటి వాడకం లాంటి వాటిమీద ప్రజలతో కలిసి పోరాడాడు.

**మూడవదశ 1930-1934**

12.11.1930 నుండి జనవరి 1931 వరకు లండన్‌లో మొదటి రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. సహాయ నిరాకరణలో భాగంగా గాంధీ జాతీయ కాంగ్రెసు ఆ సమావేశాన్ని బహిష్కరించింది. అణగారిన వర్గాల తరపున అంబేద్కర్ హాజరయ్యి -మొదటిసారిగా అణగారిన కులాల గురించి అంటరానితనం గురించి వివరించారు.

1930 ఏప్రిల్‌లో దండి ఉప్పు సత్యాగ్రహం యంత్ర, విదేశీ వస్తు బహిష్కరణ ముమ్మరమయ్యింది.

అంతర్జాతీయంగా రకారకాలుగా సామ్రాజ్యవాదం యుద్ధాలు, కరువుల వలన బలహీనపడి -అమెరికన్ సామ్రాజ్యం రంగం మీదికి వచ్చింది. కూటములు మారాయి. బ్రిటిన్, అమెరికా, ఫ్రాన్సు ఒక కూటమి. జర్మనీ, జపాన్, ఇటలీ మరోవైపు.

మార్చి 1931న ఇర్విన్ ఒడంబడిక జరిగింది. బిర్లాలు గాంధీ వెనుక నిలబడ్డారు. ఆందోళనాలు సహాయ నిరాకరణ పోయి చర్చలు, సంప్రదింపులకు కుదించారు. భగత్‌సింగ్, రాజుగురు, సుఖ్‌దేవ్‌లను 23.03.31 లాహోర్‌లో ఉరితీశారు. గాంధీ నోరు మెదపలేదు. ఆదివాసీ ప్రాంతాల్లో సామ్రాజ్యవ్యతిరేక పోరాటాలు ఉధృతమయ్యాయి. అణచి వేతలు తీవ్రమయ్యాయి.

7.09.1931 నుండి 1.12.31 దాకా రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో అధికారం బదిలీ చేసి తమకు ప్రత్యేక ఓటర్ల నియోజకవర్గాలు ఇవ్వాలని అంబేద్కర్ కోరారు. గాంధీతో విభేదం.

దేశవ్యాప్తంగా అన్ని ప్రాంతాల్లో ప్రజాపోరాటాలు ముమ్మరమయ్యాయి. లక్షా ఇరువై వేలమందిని అరెస్టు చేశారు. గ్రామీణ ప్రాంతాలలో పోలీసు క్యాంపులు, ఆస్తి విధ్వంసం కాల్చివేయడాలు, మహిళల మీద దాడులు... మహాత్మా గాంధీ ఇలాంటి హింసను ప్రతిఘటించకుండా ప్రజా పోరాటాలను మొద్దుబార్చడానికి అహింస, సత్యాగ్రహం ముమ్మరం చేశాడు. గాంధీ ఇర్విన్ ఒప్పందం ప్రకారం సహాయ నిరాకరణోద్యమం విరమించుకొని చర్చలు సంప్రదింపులకు దిగాడు.

చిట్టగాంగ్, పెషావర్‌లల్లో కార్మికుల తిరుగుబాట్లు జరిగాయి.

మూడవ రౌండ్ టేబుల్ సమావేశం ఆగస్టు 1932లో జరిగింది. అంబేద్కర్ తన మొదటి డిమాండును కోరారు. బ్రిటిష్ వారు అణగారిన వర్గాలకు ప్రత్యేక ఓటింగ్ పద్ధతిని అనుమతించారు. గాంధీజీ అమరణ నిరాహారదీక్ష పట్టారు. రాజకీయ నాయకులందరి ఒత్తిడితో సుదీర్ఘ చర్చల అనంతరం అంబేద్కర్ గాంధీల మధ్య 26.09.1932 పూనా ఒప్పందం జరిగింది. బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించింది. గాంధీ దీక్ష విరమించారు.

అంబేద్కర్ 1932 లో ఒక ఉపన్యాసంలో మొదటి సారిగా భారతదేశంలో తన కులనిర్మూలనా ప్రసంగాన్ని తయారుచేశారు. భారతదేశంలో సంపద, అభివృద్ధి కుల ప్రాతిపదికగానే జరిగిందని- నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ భారతీయ సమాజాన్ని అంతర్గత కలహాలతో- వర్గ పోరాటం చేసే దిశగా-వర్గ సమాజంపు అభివృద్ధి దిశగా అభివృద్ధి కానివ్వలేదని ప్రతిపాదించారు.

(ఇంకా ఉంది)

---

(41వ పేజీ తర్వాత)

మతాలకు రాజకీయ లక్ష్యాలు వుంటాయి. అవి ఆ మతాల సాంప్రదాయాలకు భిన్నమైనవేమీ కాదు. ఈ రాజకీయ ఉద్దేశాలు మతాల సాంప్రదాయాలను సమాజానికి నష్టం కలిగించే రీతిలో మార్పుకు గురిచేస్తాయి.

హిందూయిజాన్ని స్వంతం చేసుకోవాలనుకునే హిందుత్వవాదాన్ని నిరాకరించే హిందువుల ముందున్న సవాల్ చిన్నదేమీ కాదు. కులతత్వం, ఇస్లాం పట్ల ద్వేషం, జాతీయ దురహంకారం, స్త్రీల పట్ల ద్వేషం ఇలాంటి అంశాల గురించి మనం తీవ్రంగా పట్టించుకోవాలి. హిందుత్వ గురించి సరైన ప్రశ్నలు అడుగుతున్నామా లేదా అని ఆలోచించుకోవడం ద్వారానే మనం ముందుకు సాగగలం. హిందుత్వ మూలంగా నష్టపోతున్నవాళ్లకు మనం మన చర్చల్లో అర్థవంతమైన జాగాను కల్పించగలుగుతున్నామా లేదా అని ఆలోచించాలి.

(షానా సిప్పి అమెరికాలోని కెంటకీ రాష్ట్రంలో సెంటర్ కాలేజీలో మత సంబంధ శాస్త్రంలో అసిస్టెంట్ ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు.
శైలజా కృష్ణమూర్తి కెనడాలోని హాలీఫాక్స్‌లో సెయింట్ మేరీ యూనివర్శిటీలో మత అధ్యయనాలు మరియు మహిళలు, లింగ పర అధ్యయనాలు శాఖలో అసోసియేట్ ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు.)

అనువాదం: సి.యస్.ఆర్. 




# రైతాంగ పోరాట చరిత్రలో లఖింపూర్ ఖేరి

**అనూషా**

ఫాసిస్టుల అహంకారానికి తాజా ఉదాహరణ ఉత్తరప్రదేశ్‌లోని లఖింపూర్ ఖేరి ఘటన. రైతులు ఉద్యమం వారికి నిద్రపట్టనివ్వడం లేదు. లొంగని ధిక్కారం సహింపశక్యంగాకుండా ఉంది. అది వారి అధికార గర్వాన్ని భగ్నం చేస్తోంది. నిందలు వేశారు, కుట్రలు చేశారు, కుట్ర కేసులు మోపి చిత్రహింసలు పెట్టారు, చాటుగా దెబ్బకొట్టాలని చూశారు. ఎన్ని చేసినా ఉద్యమం వెనకడుగు వేయలేదు. చివరికి ప్రత్యక్ష హింసకు దిగారు.

శాంతియుతంగా నిరసనలు చేస్తున్న రైతులపైకి బీజేపీ పార్టీకి చెందిన కేంద్ర సహాయ మంత్రి తనయుడు వాహనం ఎక్కించి హత్యకు పాల్పడ్డాడంటే ఉద్యమించే రైతులపట్ల వీళ్ళెంత ప్రతీకారంతో ఉన్నారో అర్థం చేసుకోవచ్చు. ఇదేదో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన అనుకోవడానికి వీలులేదు. దీని వెనుక ఎంతో కాలం నుండే పతక రచన జరిగిందని తెలుస్తోంది. ఈ ఘటన జరగడానికి సరిగ్గా నెల రోజుల క్రితం కేంద్ర సహాయ మంత్రి అజయ్ కుమార్ మిశ్రా రైతు ఉద్యమంపై తీవ్ర వ్యాఖ్యలు చేశాడు. ఇది కేవలం 10-15 మంది మాత్రమే చేస్తున్న నిరసన అని, తలుచుకుంటే వారిని లైన్‌లో ఉంచడానికి కేవలం రెండు నిమిషాలు చాలునని అభ్యంతరకరంగా మాట్లాడాడు. దాదాపుగా సంవత్సర కాలం నుండి లక్షలాదిమంది రైతులు, తమ సహచరులను కోల్పోతూ కూడా శాంతి యుతంగా నిరసన తెలుపుతుంటే, సమస్యలకు పరిష్కారం చూపించాల్సిన నాయకులే ఇలా మాట్లాడటం రెచ్చగొట్టడం కాకుండా ఏమవుతుంది.

ఈ దేశ రాజ్యాంగం ప్రతి పౌరుడికి జాతి, మాత, కుల, లింగ భేధం లేకుండా నిరసన తెలిపే హక్కు ఇచ్చింది. కానీ ఇవేవీ అధికారంలో ఉన్న అహంకారులకు లెక్కలేదు. తమ ప్రభుత్వం తీసుకున్న ప్రజా వ్యతిరేక నిర్ణయాలపై ఎవరు అభ్యంతరం చెప్పిన, నిరసన వ్యక్తం చేసిన కన్నెర్ర చేస్తుంది. దాన్ని విచ్ఛిన్నం చేయడానికి ఎంతకైనా తెగిస్తుంది. దీనివెనుక సంఘ విద్రోహ శక్తులు, విచ్ఛినకారులు ఉన్నారని తప్పుడు కథనాలను సృష్టిస్తుంది. అది కుదరదనుకుంటే నిరసన శిభిరంలోకి తమ కిరాయి గుండాలను పంపి విచ్ఛిన్నం చేసేందుకు ప్రయత్నిస్తుంది. అది మొన్న జేఎన్యూ, అలిఘర్ యూనివర్సిటీ ఆందోళనలో నిన్న సీఏఏ, ఎనర్సీ, నేడు రైతు ఆందోళనలు చూస్తూనే ఉన్నాం.

బీజేపీ ప్రభుత్వానికి ప్రజాసమస్యలంటే లెక్కలేదు. ఎంతసేపు కార్పొరేట్ కంపెనీలను ఊడిగం చేయడం తప్ప. అందుకు ఎంతకైనా తెగిస్తుంది. బహుశా ఈ దేశాన్ని ఏలిన బ్రిటీష్ వాళ్ళు సహితం ఇంత క్రూరంగా వ్యవహరించకపోవచ్చు. తమని ఎన్నుకున్న ప్రజలపైనే ఇంతటి నిర్బంధాన్ని ప్రయోగించడం మోడీ ప్రభుత్వానికే చెల్లింది. స్వతంత్ర భారత దేశ చరిత్రలో సుదీర్ఘ కాలం ప్రజలు ఆందోళన నిర్వహిస్తున్న ఘటన మోడీ హయాంలోనే జరుగుతున్నది. ఈ ప్రభుత్వం తీస్కొచ్చిన రైతు వ్యతిరేక చట్టలకి వ్యతిరేకంగా గత 10 నెలలుగా ఢిల్లీ నుండి ప్రతి గల్లీ గల్లీలోనూ రైతులు వారి ఉద్యమల్ని ముందుకు తీసుకురావడం, ఎంతటికి వెనక్కి తగ్గకపోవడం వల్ల పీకల దాకా కోపం తెచ్చుకున్న ప్రభుత్వ అనుయాయులు లఖింపూర్ ఖేరిలో ప్రొటెస్ట్ చేస్తున్న వారిపై నుండి జీప్ ని తీసుకెళ్ళి, బుల్లెట్స్ పేల్చి వారిని చంపి పగ తీర్చుకున్నారు.

అధికార కాండకావరంతో మంత్రి తనయుడు రైతుల మీదినుండి జీవ్‌ని తీసుకెళ్ళాడని అక్కడ ప్రత్యక్ష సాక్షాలు కనిపిస్తున్నప్పటికీ, లేదు రైతులే మా మీద రాళ్లతో దాడి చేయడంతో వాహనం బాలన్స్ కోల్పోయి పొరపాటున వారి మీదుగా పోయింది అని, అసలు ఆసిస్ మిశ్రా ఆరోజు అక్కడ లేదు అని మంత్రిగారు మాట్లాడటం చూస్తుంటే అధికార బలం ఎంత ఉందనుకోవాలి.

కేంద్ర సహాయ మంత్రి అజయ్ మిశ్రా అబద్దపు మాటలని పటపంచాలు చేస్తూ తెల్లారే సామాజిక మాధ్యమాల్లో వైరల్‌గా మారిన వీడియో మంత్రిగారి మాటలు ఎంత అబద్ధమో.. అక్కడ జరిగిన ఘటన ఎంతటి క్రూరమైనదో యావత్ ప్రపంచానికి చాటింది. నిరసన వ్యక్తం చేస్తున్న రైతులు ఎలాంటి హడావిడి లేకుండా, సైలెంట్‌గా, వాళ్ళ చేతుల్లో నల్ల జెండాలని పట్టుకొని నిరసన వ్యక్తం చేయడం అందులో చూడవచ్చు. నిరసనకారులపైకి వేగంగా జీప్ దూసుకొస్తూ, నిర్దాక్షిణ్యంగా వాళ్లపై నుండి వెళ్లడం ప్రపంచం అంతా చూసింది. రెండో వీడియోలో ఇంకో జీపులోంచి ఒక వ్యక్తి దిగి పరుగెత్తుకుంటు వెళ్లిన దృశ్యాలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. ఆ వ్యక్తి సుమిత్ జైస్వాల్ అనే స్థానిక బీజేపీ నాయకుడని, అతను ఆసీస్ మిశ్రాకు అత్యంత సన్నిహితుడని తెలిసింది. ఇదంతా చూస్తుంటే ఒక పథకం ప్రకారం ఆందోళన చేస్తున్న రైతులను రెచ్చగొట్టడం.. వాళ్ళు నిరసన పేరుతో అడ్డువస్తే విచక్షణారహితంగా వెహికిల్‌తో తొక్కించే ప్లాన్‌తో సిద్ధపడే వచ్చారని అర్థమవుతోంది.

కుస్తీ పోటీలకు హాజరైన కేంద్రమంత్రి అసిస్ మిశ్రా, ఆయనతోపాటు వచ్చిన ఆ రాష్ట్ర ఉపముఖ్యమంత్రి కేశవ్ ప్రసాద్ మౌర్యలు క్రీడల గురించి మాట్లాడకుండా రైతుల గురించి మాట్లాడారంటేనే అర్థం చేసుకోవచ్చు వాళ్ళ ఉద్దేశం ఏమిటో. పోనీ ఆ రైతుల గురించి ఏమైనా పాజిటివ్‌గా మాట్లాడారా అంటే అదీ లేదు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన చేస్తున్న ఈ రైతుల అంతు చూడాలని, అందుకు మీరు జైల్‌కి వెళ్లినా నాయకులుగా తిరిగి వస్తారు అంటూ విద్వేష పూరిత వ్యాఖ్యలు చేయడం ఈ మారణహోమానికి కారణం కాదనుకోవాలా...?

ప్రశాంతమైన వాతావరణంలో నిరసనల మధ్య రైతులు లంగర్‌లో భోజనాలు చేసుకొని తిరిగి వస్తుంటే స్వయంగా మంత్రి అజయ్ మిశ్రా రైతుల దగ్గరకి వచ్చి వారిని బెదిరించాడని స్వయంగా రైతులు వాపోవడం చూస్తుంటే ఈ ఘటన యాదృచ్ఛికం అని ఎలా అనుకోవాలి.

ఈ మొత్తం వ్యవహారంలో పోలీసుల పాత్ర మరీ అన్యాయంగా ఉంది. తమ కళ్ళముందే అధికార బలుపుతో రైతులను వాహనాలతో తొక్కిస్తున్నా ఏదో సినిమా చూసినట్టు చూస్తూ ఉన్నారే తప్ప నిందితులను పట్టుకోవడం కానీ బాధితులకు అండగా ఉండటం కానీ ఏదీ చేయలేదు. పైగా రైతుల మీదే హుకుం చెలయించాలని చూశారంటే అంటే అన్యాయం కళ్ళ ముందే జరుగుతున్న అధికారాన్ని ఉపయోగించుకోలేక రాజ్యం చేతిలో ఎంతలా కీలుబొమ్మలుగా మారిపోయారో అర్థం చేసుకోవచ్చు. వాస్తవానికి ఆ ఘటన బహిరంగ హత్య కిందకి వస్తుంది. ఎవరి అనుమతి లేకుండా సెక్షన్ 307 ప్రకారం అసలు వారెంటే లేకుండ అరెస్ట్ చేసి లోపలేయాలి. అలా కాకుండ నిందితులు వీళ్ళ కళ్ళముందే పొలాల వైపు పరిగెత్తడం (పారిపోవడం) చూస్తుంటే ఇదంతా ముందస్తు ప్రణాళికలో భాగంగా అంటే పోలీసులే కావాలనే గాలికొదిలేసినట్లు అర్థమవుతోంది. పైగా ఆ ఘటన జరిగాక ఆసిస్ మిశ్రా నిర్భయంగా మీడియా ముందుకొచ్చి ఇంటర్వ్యూలు కూడ ఇస్తున్నాడు అంటే చట్టం వాడికి ఎంతటి చుట్టరికమో అర్థం అవుతుంది.

ఈ ఘటనపై దేశవ్యాప్తంగా ఆందోళన మొదలయ్యాక పోలీసులు తీరిగ్గా ఆసిస్ మిశ్రా ఇంటికి వెళ్ళి వాడి ఇంటి గేటుకు నోటీసు అంటించి అక్టోబర్ 8న మీరు పోలీసుల ముందు హాజరు కావాల్సి వుంది అని చెప్పివచ్చారే తప్ప అరెస్టు కూడా చేయలేదు. అదే ఆసిస్ మిశ్రా కాకుండ, ఒక సామాన్య, పేద, మధ్యతరగతి కుటుంబానికి సంబంధించిన వ్యక్తి మర్డర్ చేసి వుంటే పోలీసులు ఇలాగే వ్యవహరిస్తారా?? అక్కడే నాలుగు తన్ని 4 నిమిషాల్లో లోపలేయారు??

పోలీస్ వ్యవస్థ, ప్రభుత్వం వాళ్ళది కాబట్టి వాళ్ళు హత్యలు మానభంగాలు చేసిన చెల్లుతుంది.

పోలీసుల వ్యవహారం ఇలా ఉంటే మీడియాది ఇంకో రకం. వాస్తవాలేంటో సోషల్ మీడియాలో చక్కర్లు కొడుతుంటే బాధితుల వైపు నిలబడాల్సింది పోయి, రైతులు జరిపిన కొట్లాటలోనే లాఠీ దెబ్బలు తగిలి మీవాళ్లు చనిపోయారు కదా అని పోస్ట్ మార్టం రిపోర్ట్ కూడా రాకముందే వాళ్ళ ఇష్టానికి వాళ్ళ మాటల్ని వీళ్ళ నోటి ద్వారా చెప్పించాలనుకోవటం, వీరేంతటి పాదదాసులైపోయారో చెప్తుంది. అది వారి సిగ్గులేనితనానికి నిదర్శనం. అయిన రైతులు కర్రలతో దాడి చేసారు అంటూ వార్తలు ప్రసారం చేస్తున్న మీడియాకి ముందు వాళు ్ళ జీప్‌తో వొచ్చి గుద్దింది, బుల్లెట్లు పేల్చి హింసని సృష్టించింది కనిపించలేదా? వాళ్లొచ్చి, చంపుతున్న, బుల్లెట్లు పేల్చుతున్న రండి చంపండి, కాల్చండి అంటూ రైతులు నిమ్మళంగా వారి బుల్లెట్ల దెబ్బలు తగిలి చనిపోవాలా? ఎంతటి సిగ్గులేదు వీళ్ళకి!

చివరికి ఉత్తరప్రదేశ్‌కి సంబంధించిన అడ్వకేట్స్ శివ్ కుమార్ త్రిపాఠి, సిఎస్ పాండ ఈ కేస్ గురించి సుప్రీంకోర్ట్‌లో పిల్ వేస్తే తప్ప పోలీసుల్లో కదలిక రాలేదు. సుప్రీం కోర్ట్ ఈ కేసుకు సంబందించి ఎక్కడ ఇన్సిడెంట్ జరిగింది, ఎలా జరిగింది, హంతకులు ఎవరు, ఎంత మంది చనిపోయారు, ఎఫ్ఐఆర్ ఎవరి మీద రిజిస్టర్ అయింది వంటి ప్రశ్నలతో పాటు, బుల్లెట్లు పెల్చి, హత్యలు చేసిన హంతకున్ని లా ప్రకారం అరెస్ట్ చేసి లోపలేయకుండ పోలీసులు వాడి ఇంటికెళ్లి నోటీసు అట్టించి వాన్ని వీళ్ళదెగ్గరికి రమ్మని వేడుకొని రావడం ఏంటి అని చివాట్లుపెట్టింది. ఈ కేసుకు సంబంధించి కొంతమంది సీబీఐ విచారణ జరపాలని కోరుతున్నప్పటికీ స్వయంగా సుప్రీం కోర్టు తోసిపుచ్చింది. సిబిఐ కేంద్ర ప్రభుత్వం ఆధీనంలో ఉన్నప్పుడు నేరంలో కేంద్ర మంత్రి, అతని తనయుడి పాత్ర ఉన్నప్పుడు న్యాయం జరిగే అవకాశం తక్కువ అని అభిప్రాయం వ్యక్తం చేసింది. నిజమే సుప్రీం కోర్ట్ అన్నట్టు ఇక్కడ ఎన్ఐఎ, సిబిఐ వంటి చట్టబద్ధ సంస్థలన్నీ అధికారంలో ఉన్న పెద్దలను కాపాడుతూ, అమాయకులను వేధించదానికే ఉపయోగించే చోట రైతులకి న్యాయం జరుగుతుందని ఆశించడం మన అమాయకత్వమే అవుతుంది.

ఎన్ని ఆటంకాలు, అవమానాలు ఎదురైన లాఠీ దెబ్బలు, తూటలు అన్నింటిని తట్టుకుంటూ, కన్న వాళ్ళని, కడుపున పుట్టిన బిడ్డల్ని పోగొట్టుకుంటూ కూడ రైతులు వారి హక్కుల్ని, అస్తిత్వాలని కాపాడుకోడానికి కొన్ని నెలలుగా పోరాడుతూనే వున్నారు. చట్టాలు రద్దు చేసేదాకా వెనక్కి తగ్గేదే లేదు అని గట్టిగ చెప్తున్నారు. వాస్తావానికి ఈ పోరాటం వారిది మాత్రమే కాదు, కడుపుకు అన్నం తింటున్న మనందరిది కూడ. రేపటి భారతం పస్తుండకూడదు అంటే మనమందరం ఆ రైతులకు అండగా నిలబడాల్సిన అవసరం ఉంది. వారితో చేయి కలిపి పోరాడాల్సిన అవసరం ఉంది. మన కళ్ళముందే జరుగుతున్న ఈ చారిత్రాత్మక పోరాటంలో మనం భాగస్వామ్యం అవ్వకపోతే భవిష్యత్తు తరాలముందు మనం కూడా దోషిగా నిలబడాల్సి వస్తుంది. 






పౌరహక్కుల సంఘం (CLC)




రాజ్యాంగం, చట్టాలు, హక్కుల ప్రాధాన్యతను లోటుపాట్లను ప్రజలు పోరాటాలలోనే తెలుసుకుంటారు. పోరాటాలే హక్కులను రక్షిస్తాయి. హక్కులు వ్యక్తిగతంగా చాలా ఉపయోగం. అదే సమయంలో హక్కులు అన్యాయాన్నీ, దోపిడీనీ, పీడననూ ప్రశ్నించడానికి అవసరం. ఆ ప్రశ్నలకు అవసరమైన జ్ఞానాన్ని సమాజానికి అందించాల్సిన బాధ్యత మనదే.

మనం ప్రతినిత్యం చైతన్యంతో, జాగురూకతతో ఉండాలి. సత్యం వైపుగా అన్యాయాన్ని ఎదిరిస్తూ దృఢంగా, సమిష్టిగా అడుగులు వేయాలి.

జ్ఞానం మనలో ఆత్మవిశ్వాసం పెంచుతుంది. ధైర్యాన్ని, స్థైర్యాన్ని నింపుతుంది. ప్రశ్నించే స్వభావాన్ని నిద్రలేపుతుంది. పోరాడే శక్తినిస్తుంది. కొత్త సవాళ్ళు, సామాజిక సంచనాలు సంభవించే ప్రతీ తరుణంలో మనల్ని మనం జ్ఞానంతో సుసంపన్నం చేసుకోవాలి. పోరాడే నిరుపేదలు, శ్రామికులు, రైతుల కోసం, వారి హక్కుల కోసం జ్ఞానం అనే ఆయుధంతో మనమెప్పుడూ సిద్ధంగా ఉండాలి. మాట్లాడే హక్కు పోరాడే హక్కుకు మద్దతుగా, సమిష్టిగా మనం గొంతు కలపాలి. అప్పుడే నూతన, మానవీయ సమాజం వైపుగా జరిగే ప్రయత్నాల్లో మనం కూడా సంతృప్తికరంగా పనిచేశామన్న సంతోషం మనకు శక్తినిస్తుంది. మన కార్యాచరణను విస్తృతం చేస్తుంది. ప్రజలకు దగ్గరవ్వాలి. ప్రజల్లో కలసిపోవాలి.

– ప్రొఫెసర్ ఎస్.శేషయ్య

ARUNATARA A Literary and Cultural Telugu Monthly Journal RNI Regn. No. 21152/72
November, 2021 Vol.: 49 Issue: 8 Vijayawada

# అరుణతార నిర్వహణకు విరాళాలివ్వండి
# శాశ్వత నిధి ఏర్పాటుకు సహకరించండి

విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార 1977 నవంబర్ నుంచి మాస పత్రికగా వస్తోంది. సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం విప్లవ, విప్లవ సాహిత్యోద్యమాల్లో నిర్వహించుకున్న తన రాజకీయ, సాహిత్య, మేధో పాత్రకు వాహికగా తెలుగు సమాజంపై ప్రభావం వేస్తున్నది. గత మూడు తరాలుగా ఎందరో రచయితల, బుద్ధిజీవుల ఆలోచనా వికాసానికి వేదికగా ఉన్నది. సాహిత్య పత్రిక అయినప్పటికీ సామాజిక, రాజకీయార్థిక, సిద్ధాంత విశ్లేషణలకు, చర్చలకు, అన్వేషణకు సృజనశీలమైన మాధ్యమంగా కొనసాగుతున్నది. నక్సల్బరీ శిశువుగా విరసం తాను ఎంచుకున్న విప్లవోద్యమ ప్రచార కర్తవ్యంలో అరుణతార పాత్ర గణనీయం. 1970లలో ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమ పునర్నిర్మాణ దశ నుంచి ఇవాళ దేశవ్యాప్తంగా సాగుతున్న విప్లవ, ప్రజా పోరాట సంచలనాలను అరుణతార తన శక్తినంతా వెచ్చించి అక్షరబద్ధం చేస్తున్నది. మరీ ముఖ్యంగా ఛత్తీస్‌ఘడ్‌లో సల్వాజుడుం దుర్మార్గాలు మొదలైనప్పటి నుంచి ఇవ్వాల్టి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడో దశ, సాల్వాజుడుం రెండో దశ దాకా దండకారణ్య ప్రజా యుద్ధాన్ని, ప్రజారాజ్యాధికారాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్ని, అక్కడ సాహిత్య, సాంస్కృతిక వికాసాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నది, విశ్లేషిస్తున్నది. దండకారణ్య విప్లవోద్యమానికి సంఘీభావ హస్తాన్ని అందిస్తున్నది. ఈ పనిలో ఇతర ప్రజాస్వామిక పత్రికల పాత్ర కూడా ఉన్నప్పటికీ అరుణతార దాన్నే ఒక ప్రధాన కర్తవ్యంగా స్వీకరించింది. ఇటీవల పెరిగిపోయిన హిందూ ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా లౌకిక, ప్రజాస్వామిక కంఠస్వరాన్ని బలంగా వినిపిస్తున్నది. వేర్వేరు సామాజిక ఉద్యమాల ఆకాంక్షలను ఎత్తిపడుతూ వాటి న్యాయబద్ధతను విశ్లేషిస్తున్నది.

ప్రజాఉద్యమాల్లోని కార్యకర్తల సృజనాత్మక వ్యక్తీకరణలకు అరుణతార అవకాశం ఇవ్వడం వల్ల వాళ్లలోంచి ఎందరో ప్రతిభావంతులైన ఆలోచనాపరులు, రచయితలు తయారువుతున్నారు. అరుణతార ఈ పని ఆది నుంచి చేస్తున్నది. అందువల్ల ఒక పక్క లబ్ధప్రతిష్ఠుల రచనలతోపాటు ఎప్పటికప్పుడు కొత్త గొంతులు అరుణతారలో వినిపిస్తుంటాయి.

అయితే మొదటి నుంచీ అరుణతార అనేక ఆర్థిక, నిర్వహణ సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక్కోసారి ఈ ఇబ్బందులు కాస్త తక్కువగా ఉన్నా, ఇటీవల తీవ్రమైన సంక్షోభాల మధ్య ఎప్పటికప్పుడు అభిమానుల, మిత్రుల అండదండలతో నడుస్తున్నది. గతంలో ఒకసారి అరుణతారకు విరాళాలు వద్దు:: చందాలు కట్టండనే ఆదర్శాన్ని కూడా అమలు చేసింది. అయితే నానాటికి పెరుగుతున్న ప్రెస్ ఛార్జీలు, నిర్వహణ ఖర్చులు మోయలేని భారమయ్యాయి. దీంతో రెండు నెల్లకో సంచిక వచ్చిన సందర్భాలూ ఉన్నాయి. అయితే పేజీలు పెంచి పాఠకులకు మరిన్ని రచనలు అందిస్తూ వచ్చాం.

ఈ అన్ని అనుభవాల దృష్ట్యా అరుణతారకు శాశ్వత నిధి తయారు చేయకుండా ఇక పత్రికను నాలుగు కాలాల పాటు నడపడం అయ్యేపని కాదని తేలింది. ఇంత కాలం అభిమానుల సహకారంతోనే నడుస్తూ వచ్చిన అరుణతార ఈసారి శాశ్వత నిధి కోసం మీ ముందుకు వచ్చింది. ఇవాళ ఉన్న విప్లవోద్యమ ప్రత్యేక పరిస్థితుల్లో అరుణతార అవసరం ఎంత ఉన్నదో పాఠకులకు తెలుసు. తెలుగు నేల మీద, దేశంలోని ఇతర ప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్న అసంఖ్యాక విప్లవాభిమానులు తలా ఒక చేయి వేస్తే శాశ్వత నిధి సమకూరడం కష్టమేమీ కాదని మా నమ్మకం. దాంతోనే మీ ముందుకు వచ్చాం. విప్లవోద్యమ రాజకీయ, సాంస్కృతిక వేదిక అరుణతారకు మీవంతు విరాళాలు ఇవ్వాలని, ఇప్పించాలని కోరుకుంటూ...

అరసవిల్లి కృష్ణ,= విరసం అధ్యక్షుడు, ఎంఎ బాసిత్=ఉపాధ్యక్షుడు, కాశీం=కార్యదర్శి, రివేరా=సహాయకార్యదర్శి,
వరవరరావు, టి. కృష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి. కళ్యాణరావు, వి. చెంచయ్య, అల్లం రాజయ్య,
ఎం. రత్నమాల, పాణి, పి. వరలక్ష్మి, రాంకీ

**చందాలు, విరాళాలు పంపాల్సిన చిరునామా :**

అరసవిల్లి కృష్ణ, 6-1/16-7A/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001

**చెక్‌లు/డ్రాఫ్టులు/ఆన్‌లైన్‌లో పంపడానికి :**

A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714,
Branch : Vagu Center, Vijaywada.

If undelivered please return to:
ARUNATAARA
6-1/16-7A/1, Peddiraju Street
Prizer peta, Vijayawada - 520 001
Andhrapradesh

TO
Mr/Mrs.

EDITED, PRINTED, PUBLISHED BY ARASAVILLI KRSIHNA AND OWNED BY DUVVURI VENKATA KRISHNA RAO. PRINTED AT VISALAANDHRA VIGNANA SAMITHI, CHANDRAM BUILDINGS, CHANDRA RAJESWARA RAO ROAD, MACHAVARAM (PO), VIJAYAWADA - 520 004, ANDHRAPRADESH STATE (New Declaration Filed), PUBLISHED AT 6-1/16-7A/1, PEDDIRAJU STREET, PRIZER PETA, VIJAYAWADA - 520 001, ANDHRAPRADESH STATE, EDITOR : ARASAVILLI KRISHNA



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M198 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | bhanu |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |